శ్రీప్రభాకరపరిశోధకమండలి
ప్రచురణము 6.

# చాటుపద్యమణిమంజరి

ద్వితీయభాగము

ప్రథమసంపుటము



శ్రీ వేటూరి - ప్రభాకరశాస్త్రిగారిచే
సంపాదితము

ప్రకాశకులు

మేనేజరు - మణిమంజరి

ముక్త్యాల (కృష్ణా)

1952] [నాలుగు రూపాయలు

# విజ్ఞప్తి

ఆంధ్రవాఙ్మయమున మఱుగున పడియున్న చాటుపద్యములను, చారిత్రక విశేషములను సేకరించి 'చాటుపద్యమణిమంజరి' యను పేర నొక గ్రంథమును శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మొట్టమొదటగా 1914 సం. లో ప్రకటించి యుండిరి. ప్రకటించిన వెంటనే ప్రతు లన్నియు నమ్ముడు పోయినవి. పునర్ముద్రణమునకై యాగ్రంథభాగమున నెన్నో క్రొత్త పద్యములను జేర్చి కాపీరైటుతో సహా 1917 సం. లో వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండు సన్సువారి కిచ్చివేసిరి. ప్రథమభాగముగా వెలసినయాగ్రంథము కొన్ని ముద్రణము లయి యిప్పటికిని వావిళ్లవారివద్ద లభించుచున్నది.

ఆప్రథమభాగమును కూర్చినప్రకారముననే చాటుపద్యమణిమంజరి ద్వితీయ భాగమును కూడ సమకూర్చి శ్రీశాస్త్రిగారే 1922 లో మఱొకగ్రంథమును ప్రకటించి యుండిరి. అదియు వెంటనే అమ్ముడు పోవుటచేత సర్వాంధ్రదేశ వ్యాప్తమయి యున్న యీగ్రంథమున మఱి యెన్నో క్రొత్త పద్యములను, విశేషాంశ ములను జేర్చి, పునర్ముద్రణమునకయి గ్రంథమును సిద్ధముఁ జేసి త్వరలో ప్రకటింప వలెనని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ఉత్సాహపడుచుండిరి.

శ్రీ శాస్త్రిగారు ఆంధ్రదేశ మెల్ల ప్రాచీనగ్రంథసంపాదనార్థమై సంచరించు సందర్భమున దొరకినప్రాచీన తాళపత్ర సంపుటము నెల్ల కన్నులు చిల్లి పోడుచుకొని కలయ వెదకియు, కనబడినవారి నెల్ల నడిగియు, వారి నిరంతరపరిశోధన కందిన యనేకవిషయముల నెల్ల సమకూర్చి కథాసందర్భముల యానుపూర్విలో నిందు పొందుపఱిచి యాంధ్రదేశమునకు సమర్పించియున్నారు.

గవర్నమెంటు ఓరియంటల్ లైబ్రరీలోగాని, తంజావూరు సరస్వతీమహాలు లైబ్రరీలోగాని వీరి యెఱుక కందని ప్రాచీనగ్రంథము లేదని చెప్పిన నతిశయోక్తి కాదు. ఇంచుమించు ఇరువది వాల్యూములు గల డిస్క్రిప్టివు కేటలాగు వీరిచేతి మీఁదుగా తయారయినది.

మఱుగున పడియున్న చాటుపద్యములను, చరిత్రాంశములను సేకరించుట యొక యెత్తు. కథాసందర్భములను, కవుల కాలమును, చరిత్రాంశములను నెఱిఁగి యాను

పూర్వితో గ్రంథమును సమకూర్చుట యొక్క యెత్తు. కలము, కాగితము చేబూని కల్పనతో కవిత్వము వ్రాయుటవంటిది గాదీపని !

ఇందు ప్రకటితము లయిన విషయములలో రంగనాథుని శివకవిత్వము—దామెరవారి వంశావళి, యీరెండును మనకు రంగనాథరామాయణ కర్తృత్వవిషయమునను, చెన్నపట్టణమునకు నాంధ్రులకుఁ గలసంబంధవిషయమునను ననేక నూతన చరిత్రాంశముల దెలుపుచున్నవి.

శ్రీశాస్త్రిగారు సేకరించి ముద్రణమునకయి సిద్ధము జేసి యుంచినగ్రంథములో నిపుడు ప్రకటించినది ద్వితీయభాగములోని ప్రథమసంపుటము మాత్రమే ! ద్వితీయ సంపుటముగా ప్రకటింపవలసిన గ్రంథములోని విషయము లింకను చాల గలవు. వాని నెల్ల చాటుపద్యమణిమంజరి ద్వితీయభాగపు ద్వితీయసంపుటముగా ప్రకటింపఁ దలఁచి యున్నాము. ప్రకటింపవలసినభాగములో ప్రసిద్ధమహాపురుషస్తబకము, శృంగారస్తబకము, నీతిస్తబకము, సంకీర్ణస్తబకము, ఊళ్లునాళ్లు, గాలికబుర్లు, పామెతలు, పలుకుబళ్లు ననువిభాగము లుండును.

ఇప్పుడు ప్రకటించిన యీగ్రంథమును శ్రీశాస్త్రిగారు చిరకాలము క్రిందనే సిద్ధపఱిచి యుంచినప్పటికిని ననేకకారణములచేత 1950 వఱకు గ్రంథముద్రణము ప్రారంభింప వీలుపడలేదు. ఒకనాఁటి సాయంకాలము శ్రీవారి ప్రార్థన సమయమున ప్రసంగవశాత్తు ఈగ్రంథస్థితినిగూర్చి తెలిసికొనిన శ్రీ యం. ఆర్. రాజగోపాల నాయుడుగారు (రాయల కార్పొరేషన్, మదరాసు) శ్రీశాస్త్రిగారియందుఁ గల గౌరవ భావముతో నిర్వ్యాజముగా మదరాసులో ముద్రణాది సౌకర్యములను కలిగించి వెంటనే గ్రంథమును అచ్చు ప్రారంభింపఁ జేసిరి. ఈగ్రంథమున సగభాగమువఱకు శ్రీ యం. ఆర్. రాజగోపాల నాయుడుగారే ముద్రించి యిచ్చిరి. వారి యౌదార్యమునకు శ్రీప్రభాకరపరిశోధకమండలివా రెంతయు కృతజ్ఞులుగా నుండగలరు.

దురదృష్టవశాత్తు 1951 ఆగష్టు నెలలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు అకస్మాత్తుగా తనువు చాలించుటచేత గ్రంథముద్రణము తుదివఱకు ముగియకయే యప్పటికి నాగిపోవలసి వచ్చినది. మిగిలినగ్రంథము నచ్చు వేయించుటకయి ధనాభావముచేత మఱి కొంతకాలము ఆలస్యము జరుగకయు తప్పినది కాదు. ఏమయినను నిప్పటికి ఈగ్రంథభాగము నిట్లు ముద్రించి ముగించి యాంధ్రలోకమునకు సమర్పింపఁ గలిగినందుకు మండలివా రెంతయు సంతోషించుచున్నారు.

మొదటనుండియు నీ గ్రంథమునకుఁ గావలసిన విషయాదికముల నెల్ల సమ కూర్చుటలో సహకరించియు, గ్రంథముద్రణము ప్రారంభించినది మొదలు తుద ముట్టువఱకు కార్యభారము నెల్ల తమ సొంతపనికంటె నెక్కువగా భావించి కృషి చేసియుఁ దోడ్పడిన త్యాగరాయ కళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ తిమ్మా వఝ్ఝల కోదండరామయ్యగారి సహాయము నెంతయు సంభావించుచున్నాము. వీరు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి ప్రియాంతేవాసులు. వీరి సహాయమును మే మిక్కుడ సంభావింపకుండ నుండఁజాలము.

శ్రీ ప్రభాకర శాస్త్రిగారి పర్యవేక్షణమున ఆంధ్రప్రభ సహాయ సంపాద కులు శ్రీ టి. రామచంద్రాచార్యులుగారు గ్రంథస్థవిషయములను వివిధస్థలముల నుండి సేకరించి యెంతయు తోడ్పడి యుండిరి — వారి సహాయమున కెంతయు కృతజ్ఞులము. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నీగ్రంథమునకై వలయు కొన్నివిషయములను వ్రాసి యిచ్చి తోడ్పడిన శ్రీ యస్. ఎ. ఖాదరుగారికి మాకృతజ్ఞత !

మేము కోరినదే తడవుగా శ్రీశాస్త్రిగారియెడ గల గౌరవభావములో నీగ్రంథ మునకు పీఠిక వ్రాసియిచ్చిన చరిత్రపరిశోధకాగ్రగణ్యులు శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారికి అనేకవందనముల నర్పించుచున్నాము.

శ్రీ శాస్త్రిగారి ప్రథమవర్ధంతిసభ తిరుపతిలో జరిగినపుడు అధ్యక్షులుగా దయ చేసియుండిన ఆంధ్రప్రభసంపాదకులు శ్రీనార్ల వెంకటేశ్వరరావుగారు ఈ గ్రంథ మును సభాసముఖమున నావిష్కరించినారు. వారికి మావందనములు.

శ్రీ శాస్త్రిగారి గ్రంథములు అముద్రితములు ఇంకను ప్రకటించవలసినవి చాల కలవు—అమూల్యము లయిన వారి గ్రంథముల నెల్ల ప్రకటించుటకై యీపరి శోధక మండలివారు చేయుకృషికి ఆంధ్రమహాజనుల యాదరణమును అపేక్షించు చున్నాము.

ఆంధ్రలోకముయొక్క యాదరాభిమానములతో నీగ్రంథముయొక్క ద్వితీయ సంపుటముగూడ వెంటనే వెలువరింపగల మని యాశించుచున్నాము.

నందన
వైశాఖ పూర్ణిమ }

ప్రకాశకులు.

# పీఠిక

చాటుపద్యమణిమంజరి ద్వితీయభాగము నిప్పటికి ముప్పది సంవత్సరముల క్రిందట ననుకొందును పూజ్యులు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించినారు. ద్వితీయభాగమును మాత్రమే కాక యింకను మఱికొన్ని భాగములను బ్రకటింపవలె నని వారి యాశయము. మిగిలిన భాగములను బ్రకటించుట యెట్లున్నను ద్వితీయభాగ ప్రకటనానంతరము శ్రమ కోర్చి వారు సేకరించి యుంచినచాటుపద్య విషయకగ్రంథము నంతయు పొందుపఱిచి వారు ద్వితీయభాగమును మఱల ముద్రించుటకు పూనుకొని యేతత్కార్య నిర్వహణ భారమును వారి ప్రియశిష్యు లైన శ్రీతిమ్మావజ్ఝల కోదండరామయ్యగారిపై బెట్టిరి. ఈ ద్వితీయభాగము ముద్రణము పూర్తి కాక పూర్వమే శ్రీప్రభాకరులవా రస్తమయము నొందుట విచారకర మైనవిషయము. శ్రీకోదండరామయ్యగా రేమరక శ్రద్ధ వహించి యీ ముద్రణకార్యమును పరిసమాప్తి నొందించి కృతకృత్యు లైరి.

ఈ చాటుపద్యమణిమంజరి ద్వితీయభాగమునకు పీఠిక వ్రాయవలసిన దని శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సోదరులు శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారు నన్ను కోరిరి. నామీద గలయభిమానాదరములవలన వారు నన్నట్లు కోరినారు కాని యీ ప్రశస్తగ్రంథమునకు పీఠికే యవసరము లేదు. ఏలన పూజ్యులు శ్రీప్రభాకరశాస్త్రిగారు గొప్ప పండితులు, ఉదారదర్శనులు, కవులు, సాహిత్య విద్యాధరులు. తెలుఁగు పాఠకలోకమున వారి నెఱుఁగనివారు లేరు. తెలుఁగు దేశమునకు వారు చేసినసాహిత్యసేవ యపార మైనది. వారు తాళపత్రగ్రంథ ప్రతులను బరిశోధించి, ప్రాచీనాంధ్రకవికృత ప్రబంధములలో

గొన్నిటిని సాధుపాఠనిర్ణయము చేసి చక్కగ పరిష్కరించి ప్రకటించినారు. మఱికొన్ని ప్రబంధములలోని పద్యములకు రసవత్తమములైన పాఠముల నేర్చి చూపినారు. అర్థము తెలియని తెలుఁగు పదములకు సరస మైనయర్థనిర్ణయము కావించి మించినారు. శాసనములలో మాత్రమే కానవచ్చు తెలుఁగు పదములు కొన్నిటికి నితర ద్రావిడ భాషాపరిచయ పరిజ్ఞానమున నర్థములు సాధించినారు. ప్రాచీన తాళపత్ర భండారములను బరిశోధించి విస్మృతాంధ్రకవులను కావ్యములను గుఱించి వ్రాసి తెలుఁగుదేశమున కెఱుకపఱిచినారు. ఉత్తమ గ్రంథముల కెన్నిటికో యమూల్యము లైనపీఠికలు రచించి తెలుగు వారి కనేకనూతనవిషయములను దెలియఁజేసినారు. స్వయముగ కవులై తెలుగులో రసవంతము లైన చక్కని ఖండకావ్యములు విరచించినారు. భగవదజ్జుకము, ప్రతిమానాటకము మొదలైన సంస్కృత నాటకములను రసవంతముగ నాంధ్రీకరించినారు. చెదరియున్న ఎఱ్ఱాప్రెగడ విరచిత రామాయణమునందలి పద్యముల నేర్చి కూర్చి ప్రకటించినారు. శతాబ్దులతరబడి మఱుగువడి మటుమాయ మైన శ్రీ తాళ్లపాక అన్నమాచార్యకృత సంకీర్తన గ్రంథజాలమును వెలికిదీసి పరిష్కరించి ప్రకటింపఁజేసి తన్మాధుర్యామృతముల నాంధ్రపాఠకలోకమునకు విందులు పెట్టినారు. శ్రీ తాళ్లపాక చినతిరువెంగళనాథ కృతమైన అన్నమాచార్య చరిత్రమునకు వారు రచియించిన పీఠిక వారి పరిశోధనా నిపుణతకు తార్కాణము. ఇంత యెందుకు? తెలుఁగు వాఙ్మయమునకు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చేసినసేవ యపార మైనది; అనర్ఘ మైనది. అట్టి సాహిత్యసేవాధురంధరుని గ్రంథమునకు పీఠిక వ్రాయుట అనవసరము. జగ మెఱిఁగిన బ్రాహ్మణుఁ డాయన! అయినను పూజ్యులు శ్రీప్రభాకరశాస్త్రిగారిమీఁది భక్తితాత్పర్యములవలన ఆ సాహిత్యతపస్విని సంస్మరించి వారికి నా వినయాంజలి నర్పించుట కవ

కాశము కలిగిన దని శ్రీశంకరశాస్త్రిగారి కోరికను గాదనక దీనికి పీఠిక వ్రాయుట కంగీకరించితిని.

చాటుపద్యమణిమంజరి యీ ద్వితీయభాగము వెనుకటికంటె నెన్నియో రెట్లు పెద్ద దయినది. ఇందు దేవతాస్తుతిస్తబకము, కవిప్రశంసాస్తబకము, రాజప్రశంసాస్తబకము అని మూఁడు విభాగము లున్నవి. ఇందలి ఒక్కొక్క విభాగమున ననేక నూతన విషయములు చేర్పఁబడి వెనుకటి కూర్పుకంటె నిది యనేకవిధముల ప్రశస్తముగను, నమూల్యముగను నున్నది. ఈ కూర్పులో బిల్హణుఁడు, పెద్దిభట్టు, బాణుఁడు, కపర్దిస్వామి, శాకల్యమల్లుభట్టు, జగన్నాథపండితరాయలు మొదలైన సుప్రసిద్ధకవి పండితులు రచియించిన చాటు శ్లోకములును, వారికి సంబంధించిన కథలు గాథలును చేర్పఁబడినవి. ఇదివఱకు కూర్పులో లేనిచాటుపద్యము లాంధ్రకవి విరచితము లెన్నియో యీ కూర్పులో కలవు. రాజప్రశంసాస్తబకమున కాకతీయసైన్యాధిపతులైన నాయకుల బిరుద జయప్రశస్తులను జేర్చుటవలన నేతద్గ్రంథ ప్రాముఖ్యము మఱింత యధికమైనది. చరిత్ర పరిశోధన చేయువారికీబిరుదావళి. యత్యంతోపయోగకారి యని, యమూల్య మని వేఱ నుడువఁబనిలేదు.

నూతనవిషయము లమూల్యములైన విన్ని చేర్చుటవలన గ్రంథము క్రౌనుసైజునుండి మార్చి డెమ్మీసైజున అచ్చు వేయించినను చాల పెరిగిపోయినది. ఇప్పటికే యీ గ్రంథము ముద్రణమున దాదాపుగ మూఁడువందల యేఁబది పుటలవఱకు పెరిగినది. అచ్చు కావలసినవిషయ మింకను చాల నిలిచిపోయినది. అందువలన నీ గ్రంథము ద్వితీయభాగము ప్రథమసంపుటముగాఁ బ్రకటిత మగుచున్నది.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తెలుఁగువాఙ్మయమువిషయమున నెట్లో యట్లే తెలుఁగుభాషా చరిత్ర పరిశోధనలలోఁ గూడ గట్టి కృషి చేసినారు. అత్యంత ప్రాచీనలిపులు విడదీసి ప్రాచీనాంధ్రశాసనములను బ్రకటించినారు. చరిత్రపరిశోధనలో వారికిఁ గల ప్రజ్ఞాప్రభావముననే సమర్థతతో తెలుగుకవులు కొందఱి కాలనిర్ణయాదికములను గావించియున్నారు. నన్నయభట్టారకునికి పూర్వ ముండిన తెనుఁగు బాసకు సంబంధించిన విషయములను సప్రమాణముగఁ జర్చించి యమూల్యవ్యాసములను విరచించినారు. చరిత్రకు, భాషకు, వాఙ్మయమునకు సంబంధించి వారు వ్రాసిన వ్యాసములు ప్రామాణికములైనవి. శ్రీశాస్త్రిగారు వట్టి తెలుఁగు పండితులు మాత్రమే కారు. ప్రామాణికులైనచరిత్రపరిశోధకులు కూడను. ఈ కారణమున వారు సామాన్యపాఠకులు వినోదముగాను, రసగ్రహణపారీణులు కుతుకముతోను, భక్తిపరులాసక్తితోను పఠించుటకు మాత్రమే కాక ఈచాటుపద్యమణిమంజరి ద్వితీయభాగమును పరిశోధనానిరతులైనచారిత్రకులకుఁగూడ నుపకరించునట్లు సంతరించినారు. ఈ గ్రంథప్రకటనమును జూచుకొను భాగ్యము వారికి కలుగకుండుటయే విచారకర మైనవిషయము.

ఈ గ్రంథము నింత సర్వాంగసుందరముగ ముద్రింపించి ఆంధ్రపాఠక లోకమున కందించినందుకు శ్రీప్రభాకరపరిశోధకమండలి వారి నభినందించుచున్నాను. ఆంధ్రపాఠకలోకము దీనికిఁ దగినయాదరము చూపునుగాక !

పూజ్యులు శ్రీప్రభాకరశాస్త్రిగారి యితర రచనలనుగూడ యథోచితరీతిని గ్రంథరూపమునఁ బ్రకటించి పుణ్యము కట్టుకొందురు గాక యని ఈ మండలివారిని కోరుచున్నాను. నా కీ యవకాశ మిచ్చినందుకు శ్రీ శంకరశాస్త్రిగారికి నా కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను.

53, శరవణ పెరుమాళ్ వీథి,
పురశవాకం, మద్రాసు-7.
నందన, చైత్రము.

మల్లంపల్లి – సోమశేఖరశర్మ.

# తొలిపలుకు

## (ప్రథమభాగమున)

తీరుతీయములు గలభాషావాహినియందు సుకవుల కవితామృతము ప్రబంధరూపమునన కాక చాటురూపమునను జాలువాఱును. వీనులకు విందులై డెందమును దనుపార్చుచుఁ జాటురచనము లొక్కొక యెడఁ బ్రబంధరచనముల సయితము మీఱియుండు నని చెప్పుట భాషావేదుల కనుభవపునరుక్త మగును. గ్రంథములుగా నేర్పడమిచేఁ దొల్లింటి యాంధ్రకవీశ్వరులు రచించినచాటుపద్యము లెన్నొని యునికి తప్పినవి. పరంపరాగతము లగుచుఁ గొన్ని పల్లెటూళ్లలో ముదుసళ్లనోళ్లయందును మఱికొన్ని పురువులకు భుక్తులు పెట్టు ప్రాచీన తాళపత్ర సంపుటములందును జీర్ణించుచున్నవి. ఇంపారు నిట్టిపద్యముల సంపాదించి గ్రంథరూపమున వెల్వరింపఁ దలంపుగొని యెఱిగిన వారి నెల్ల నడిగియు, దొరకినతాళపత్రసంపుట మెల్లఁ బరిశీలించియు నానాఁటఁ గొన్నిచాటువులఁ గూర్చితిని. హైందవసారస్వతమునకు గని యనఁదగు చెన్నపురపు లిఖితపుస్తక భాండాగారము పెక్కుపద్యరత్నముల నొసఁగినది. మఱికొన్ని ముద్రితగ్రంథములనుండియు సేకరించితిని. రాజులనుగూర్చి రాజమంత్రులనుగూర్చి కవీశ్వరులను గూర్చి నీతి శృంగార హాస్యాదివిషయములం దింక ననేకవిషయము లందుఁ బలుదెఱఁగుల సమకుఱినపద్యములలోఁ బెక్కింటి నేఁటి కాలపు మర్యాద నతిక్రమింపకుండ సవరించియు వీడనాడియు రత్నము లనఁదగినవాని కథాసందర్భములఁ జేర్చి గ్రంథరూపమున సమకూర్చితిని. శృంగారవిషయము మిక్కిలి మెలఁకువతో నిరుపపటిచితిని. కొన్ని

పద్యములు సందిగ్ధార్థము లయినను జరిత్రకారులకుఁ జిక్కు గల్గు నని మార్పు సేయకయ ముద్రించితిని. నేఁటికవులచాటువులఁ జేర్పనలేదు. ప్రాచీనకృతులందలి పద్యము లేవేని యిందుఁ జేరినచో గుర్తింపలేని నాయపరిజ్ఞానమును క్షమింప వేఁడెదను. కొన్ని శతకములందలి పద్యము లిందుఁ జేర్చితిని. ప్రాచీనము లగునాశతకము లిప్పుడు కొన్ని దుర్లభములు. సహృదయుల కియ్యది యింపు నింపు ననియే నాతలంపు.

# ద్వితీయభాగము

ప్రథమభాగమును గూర్చినప్రకారముననే యీ ద్వితీయభాగమునుగూడఁ గూర్చి సహృదయులకు సమర్పించుకొన్నాఁడను. ఇట్లే మఱికొన్ని భాగములనుగూడఁ గూర్పఁగల్గుదునో!

చెన్నపురి.<br>దుందుభి జ్యేష్ఠము

వేటూరి - ప్రభాకరశాస్త్రి.

# విషయసూచిక

| విషయము | పుట |
|---|---|
| **దేవతాస్తుతి స్తబకము** | |
| పిళ్లారప్ప | 1 |
| ఇతర దేవతలు | 2 |
| కృష్ణనవరత్నములు | 14 |
| అష్టదిక్పాలకులు | 18 |
| మరిడీ దేవత | 22 |
| వటమూలమందిరా! | ,, |
| రామా! ఆర్తరక్షామణీ! | 23 |
| అంబికా! | 24 |
| కార్తవీర్యార్జునా! | 28 |
| బ్రహ్మబిలపంచరత్నములు | 31 |
| షట్చక్రనిర్ణయము | 33 |
| యోగపంచరత్నాలు | 36 |
| రామనవరత్నములు | 40 |
| దశసీసములు | 45 |
| కంచి వరదరాజస్వామి | 50 |
| కావేటిరంగఁడు | ,, |
| "కలగంటి నంతట మేలుకొంటి" | 51 |
| ఆర్తజనరక్షణోపాయ! ఆంజనేయ! | 56 |
| ధరణి | 60 |
| నయనరగడ | ,, |

కవిప్రశంసాస్తబకము - సంస్కృతకవులు



తెలుగుకవులు

రాజప్రశంసాస్తబకము

శ్రీ గురుచరణం శరణమ్.

# చాటుపద్యమణిమంజరి

(ద్వితీయ భాగము.)



## దేవతాస్తుతి స్తబకము.



### పిళ్ళారప్ప.

చం. తొలినె యవిఘ్నమస్తనుచు ధూర్జటినందన నీకు మ్రొక్కెదన్
ఫలితముఁ జేయుమయ్య తలఁపంబడు కార్యకలాప మెల్ల నా
వలపలిచేతిగంటమున వాక్కున నెప్పుడుఁ బాయకుండుమా
తెలివి ఘటింపుమా సతము దేవ వినాయక లోకనాయకా!

ఉ. మోదకహస్తునిన్ ధవళమూషకవాహను నేకదంతు లం
బోదరు నంబికాతనయు నూర్జితపుణ్యు గణేశు దేవతా
హ్లాదగరిష్ఠు దంతిముఖు నంచితభక్తవరప్రదాయకున్
మోదముతోడ హస్తములు మోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్.

క. గజముఖుని నేకదంతుని
భజియింతును వాణి గౌరిఁ బంకజనిలయన్
నిజభక్తి బుద్ధి విద్యా
నిజ[illegible]యుగుదయు తేజములకై.

క. శ్రీకరదంతరుచిజితసు
ధాకర మృడపార్వతీముదాకర గుణర
త్నాకర వరధీకర పర
భీకర భాగ్యములకుప్ప పిళ్ళారప్పా!

క. మల్లెలు మొల్లలు జాజులు
గొల్లలుగాఁ గోసి తెచ్చి కొనియాడి నినుఁ
జల్లఁగఁ బూజింతుము కృప
వెల్లువగాఁ జూడుమప్ప పిళ్ళారప్పా.

క. ఓరీ బాలుఁడ నీ విటు
రారా యని నన్నుఁ బిలిచి రంజిలుదయచే
గోరిక లొసగుము భువి నీ
పేరును బ్రకటించి చెప్పఁ బిళ్ళారప్పా.

క. భక్షింపుము గావలసిన
భక్షణములు నీకు నిత్తు భక్షించియు నీ
కుక్షిఁ గలవిద్య మాకుఁ
భిక్షం బిడి కావుమప్ప పిళ్ళారప్పా.

## ఇతర దేవతలు.

క. తిన్నని కస్తురినామము
సన్నపుఁదలపాగచుంగు చక్కఁదనంబుఁ
జెన్నలర మిమ్ముఁ గంటిమి
కన్నుల తెలి వెంత వింత కదిరి వసంతా!

గీ. ఉక్కుఁగంబంబు వెడలిన చక్కనయ్య
మున్ను ప్రహ్లాదుఁ గాచిన వన్నెలాఁడు
నన్ను నేలిన శృంగార నాయకుండు
హృదయమున నిల్చు మంగళాద్రీశ్వరుండు.

క. మదువుకుఁ జని కాళిందుని
పడగలపై భరతశాస్త్రపద్ధతి వెలయన్
గడువేడుకతో నాడెడు
నడుగులు నామదిఁ దలంతు నచ్యుత కృష్ణా!

క. నారాయణ నీనామము
నారాయణ వ్రాయవయ్య నానాలుకపై
నారాయణ నిను నమ్మితి
నారాయణ కావవయ్య నారదవరదా!

క. నిరుపమ బాలానందా
వరవనితాచిత్తచోర వరవసునందా!
గిరిధర శరణు ముకుందా
కరుణాకర నీవు నాకు గతి గోవిందా!

ఉ. మొదలిటి గద్దెయక్షరము మువ్వురువేల్పులలావు మేనిలో
మొదలివెలుంగు నెత్తితుదిమోవఁగఁ జేయుటకేర్పుజంత్ర మ
భ్యుదిత తనూసరోజముల నూనినగాడ్పుల యూటపట్టు స
మ్మదమలరారఁగాఁ బ్రణవమంత్రము మాకుఁ బ్రసన్నమయ్యెడున్.

ఉ. సలిలవిహారు లిద్దఱును సంతతకాననచారు లిద్దఱున్
వెలయఁగ విప్రు లిద్దఱును వీరపరాక్రమశాలు లిద్దఱున్
బాలఁతులడాయువాఁ డొకఁడు భూమిని బుట్టెడువాఁడు నొక్కఁడున్
జెలువుగ మీ కభీష్టఫలసిద్ధి ఘటింతు రనంతకాలమున్.

చం. అమరులు మేఘముల్ కుసుమ మాస్యము హేమము భాస్కరుండు మా
సము నురగంబు శంకరునిచాపము పంకము పాండవాగ్రజుం
డమృతకరుం డనం దగినత్ర్యక్షరసంజ్ఞల మధ్యవర్ణముల్
క్రమమున నాహ్వయంబొనరఁ గల్గినవేలుపు మిమ్ముఁ బ్రోవుతన్.

చం. చరణము లైదు మూఁడువిలసన్మణి నేత్రయుగంబు పుచ్ఛమున్
బరువడి రెండువేలు నొకపంచకమున్ మఱి రెండునొప్పచున్
గరములు రెండురెండ్లు ఘనకాయచతుష్కము గల్గినట్టియా
సురుచిరమైనవేల్పు మిము సుస్థితిఁ బ్రోవుత మెల్లకాలమున్.

సీ. ఆజాను దీర్ఘబాహా చతుష్కమునందు
శంఖచక్ర గదాసిశార్ఙ్గ సమితి
ధరియించి నీలాంబుదముచెంత విలసిల్లు
సౌదామినీ లతాసన్నిభముగ
వామాంకమున రమావనితశోభిల్ల ర
త్నాంచల జాంబూన దాంబరంబు
దీధితుల్ దెసలందుఁ దేజరిల్లఁగ నక్ర
కుండలదీప్తులు గండయుగళిఁ

గీ. దాండవము సల్ప నవమణిస్థగితముకుట
చారుకేయూరహారమంజీరకౌస్తు
భోజ్జ్వలప్రభ లెసగ సర్వోత్తముండు
విష్ణుదేవుండు నామది వెలయుఁగాక.

సీ. పక్షవిక్షేపణ ప్రభవ ఝంఝామారు
తాలోల సకల కులాచలుండు
చారుజాంబూనద శైలాగ్రపూర్ణిమా
హరిణలాంఛన సన్నిభానుండు
తారకాపథ నటత్సమయ రయభ్రామ్య
మాణ దివ్యవిమాన మండలుండు
అమృతాపహృతి నిమిత్తాహవరంగని
ర్గత బాహుశౌర్య దిక్పాలకుండు

గీ. అంబుజోదరవహన మహోక్షుఁడు
వజ్రమయకాయుఁ డాశ్రితవత్సలుండు
భుజగభూషణుఁ డఖిలైక పూజితుండు
వైనతేయుం డొసంగు మద్వాంఛితములు.

సీ. మనము గారామునఁ బెనిచినయట్టిచ
కోరికాశిశువు లాకొనకయుండ
మన గొజ్జఁగలతోఁటమహి నిందుకాంతంపుఁ
బాదులలో నీళ్లు పాయకుండ
మనకేళికావన మధ్యదీర్ఘికలోని
తొగ లొకయప్పుడు మొగుడకుండ
మనసరోజినిలోన మరగిన జక్కవ
దోయి నీచనుదోయిఁ దొరయకుండ

గీ. నుండుఁగాని సదాశివుం డొడ్డినాఁడు
మొలకచందురు గెలువుమీ పలకననుచు
నగజచెలు లాడుమాటల కలరుశివుఁడు
మనలఁ గరుణావిధేయుఁడై మనుచుఁగాత.

సీ. కాశ్యపగోత్రుఁడై ఘనత కెక్కినవాఁడు
ధర లక్షయోజనాంతరమువాఁడు
గ్రహరాజు వర్తులాకార మండలుఁడును
హేమదృష్టి కళింగభూమివిభుఁడు
మాణిక్యకుండల మకుటహారములతో
మేరుప్రదక్షిణ మొలఁగువాఁడు
సప్తాశ్వరథశంఖచక్రముల్ గలవాఁడు
రక్తవర్ణుఁడు సింహరాశివాఁడు

గీ. నంబుజాక్షుండు మఱియు ఛాయావిభుండు
శమనకర్ణులఁ గన్నట్టిజనకుఁ డనఁగ
రాజగురుఁడైన సూర్యనారాయణుండు
మనలఁ గరుణావిధేయుఁడై మనుచుఁగాత.

సీ. పెనుఁబాపపేరు వేసినగట్టివా, కుంభి
దైత్యావరోధ వైధవ్యదాయి
కడవన్నె బంగారు గట్టువిల్తుఁడు భక్త
రక్షణ క్రీడాపరాయణుండు
చిగురుఁగైదువు జోదుపగతుండు పార్వతీ
వదనచకోర పార్వణవిధుండు
చేఁదు పానంబుచేసిన మొక్కలీఁడు ద
క్షాధ్వరధ్వంస దీక్షాధికారి

గీ. కలిమిగలబేరికూరిమిచెలిమికాఁడు
అంబునిధి వేష్టితోర్వీ మహారథుండు
బుడుత వెన్నెల పూమొగ్గముడుచు వేల్పు
చిర కృపాదృష్టి మనల రక్షించుఁగాత !

సీ. మొగమున నెలనవ్వు మొలకరేయెండలు
గాయువాఁ డావులఁ గాయువాఁడు
పశుపాలికలమోవి బంగాళి చక్కెర
గ్రోలువాఁ డొకపిల్లఁ గ్రోలువాఁడు
తిరుమేన బంగారు జరబాబు దుప్పటి
గలుగువాఁడు తనంత గలుగువాఁడు
అఖిలపావనమైన యడుగుఁ దామర తేనె
జాలువాఁ డెలమి యీఁజాలువాఁడు

గీ. శ్రవణములు వ్రేలు కర్ణికారములవాఁడు
తీర్చినట్టున్న ముక్కుముత్తియమువాఁడు
కళుకు లీనెడునెద మానికంబువాఁడు
మనలఁ గరుణావిధేయుఁడై మనుచుఁగాత !

సీ. మూఁడుకన్నులవేల్పు ముంజేతికడియంబు
పఱుపు పచ్చడమునై యొఱపుమిగుల
అక్కున విలసిల్లు చక్కనిపూఁబోణి
యాలును మనుమరాలై తనర్ప
బొడ్డుదామరఁ బుట్టి పొలుపారుబిడ్డఁడం
తటికిఁ దీర్పరియుఁ దాతయునుగాఁక
పులుఁగులగమికాఁడు పలుదెఱంగుల దాట
గుఱ్ఱంబు బంటునై కొమరు మిగుల

గీ. ప్రాఁతచదువులు వలకాలిపసిఁడియందె
యనుఁగుఁ గూర్చుండు పలకయునగుచు మీఱ
(నందముల కెల్లయైననిన్ డెందమందుఁ)
దెల్లమిగఁ జేర్తుమోయన్న నల్లనన్న.

సీ. కందర్పకోటిసంకాశుండు నీపతి
భువనమోహన కళాపూర్ణ వీవు
పేదసాదులపాలి పెన్నిధి నీస్వామి
భూమివారల కన్నపూర్ణ వీవు
సర్వలోకములకు జనకుండు నీనాథుఁ
డెల్ల జీవులకునుఁ దల్లి వీవు
ప్రాణుల కెల్లను బ్రాణంబు నీభర్త
మగనికిఁ బ్రాణమౌ మగువ వీవు

గీ. ధరనృలోక గృహస్థులు దొరలుమీరు
మిమ్ము గొలిచినవారికి మేలు గలుగు
అంగయక్కణి చొక్కనాయకునిరాణి
మధురమీనాక్షి వినుత పద్మాయతాక్షి.

సీ. పూయగందము లేదు భూతిపూతే కాని
యెక్క గుఱ్ఱము లేదు యెద్దె కాని
త్రాగఁ గంచములేదు తలపుఱ్ఱయే కాని
మణులసొమ్ములు లేవు ఫణులె కాని
కొండమీఁదనెకాని యుండఁ జోటే లేదు
తలను బూవులు లేవు జడలెగాని
గజచర్మమేకాని కట్టవస్త్రము లేదు
జోగిరూపే కాని సొగసు లేదు

గీ. ఇట్టి నిరుపేదవాట ని న్నెఱిఁగి యెఱిఁగి
భ్రాంతిపడి యెట్లు పెండ్లాడెఁ బార్వతమ్మ
యైన నీభాగ్య మేమని యనఁగవచ్చు
భక్తజనసంగ మగితేల ముక్తిలింగ.

సీ. బుడుతకల్వలవిందుఁ బోలు నెన్నొసలిపై
చెలువంపురావేక చిందులాడ
మొలఁ బట్టుదట్టిపై నలువందు గంటల
బంగారు మొలత్రాడు రంగు లీన
ఎదఁ గ్రొత్తపులిగోళ్లు పొదివిన పతకంబు
బలు ముత్తియపుసరంబులును బొదువ
చేతుల రతనంపుఁ జిల్లుటుంగరములు
మురువులు నెనలేని మెఱుపుచూప

గీ. మొట్టదంబున నంబియల్ బిట్టు మొరయ
దిట్టతనమునఁ జెలరేఁగి పట్టపగలె
నెట్టుకొని యెల్లవ్రేఁతల నట్టులందు
గుట్టు లరయుచు మెలఁగునప్పట్టి మెఱయు.

సీ. విశ్వంబు నీవయై విశ్వంబు చూచుచు
విశ్వంబు చేయుచు విశ్వమునకు
నినుఁడవై పంచభూతేంద్రియాహంకార
ములకు మనఃప్రాణబుద్ధి చిత్త
ముల కెల్ల నాత్మవై మొనసి గుణంబుల
కావృతమగు నిజాంశాంశ భూత
మగునాత్మచయమున కనుభూతి సేయుచు
మూఁడహంకృతులచే మునుఁగువడక

గీ. నెఱి ననంతుఁడవై దర్శనీయరుచివి
గాక సూక్ష్ముండవై నిర్వికారమహిమఁ
దనరి కూటస్థుఁడన సమస్తంబు నెఱుఁగు
నీకు మ్రొక్కెద నాలింపు నిర్మలాత్మ.

సీ. మిన్నేటి పెన్నీటి మిక్కుటం బగునిట్ట
పాఁప నెట్టెపుఁజుట్ట పైఁ దెరల్ప
పొలుచు కెందామర పుప్పొడి తెట్టువ
జడలసం దొయ్యన నడలి తొరుగ
నలికంబుపైఁ గపాలావలి తూఁటుల
నొండొండ తెలినీరు నిండఁబడఁగ
తల లెత్తి నిక్కిన వెలిదమ్మి మొగడలఁ
లోనఁ దేఁటులు తేనె లాని యులియ

గీ. మస్తకము వంచి సౌభాగ్యమహిమ మించి
గౌరిపదపల్లవంబులు గారవించి
తియ్యఁబలుకుల నలుకలుదీర్చు శివుఁడు
మనలఁ గరుణావిధేయుఁడై మనుచుఁ గాత.

(అయ్యనవోలి రామన

సీ. శ్రీపద్మవాసినీ పృథుతర కుచశాత
కుంభకుంభ విలిప్తఘుమఘుమాయ
మానచందన మృగమద సంకుమదకుంకు
మాగరుపంక సమన్వితోరు
బాహాంతరాళ విభ్రాజమానామూల్య
కౌస్తుభమణి ఘృణికలిత లలిత
మౌక్తికహార శుంభదుదర భరితలో
కనికరుండవు నీవు కనికరంబు

గీ. మీఱ భక్తజనాళి కమేయదివ్య
భాస్వదనపాయ సకలసంపద లొసంగి
సాకొనుమయ్య నిరతంబు సరసముగను
మదనగోపాల! గోపికాహృదయలోల!

క. శారదనీరదవర్ణా సారసభవ చక్రపాణి శంకరవినుతా
కీరమనోహరహస్తా భారతి! నీపాదపద్మ భజన మొనర్తున్.

సీ. పాలించవే నన్నుఁ బద్మసంభవురాణి
బహుశాస్త్ర పుస్తకపాణి వాణి!
కరుణించవే నన్నుఁ గలహంస గామినీ
కోరి మ్రొక్కెద నీకుఁ గీరవాణి

రక్షించవే నన్ను రాజబింబాననా!
　　దయఁ గావవే సర్వధవళవర్ణ!
మన్నించి నీవు నామదిలోన నుండవే
　　మాధవుకోడలా మదనువదినె

నిన్ను నెప్పుడు సేవింతు నీలవేణి
నన్నుఁ గృపజూడు మెప్పుడు నళిననేత్రి
భారతీదేవి నాజిహ్వఁ బాయకుండు
శరణు లోకైక వినుతాంబ శారదాంబ.

వీణాపుస్తకపాణివై హరిశిలావేణీభవద్వేణివై
మాణిక్యోన్నత పుంజరంజితలసన్మంజు ప్రభాశ్రోణివై
స్థాణు బ్రహ్మహరీంద్ర ముఖ్యహృదయాంతర్వాణివై వాణి క
ళ్యాణీ నారసనాగ్రమందు నిలువుమా వ్యాఖ్యానకాలంబునన్.

కదిసి యెక్కుడుగిబ్బ బెదరించు పోడలపేఁ
　　దుప్పటంబును మీఁదఁ గప్పుకొన్న
ఉడికోని కడికోని కడవోని వింతల
　　ముడువని వెలిపువ్వు ముడుచుకొన్న
నూటు నిన్నాటు మున్నాటు నన్నాటు నా
　　రెట్ట నాగులపేరు పెట్టుకొన్న
ఎడవంక(సుగతితోఁ) గదుబింకముగ జింక
　　పఱచుదాఁటుల పిల్లఁ బట్టుకొన్న

వానిఁ దనుముట్టఁ గొలిచినవానివాని
మగువయును దాను నొక్కఁడై మన్నవాని
మహిత వృషరాజు నెక్కినమహిమవాని
మృడునిఁ గలఁగంటి నంతలో మేలుకొంటి.

సీ. చుక్కలకడఁ బోవు నొక్కఁడెక్కెడువాని
యానంబు సుతుని మేనల్లునన్న
కొడుకు తమ్ముని మేనగోడలి పెదబావ
తండ్రితండ్రి తనూజభవుని మామ
మనమున నేఁడింట మలయు నాతనితల్లి
సవతి తమ్మునిఁగొమ్ము సఱచువాని
జనకుని యిల్లాలి తనయులతోఁ బెద్ద
మొదలు ప్రసిద్ధి పెంపొదవువాని
గీ. తలమొగంబున వయ్యారి తరమువాని
స్థిరముగల దేవుఁడెపుడు సుస్థిరముగాను
సిరియు నాయువు సౌభాగ్య సిద్ధిజయము
పఱగఁజేయుత మీసభాపతికి నెపుడు.

సీ. భానుండు తగ మీకు భవ్యతేజం బిచ్చు
కరుణఁ జంద్రుఁడు మీకుఁ గాంతి యిచ్చు
అంగారకుఁడు మీకు మంగళంబుల నిచ్చు
బుధుఁడు నెమ్మది మీకు బుద్ధి నిచ్చు
నెఱి బృహస్పతి మీకు నిర్మలమతి యిచ్చు
నరయ శుక్రుఁడు మీకు హర్ష మిచ్చు
రాహు వెప్పుడు మీకు బాహాబలం బిచ్చు
కేతువు మీకు విఖ్యాతి నిచ్చు
గీ. ఘనత కెక్కిన యీనవగ్రహము లెపుడు
బలిమి నేకాదశస్థానఫలము లొసగఁ
బుత్రపౌత్రాభివృద్ధిచే భూతలమున
మీరు వర్ధిలుఁ డాచంద్రతారకముగ.

సీ. ధరణిపుత్రుని పినతల్లి తమ్మునిసుతు
తాత యల్లుని రాణి తండ్రికొడుకు
కొడుకుతండ్రికి తండ్రి కోడలిసుతు బంటు
కరియైన వానబ్బ కగ్రసుతుని
తమ్ముని యేలిక తండ్రి వియ్యంకుని
కూతునేర్పునఁ జెర గొన్నవాని
తనయునిఁ ద్రుంచిన ఘనునౌషధము దెచ్చు
వానయ్య సుతుని తద్వరకుమారు
గీ. నవ్వ కోడలి కోడలి యన్నతండ్రి
భామయొద్దను కొలువున్న భామ జనకు
తనయుచేతను గూలిన ఘనుని తల్లి
ధరుఁడు మీ కిచ్చుఁబుత్ర పౌత్రాభివృద్ధి.

మ. నునుమైఁ గల్మిపడంతి డాకరమునందుఁ బూరుగొమ్ముండుచోఁ
తను వేయంచులవాలు మేలొసఁగనౌడాలుఁ బవల్ రే యొన
ర్పను జూపుఁ నెఱిచూపు లాసగొనుచూపట్టే జగాజట్టి బో
ట్టనవ్రేలఁ వెలిబుగ్గ గన్నయొడయండా! నన్నుఁ బాలింపుమా!

సీ. శృంగారరాయని చెలువుమీఱిన కొండ
ఫణిరాజు పేరిటి పసిఁడి కొండ
పుష్పజాతులనెల్ల భూషింపఁగల కొండ
కల్పవృక్షము లైదుఁ గల్గు కొండ
చిలుకలు కోవెలల్ చెలఁగి కూసెడి కొండ
మృగరాజకోట్లెల్ల మెలఁగు కొండ
ఘోరపాపము వాపు కోనేలు గల కొండ
తలఁచిన మోక్షంబు దగులు కొండ

గీ. అమరవరులకు వైకుంఠ మైన కొండ
ఆళువారికిఁ బ్రత్యక్ష మైన కొండ
అర్థిఁ జూచిన బ్రహ్మాండ మైన కొండ
యేను గనుఁగొంటి శ్రీవేంకటేశుకొండ.

కృష్ణ నవరత్నములు.

సీ. నరకబాణాసుర మురజరాసంధాది
పాపులచేఁ జాల బాధలఁ బడి
భూదేవి విన్నపంబులు సేయ క్షీరాబ్ధి
శాయి దయాళుఁడై జగతిమీఁద
యాదవవంశంబునందుఁ దా వసుదేవు
సూనుఁడై జన్మించి సురలు మెచ్చ
ధరణిభారముఁ బాపి దనుజులఁ బరిమార్చి
ధర్మంబు నిలిపి యధర్మ మడఁచె
ఆ. నట్టిదేవదేవు నాదినారాయణుఁ
బుండరీకనయను భుజగశయనుఁ
గమలనాభుఁ గొలిచి కల్మషంబుల నెల్లఁ
దోలువాఁడ ముక్తి నేలువాఁడ.

సీ. పురుడు వెళ్లనినాఁడె పూతనఁ బరిమార్చె
శకటాసురునిఁ గొట్టెఁ జరణహతిని
బడఁ ద్రొబ్బె మద్దులు బకునిఁ గీటడఁగించె
దావాగ్ని ద్రావి వత్సకునిఁ గూల్చె
గోవర్ధనం బెత్తి గోవుల రక్షించెఁ
గాళీయనాగంబు గర్వమడఁచె
ధేనుకాసురుఁ బట్టి తిత్తొల్చె మహిపుత్త్రిఁ
దునిమి రక్కసునిఁ దుత్తుమురు సేసె

గీ. వెలయు వనమెల్లఁ బెఱికివో వీచె లీల
వత్సవాతూలు నాతృణావర్తుఁ గెడపె
సురుచిరాంగుండు గోపాల సుందరుండు
దనుజదమనుండు గేవలదైవ మెట్లు?

సీ. గోపాలకులతోడ గోవులఁ గాచె నా
కాళింది తటమునఁ గమలభవుఁడు
వత్సముల్ గొనిపోవ వానిరూపము దాల్చి
వనజేశునకుఁ దల వంగఁ జేసె
బాల్యంబునాఁడు గోపాలకులును దాను
వెన్నలు పాలును వెజ్జి యాడె
చేడెలతో జలక్రీడ లాడఁగఁ జొచ్చి
యందఱచీరలు నపహరించె

ఆ. రహిఁ బదాఱువేల రాజకన్యకలను
నన్నిరూపులగుచు ననుభవించె
రాసకేళిఁ గూడె రామల నెల్లను
గృష్ణుమహిమ లెన్నఁ గేవలంబె.

సీ. వెలయ నక్రూరుకు విశ్వరూపము సూపె
వలువకై చాఁకలివానిఁ జంపె
మఱి కుబ్జఁ జక్కనిమానిసిగాఁ జేసెఁ
బుష్పలావి కొసంగె భూరిమహిమ
కంసునిధేనువుల్ ఖండించి వైచెను
కువలయాపీడంబు ఖావ్రదడంచె
చాణూరమల్లుల సమయించె భుజగర్వ
రూఢిని గంసుని రూప మణఁచె

గీ. కంసుతండ్రిని బట్టంబు గట్టి కాచె
దేవకీదేవి దైన్యంబు ద్రెంచి వైచెఁ
గేలిమై శిశుపాలునిఁ గీటడంచె
భక్తవత్సలు శ్రీకృష్ణుఁ బ్రస్తుతింతు.

సీ. అరయ నిర్వదియొక్క యక్షౌహిణులతోడ
నిర్వదియొక్కమా ఱేఁగుదెంచె
మధురపై విడిసినమత్తు జరాసంధు
దునిమించె భీముచే దురమునందుఁ
గాలయవనుఁడు గగతి నెత్తిరా వాని
ముచికుందుచే మృతిఁ బొందఁజేసె
ఆశమంతకరత్న మరుదారఁగాఁ దెచ్చె
జాంబవంతుని గెల్చె జాంబవతిని

ఆ. వేడ్క బెండ్లియాడె వెడలించె నపనింద
జగతి కెల్ల మేలు సంఘటించె
తెగి సృగాలవాసు దేవునిఁ దెగటార్చెఁ
గృష్ణుఁ డితఁడు సర్వజిష్ణుఁ డితఁడు.

సీ. బదరికావనములోఁ బరగు ఘంటాకర్ణుఁ
డిచ్చఁ గొల్చినమోక్ష మిచ్చె నందు
కైలాసగిరిమీఁదఁ గాలకంధరముఖ
విబుధ సంస్తుతులచే వెలయునందు
గురువు తగ వేఁడిన గురురక్షణార్థమై
చచ్చినసుతునిఁ దెచ్చిచ్చెనందు
దుర్యోధనాదులు ద్రుపదనందనవల్వ
లొలువంగ నక్షయ మొసఁగెనందు

ఆ. కామగమున మగుచుఁ గడునొప్పు సాంభకా
ఖ్యానపురము జలధిఁ గలపెనండ్రు
చరిత పుణ్యధనుఁడు భరితగోవర్ధన
కందరుండు లోక సుందరుండు.

సీ. సమరంబులో జరాసంధాదులను ద్రోలి
ప్రేమతో రుక్మిణిం బెండ్లియాడె
మురదానవునిఁ గూల్చి నరకునిఁ బరిమార్చి
దివ్యకుండలములు దెచ్చుకొనియె
విబుధకన్యలఁ బదార్వేలను విడిపించి
దయఁ జూచి మణిపర్వతంబు దెచ్చె
సురలోకమున కేఁగి సురపతి నోడించి
సురభూరుహము దెచ్చె సురలు మెచ్చఁ

ఆ. పౌండ్ర వాసుదేవు బంధుయుక్తంబుగాఁ
ద్రుంచి కాశిరాజుత్రు ళ్లడంచె
వాసుదేవు మహిమ వర్ణింప శక్యమే
ఫాలనేత్రుకయిన బ్రహ్మకయిన.

సీ. పరగ బాణాసురుపై నేఁగి యాతని
శోణిత పురమెల్లఁ జూఱలాడె
ఆపురిఁ గాల్చి త్రేతాగ్నులు చల్లార్చి
పురపాశములు ద్రెంచి మురునిఁ గూల్చె
బాణాసురుని వేయుబాహులుఁ దెగనేసి
చండిక వేడినఁ జంపకునికి
శివుఁడు దాఁ గోపించి శీతజ్వరము వైవ
వైష్ణవజ్వరమును వైచె నతఁడు

గీ. జృంభకాస్త్రంబుచే సోలఁ జేసి శివునిఁ
ప్రేమతో ననిరుద్ధునిఁ బెండ్లిచేసెఁ
గరుణ బాణునిఁ బట్టంబు గట్టె నితఁడు
మూఁడుమూర్తుల కవ్వలిమూర్తి యితఁడు.

సీ. పాండు తనూజులపక్షమై నొగ లెక్కి
రెండు సేనలయందు నిండియున్న
బంధుజనంబుల బావల మఱఁదుల
నన్నదమ్ములఁ జూచి యనికిఁ దొడఁగి
అనుకంపఁ జేసిన యార్తుని బోధించి
పార్థుకు విశ్వరూపంబు సూపె
అచ్చటఁ బదునెన్మి దక్షోహిణులతోడ
భీష్మాదియోధులపీఁచ మడఁచె

ఆ. ధరను మఱియుఁ బుట్టి దనుజులఁ బరిమార్చి
భూమిభార మెల్లఁ బుచ్చివైచె
నాదిదేవుఁ డయిన యాకృష్ణుఁ బ్రార్థించు
నట్టివారు ముక్తు లయినవారు.

## అష్ట దిక్పాలకులు.

### ఇంద్రుఁడు.

సీ. ఐరావతోచ్చైశ్శ్రవోధిరూఢుఁడు నీల
దివ్యదేహుఁడు పూర్వ దిగ్విభుండు
శతమహాధ్వరకర్త శతకోటి హస్తుండు
బహుమహా పర్వత పక్షహర్త
సౌందర్య లక్షణానంది శచీప్రియుఁ
డనుపమనందన వనవిహారి
శతపత్రనిభదళశతదీర్ఘ నేత్రుండు
వారివాహ సమూహ వాహనుండు

గీ. యుక్తసన్మంత్రమఘఫలభోక్త నిత్య
మభినవసుధార సైక పానాభిరతుఁడు
విక్రమక్రమ దేవతా చక్రవర్తి
శ్రీలు మీఱఁగ మిమ్ము రక్షించుఁగాత.

అగ్ని.

సీ. మేషవాహనుఁడు సుస్మితుఁడు చతుశ్శృంగ
ధరుఁడు విస్ఫురిత పక్షద్వయుండు
సప్తసంఖ్యార్చిరం చద్బాహు జిహ్వుండు
మహనీయ పాదపద్మత్రయుండు
స్వాహాస్వధాసతీ సహితపార్శ్వద్వయుం
డరుణ సువర్ణ భాస్వరతనుండు
లోహిత మహితవిలోచనుఁ డాజ్యపా
త్రస్రుక్స్రువాదికోద్యతకరుండు

గీ. అఖిలపితృదేవతార్పితహవ్యకవ్య
ధరుఁడు సర్వతోముఖుఁడు నిత్యశుచి యనలుఁ
డిహపరానందముల నిచ్చి యెల్లవేళ
నంచితోన్నతి మిమ్ము రక్షించుఁగాత.

యముఁడు.

సీ. మహిషవాహనుఁడు సమ్యగ్ధర్మపాలుండు
దారుణతర దీర్ఘ దండపాణి
దివ్యకాళిందీనదీ సోదరుఁడు నీల
వర్ణుండు కమలినీ వరసుతుండు
గతజన్మ కర్మసంచితఫలదుఁడు యుధి
ష్ఠిరగురుఁ డమృతనిషేచణుండు
గంధవతీ మనఃకాసార సంచార
సంగతానంద చక్రాంగవిభుఁడు

గీ. విష్ణురుద్రాది భక్తి వర్ధిష్ణుహితుఁడు
దక్షిణేశుండు ధర్మవిచక్షణుండు
శమనుఁ డనురక్తచిత్తుఁడై యమర మమ్ము
నాయురారోగ్య యుక్తులఁ జేయుఁగాత!

నిరృతి.

సీ. నరవాహనుండు బంధురఖడ్గహస్తుండు
వరచర్మధరుఁడు కర్బురశరీరుఁ
డతులజగద్రక్షణాంచత్కృపాసిధి
చటులోగ్రయామినీ సంచరుండు
సన్మార్గరోధిదుష్టనిశాచరవ్రాత
వారకుం డురుబలాధారకుండు
సురుతరకుటిల నీలోన్నత కేశుండు
నికషావధూమణీ నిత్యరతుఁడు

గీ. మహితబలవైభవోద్దండమండితుండు
కింకిణీరవ భూషణాలంకృతుండు
మృదులవచనుండు నైరృతి మీకు నొసఁగు
చిరతరారూఢ భోగ విశేషములను.

వరుణుఁడు.

సీ. మహనీయ సముదగ్ర మకరవాహనుఁడు క
చ్ఛపమీనన క్రాది జంతువిభుఁడు
పద్మినీమానస పంజరకీరంబు
ఫణగణాంచిత నాగ పాశధరుఁడు
భీకరాకార గుంభితకనత్కల్లోల
వారిసంభృత వార్ధి వల్లభుండు
నూత్నతృణగ్రాహి రత్న విభూషితుం
డఖిల జగద్వర్ష హర్షదాత

గీ. దుష్టనిగ్రహకారి యుత్కృష్ట మహిముఁ
డభయహస్తుఁడు కరుణార సార్ద్రహృదయుఁ
డమృతజీవన మొనగూర్చి యన్వహంబు
వరుణదేవుండు మిమ్ముఁ గాపాడుఁగాత.

వా యు వు.

సీ. సకలభూత వ్రాత సంజీవనఖ్యాత
ముఖ్య మహాప్రాణ మూర్తిధరుఁడు
కర్పూర కస్తూరి కాచందనాగరు
ధూపాది పరిమళ వ్యాపకుండు
ఆత్మానుకూల మహావేగ మృగవాహ
నారూఢుఁ డఖిల విశ్వాభియాయి
వైశ్వానరప్రభుశాశ్వతసహవాసి
భీమాంజనేయుల ప్రియజనకుఁడు

గీ. పశ్చిమోత్తరమధ్య దిగ్భాగ నిరత
పాలనోద్యోగి దేవతాప్రముఖుఁ డెపుడు
వాయుదేవుండు చిరముగా నాయు విచ్చి
మంచి యారోగ్యమున మమ్ము మంచుఁగాత.

కు బే రుఁ డు.

చ. ఉనికట వెండికొండఁ దనయుండట రంభకు యక్షరాజు నా
ధనపుఁ డనఁ బ్రసిద్ధుఁడట దానవిభుండట పుష్పకంబుపైఁ
జనునట పార్వతీపతికి సంగడికాఁడట యాత్మసంపదల్
పెనుపుగ నిచ్చి హెచ్చుగఁ గుబేరుఁడు మిమ్ము ననుగ్రహించుతన్

## ఈ శా నుఁ డు.

సీ. హిమశైల శిఖరోన్నత మహా వృషభ వాహ
నాధిరోహణుఁడు విశ్వాధి నేత
నిరతార్ధగాత్ర సన్నిహిత పర్వతరాజ
పుత్రీద్వితీయాను భూతిరతుఁడు
కైలాస పర్వతాగ్రనివాస పరితోషి
వరవీరగణవార పరివృతుండు
సర్వభూతవ్రాత సర్వవిద్యాజాత
నిర్ణేత మహిత దృక్కర్ణభూషుఁ

గీ. డిష్టసఖుఁడు కుబేరుని కిందుధరుఁడు
గగనకేశుఁ డతిస్వచ్ఛ కాంతితనుఁడు
ఈశ్వరుండు మహానటుం డెల్లవేళ
సర్వసౌఖ్యంబు లిడి మమ్ము సాఁకుఁగాక!

## మ రి డీ దే వ త.

మ. హరియైనా హరుఁడైన నింద్రుఁ డయినా అజ్ఞానునుండైన ని
న్నెఱుఁగంజాలరు నీ మహామహిమ మా కెంచంగ శక్యంబటే
పర దేవీ విషజాతమారుతవల త్పాదద్వయా దూరమై
మరిడీ దేవత! మమ్ముఁ బ్రోవఁగదవమ్మా! పొమ్మ! మాయమ్మవై.

## వటమూల మందిరా.

ఉ. చూపులు రెండు ముక్కుతుదఁ జొన్పియుఁజూచినచూపు వెంటనే
లోపలఁ జూచి చండకరులో శశిఁగూర్చి చతుర్దళంబుపై
దీపము వెట్టి దానితుది తేజము దానయి విశ్వమంతయుఁ
వ్యాపకుఁడై నపుణ్యుఁడు మహాత్ముఁడగుఁ వటమూలమందిరా!

ఉ. కన్నులు మూసి నాదుమది కన్నత్రికోణమునందుఁ జొన్పి లో
నన్నపు డిడ్డి దూర్చి జలజంబులనిచ్చెన యెక్కి మింటిపై
వెన్నెలరాజుఁ జేరి సుఖవేళలయందును నీవు నేనయై
యున్ననుగాని నాహృదయ ముబ్బదయా వటమూలమందిరా !

ఉ. గట్టిగవేధలార్గురను ఖండనసేయక యేడుచింతలన్
గొట్టక మూఁడురిండ్లు చెడఁగూల్పక (నీపద) మబ్బునాభువిన్
బొట్టునుబోనమున్ దపము పోకులుబూడిదపూఁత లూరకే
పెట్టును గాని నీదుదయఁ బేర్పడునా వటమూలమందిరా !

ఉ. వాలినయింద్రియాలయకవాటము లన్నియు మూసి నెమ్మదిన్
దాళము వెట్టి లోవెలుఁగు తత్త్వము గన్గొని తట్టి సుందరీ
లాలిత నాగకన్య నుపలాలనచేసినవాఁడె యోగియా
మాలిన వేషముల్ జముని మాన్కొనునే వటమూలమందిరా !

ఉ. సాగినకోపవహ్ని నిజశాంతిజలంబునఁ జల్లనార్చి యా
శాగిరులన్ నివృత్తికులిశాహతి నుగ్గుగఁ జేసి యుత్తమో
నాగవిభున్ వివేకమృగనాయకుచే నణఁగించి లోన సం
యోగవియోగముల్ విడువ యోగియగున్ వటమూలమందిరా !

ఉ. వాలిన యింద్రియంపుఁ బెనువాతులకున్ మృదుగానమందవా
తూలవిలాసి నీకుసుమతోయగుణంబులు వచ్చి చొచ్చినన్
గ్రోలఁగనీక నెమ్మనము కుత్తుకవట్టి నినుం దలంచి యీఁ
జాలినఁగాక మాటలఁ బ్రసాదములే వటమూలమందిరా.

రామా ! ఆర్త రక్షామణీ.

మ. శరణన్నన్ గరుణింతు వన్నబిరుదుల్ జాలంబులే చాలునో
శరణోహో యన రా వదేమి వినవో సంసారతాపత్రయం

బెరుగన్నీయదొ యిందు లేవొ చెపుమా యీనిర్దయాబుద్ధి నే
మఱితే ముందు విభీషణాదులకు రామా ఆర్త రక్షామణీ.

మ. పరులన్ శిష్యులఁ దల్లిఁ దండ్రి గురులన్ భ్రాత్రాదులన్ మిత్రులన్
శరణన్నంతనె యాపదల్ పరిహరించన్ రాముఁ డుండంగ నే
వెర పేలంచును బిన్నపెద్దలు బుధుల్ వేదాంతశాస్త్రంబులున్
మఱియుం బల్కెడుపల్కు నమ్మితిని రామా ఆర్త రక్షామణీ!

మ. పరుగై రావదె త్రోవ గానవొ సురల్ ప్రార్థించిరో సామగా
నరుచిం జొక్కితొ యాంజనేయుని వడిన్ రావించితో జానకీ
చరణాబ్జంబులు నొచ్చెనో యితరదేశప్రాణిసంరక్ష నే
మఱితో జాల మిదేలనయ్య రఘురామా ఆర్త రక్షామణీ.

మ. శరణన్నన్ క్షణమే విభీషణున కాచంద్రార్క మైనట్టిదే
వర లంకాపురి ధారవోసి తనుచున్ వాల్మీకి రామాయణా
ది రహస్యంబులు తెల్పుటల్ నిజములై తే నన్ను రక్షింపుమీ
మఱుమాటాడక నింక నానసుమి రామా ఆర్త రక్షామణీ.

## అం బి కా!

ఉ. భారతివై సరోజభవుపాల వసించి రమావధూటివై
నీరజనాభుఁ జెంది ధరణీధరనందనవై మహేశ్వరుం
గోరి వరించితమ్మ నినుఁ గొల్వక యూరక యేలకల్గు సం
సారసుఖంబు లీమనుజసంతతికిం దలపోయ నంబికా.

ఉ. కూడెడివెండ్రుకల్ నిడుదకూఁకటఁ బ్రోవుగ బొడ్డుపై వళుల్
జాడలు దోపఁ గ్రొమ్మొలకచన్నులు మించుదొలంక సిగ్గునం
జూడఁగనేరముల్ మెఱుఁగుఁజూపుల నీన హిమాద్రియింట నీ
వాడుట శూలికిన్ మనము వాఁడుట గాదె తలంప నంబికా!

దేవతాస్తుతి స్తబకము సంఖ్య ...4.19.7.25...
26.6 PA

ఉ. వాలికకన్ను ముంగురులు వాతెఱకెంపు మెఱుంగుఁజంటఁకై
గ్రాలెడుతారహారమును గంకణచారుకరంబు డాపలం
దూలుచునున్న పయ్యెదయుఁ దోచినకన్నులు మోడ్చిమోడ్చి నీ
పాలగునీశుమేను సగపాలు మనంబునఁ జేర్తు నంబికా!

ఉ. లాచి పరాంగనల్ వరవిలాసమనోహర విభ్రమంబులన్
జూచినఁ జూడఁడుత్తముఁడు చూచినఁ జూచును మధ్యముండు దాఁ
జూచినఁ జూడకుండిననుఁ జూచును నీచుఁడు, నన్ను వీరిలో
జూచినఁ జూడకుండుగుణిఁ జూచిన చూపునఁ జూడు మంబికా!

చ. బెడఁ గగురత్నదర్పణముఁ బేరినవెన్నెల వోసి నిచ్చలుం
దుడువఁగఁ బాలసంద్రమునఁ దోఁచి సుధాకరుమేనికందు వోఁ
గడుగఁగ, నేరెటేట సితకంజము ముంపఁగ, నైజకాంతితోఁ
దొడరినతల్లి! నీమొగముతో సరివోల్పఁగఁ జాలు నంబికా!

ఉ. భారతివై సరోజభవుపాల వసించి రమావధూటివై
నీరజనాభుఁ జెంది ధరణీధరనందనవై మహేశ్వరుం
గోరి వరించితమ్మ? నినుఁ గొల్వక యూరక యేల కల్గుసం
సారసుఖంబు లీమనుజసంతతికిం దలపోయ నంబికా!

ఉ. ఆదిమశక్తి యీతరుణి యాద్యకుటుంబిని యీకుమారి ము
త్తైదువ యీతలోదరి చిదాత్మిక యీసతి విశ్వమాత యీ
పైదలి సర్వలోకగురుభామిని యీచపలాక్షి యంచు బ్ర
హ్మాదులు వచ్చి నిచ్చలు హిమాద్రికి నిన్నెఱిఁగింతు రంబికా!

సీ. బల్ జరీయంచు చల్వానఫేదు చీరపై
లాల్ పావడా డాల్ విలాస మెసఁగ
ఒనరు నీరా నమో జూదాబగస్తు కం
చుకముపై గుబ్బచ న్నొసఁగను లొల్కు
వగగుల్కు తగజిల్కు జిగితళ్కు కఠినమౌ
సొగసుకీల్జడకుచ్చు లొగి నటింప
నిగనిగ దగుమోము నొగిబాగు కస్తురి
వగచుక్కబొట్టు ఠీవై చెలంగ

గీ. సరస మలరంగ తొలకరి మెఱు పనంగ
నలరు సీతాంగనను గూడి తౌననంగ
పృథ్విజారామ బుట్టయపేట హేమ
సౌధనిజధామ రఘురామసార్వభౌమ.

చ. గరుడని నెక్కి హేమపటకంకణరత్నకిరీటకుండలా
భరణము లెల్లఁ దాల్చి కరపద్మయుగంబున శంఖచక్రముల్
మెఱయఁగ నింద్రనీలమణిమేచకకాంతుల దివ్యమూర్తితోఁ
బరగెడివేల్పు రామజనపాలుఁడు మాకు సహాయ మయ్యెడిన్.

శా. శ్రీనాథాంబుజ సంభవార్చిత నిజ శ్రీపాదపద్మద్వయున్
నానాదేవమునీంద్ర బృందకృతపుణ్య స్తోత్రపాత్రశ్రియా
నూనైశ్వర్యవిరాజితున్ భుజగకేయూరాంకితున్ భక్తలో
కానీకైకశరణ్యుఁ గొల్తు నిను దాక్షారామ భీమేశ్వరా!

భీమేశ్వర శతకము.

ఉ. గుండయ నుత్తమోత్తమునిఁ గూటికిఁ గప్పెర మైకడంగి యొం
డొండుగ నాటియంగడికి నూరక తెచ్చితి తెచ్చియత్తఱిన్
నిండినవారిలోన నతనిన్ గదుఁబిన్నఁదనంబు సేర్చితే
మండుము నీదుపెద్దతనమా యిది కొట్టయశంకరేశ్వరా!

కస్తూరి భట్టురాజు.

మ. ధరలో నుద్ధురలోభులన్ ధనముచింతం గాంచి కాసంత వే
సరితిం గేసరి తీవ్రరోగహతి నష్టంబై నరీతిన్ మదు
ద్ధురణం బాదరణంబున న్నిలుపవే తాపత్రయాగ్నిస్ఫుర
ద్గరిమార్చిన్ బరిమార్చి భక్తసులభా గౌరీమనోవల్లభా!

గౌరీమనోవల్లభ శతకము.

ఉ. ప్రాణు నపానుఁ గూర్చి యలపాము గదల్చి తదూర్ధ్వకీలితో
ద్యాణము నొత్తి మేను దృఢమై నిగుడన్ బిగియించి దృష్టులన్
ఘోణముఁ జేర్చి యాప్రణవఘోషణమున్ విని యందు మానస
క్షీణము చేసినన్ బవనసిద్ధుఁ డనా శివదేవధీమణీ!

శివదేవ శతకము.

ఉ. వారక కాశిలో నిలిచి వర్ధిలుపుణ్యులు చచ్చి పుట్టఁగా
నేరరుగాని నేరుతురు నెన్నదుటం గనుచూపనైన దు
ర్వారవిషోరగేంద్రము శిరంబునఁ జుట్టఁగనైన మ్రింగి సొం
పారఁ గళప్రదేశమున నాగఁగనైనను గాలకూటమున్.

కాశీ శతకము.

చెలువార గజాజినచేలముతో
గళనీలిమతో నహికంకణుఁడై
తలఁ జంద్రకళం గలదైవము మా
కులదైవము దైవతకోటులలోన్.

ఉపవాసము లెల్లను నుండుట నీ
కృప వచ్చుటకా యిది రిత్త సుమీ
అపవిత్రుని పుల్లని యంబలికై
సుపవిత్రునిఁ జేయుట శుద్ధి గదా.

రంగనాథుని తోటకములు.

ఉ. లోకము లెల్ల నీతనువులోనివ నీవట యెంతగల్గుదో
నాకపపద్మసంభవజనార్దను లాదిగ నెల్లవారలుఁ
నీకొలఁ దింతయంత యననేరక త్రొక్కుఁ దొడంగి రన్న ని
న్నేకరణిఁ నుతింతుఁ బరమేశ్వర ! శ్రీగిరిమల్లికార్జునా !
(పండితారాధ్య దేవర.)

మ. నిను సేవించినఁ గల్గుమానవులకుఁ బీటీవధూటీ ఘటీ
ఘనకోటీ శకటీ కటీతటిపటీ గంధేభవాటీపటీ
ర నటీహాటిపటీ సువర్ణమకుటీ ప్రచ్ఛోటికాపేటికల్
కనదామ్నాయమహాతురంగ శివలింగా నీలకంఠేశ్వరా !
(ఎఱ్ఱాప్రెగ్గడ)

ఉ. తల్లి సతీమతల్లి పదతామరసాశ్రితకల్పవల్లి భా
స్వల్లలితాంగవల్లి రతివల్లభతల్లి కృపారసంబు పైఁ
జల్లి నిరంతరంబు మముఁ జల్లనిచూపులఁ జూచి నీవు మా
యిల్లను పాలవెల్లివసియింపఁగదే జగదంబ భార్గవీ.
గొట్టిముక్కుల. నరసింహరాజు గారు

కార్తవీర్యార్జునా

శా. శ్రీరాజిల్లఁగఁ బ్రోజ్జ్వలన్మణిగణశ్రీ మించు సింహాసనం
బారూఢస్థితిచే వహించి ఘనభూపాలంకరిష్ణుండవై
రారాజుల్ వినుతింపఁగా భువనముల్ రక్షించుమీరాజసం
బారాధించి నుతింతు మేరునగధైర్యా ! కార్తవీర్యార్జునా !

మ. లలితేంద్రోపలనీల భక్తజనపాలా సద్దయావాల ని
శ్చలసంధ్యారుణచేల సుందరతరశ్యామాయుతాలోల ని
స్తులశుంభద్గుణజాల సంతతఘనస్తుత్యైకభూపాల య
త్యలఘుప్రాభవశీల మేరునగధైర్యా ! కార్తవీర్యార్జునా !

మ. నవరత్నోజ్జ్వలదివ్యభూష నతనానాభక్తపోషా మహా
హవసంరంభవిజృంభమాణరిపుబాహాటోపశోషా జన
స్తవనీయోజ్జ్వలభాష దీనజనదోషద్వేష లావణ్యగా
రవసంమోహనవేష మేరునగధైర్యా! కార్తవీర్యార్జునా!

మ. గ్రహసందర్శనమైనచోట భయముల్ కన్పించుచోటన్ దురా
గ్రహవృత్తిన్ రిపు లేచుచోట నిడుముల్ గారించుచోటన్ నవ
గ్రహవేధల్ ఘనమైనచో దమసుమంత్రంబే సదా ద్రవ్యసం
గ్రహమై భక్తులఁ బ్రోచు మేరునగధైర్యా! కార్తవీర్యార్జునా!

శా. నీలేందీవరదివ్యకాయ సురమౌనిశ్రేణిసంస్తూయ భ
క్తాళీమానవసంవిధేయ కరుణాధారేయ విద్విణ్మదో
త్తాలస్తంభనసాంపరాయ విలసద్గ్రైవేయ కళ్యాణభ
వ్యాలంకారనికాయ మేరునగధైర్యా! కార్తవీర్యార్జునా!

మ. కరుణాపాంగ నవాతసీకుసుమరంగత్కోమలాంగ ప్రభా
కరనీకాశకనద్రథాంగ రణరంగస్థైర్య శౌర్యక్షపా
చరసందోహతమఃపతంగ మకుటస్ఫారోత్తమాంగారి సం
హారదోర్దండభుజంగ మేరునగధైర్యా! కార్తవీర్యార్జునా!

మ. సరసీజాక్ష విశాలవక్ష భవశిక్షాదుష్టచోరారికుం
జరహర్యక్ష కృపాకటాక్ష బలదక్షా చక్రసంరక్ష భూ
భరణాధ్యక్ష మహోరగాది మృగకృద్బాధాపహారేక్ష ని
ర్జరమౌనివ్రజపక్ష మేరునగధైర్యా! కార్తవీర్యార్జునా!

మ. పటుదీర్ఘాంచితబాహుదండ సమరప్రారంభ శుంభన్మదో
త్కటకోదండ ప్రచండకాండనతహృత్కంజాతమార్తాండ ది
క్తటవిద్యోతితదానశౌండ హిమరుద్గండద్వయోద్దండ దు
ర్ఘటదేవారివిఖండ మేరునగధైర్యా! కార్తవీర్యార్జునా!

మ. గిరిదుర్గాటవి దుర్గమస్థల జలాగ్ని క్రూరపై శాచచో
రరిపువ్యాఘ్రములులాయ సూకరమృగేంద్ర వ్యాళవై హంగ వా
శ్వరవర్గాతపశీతవాత ఘనవాశం బిష్టసంధాన ము
ర్వర నీమంత్రబలంబు మేరునగధైర్యా! కార్తవీర్యార్జునా!

మ. గరిమ న్నీదుపికారు వైభవము వర్ణించగా శక్యమా
వరభేరీపటహాది ధంధణధణధ్వానంబులుఀ డిండిమో
త్కరడిండిండిమ డిండిమారవము లుద్యత్తూర్యనాదంబులు
ర్వరలోదుర్భరమౌర మేరునగధైర్యా! కార్తవీర్యార్జునా!

మ. తురికీరాణి తురాణ్యరబ్బిహయముల్ దూకించి శాబాసు బా
పురెయంచుఀ మెడలప్పళించి హవుసింపొందంగ తేగాసురే
తరవారుల్ ఝళిపించగఀ బగలు సర్దార్ ఘూర్ని షుల్ సేయునీ
హరువౌ దాలతునెంతు మేరునగధైర్యా! కార్తవీర్యార్జునా!

శా. దాటుఀగుల్లెక్కడు కల్లెముఀ పసిఁడిగండాపట్టు కింఖాపు చే
వాటంబై తగుజీనుపోషు మణిరవ్వల్ జుగ్గగాయించుదు
చ్చీటంగుఀ బిరుదందియల్ కలుగు తేఁజస్వారిమై లీలఁజె
ల్లాటం బాడెద వౌర మేరునగధైర్యా! కార్తవీర్యార్జునా!

శా. జంగోష్మేషు జగా జరాసరిఫెనల్ జామాతుమాంపట్టుక
మ్మెరుపేటీమొకమాలు రంచికిలిదమిక్కమోరు షంషేడుదు
స్తురుమాల్ కస్తురిబొట్టు సిస్తుగులుకఀ తుర్కీహయంబెక్కి వా
హ్వా రెసీ వేఁగెదుస్వారి మేరునగధైర్యా! కార్తవీర్యార్జునా!

## బ్రహ్మబిల పంచరత్నములు

సీ. నీలతోయదమధ్య నీవారశూకవ
        త్పరిపూర్ణకాంతితోఁ బ్రబలుచుండు
    శంపాలతలభాతిఁ జటులప్రకాశమై
        చంచరీకమురీతి జరగుచుండు
    కరికుంభమధ్యస్థ ఘనమౌక్తికద్యుతి
        ప్రబలప్రకాశమై పరగుచుండు
    శరదిందుచంద్రికాస్వచ్ఛవిద్యోతమై
        యాహ్లాదజనకమై యలరుచుండు

గీ. పద్మగర్భోద్భవముఁగొల్వ భానుపగిదిఁ
    బటిమదీపించుఁ జటులహృత్పద్మమందుఁ
    బరమహంసవిహార చిత్ప్రణవధార
    పదుల నైదింట శోభిల్లు బ్రహ్మబిలము.

సీ. కరతలంబున నొప్పలరు నిష్టలింగంబు
        నయనస్థలంబున ననువుపఱచి
    నయనస్థలంబున నలరుసత్ప్రాణంబు
        హృదయస్థలంబున గుదురుపఱచి
    హృదయస్థలంబునఁ బొదలుసద్భావంబు
        మంత్రస్థలంబున మరులుకొలిపి
    మంత్రస్థలంబున మరులందు చిద్బిందు
        కూటత్రయంబునఁ బొటుపఱచి

గీ. పాటకూటత్రయంబులో ప్రణవతేజ
    తేజతేజోలయవ్యాప్త తేజమగుచు
    మర్మవర్మాదికర్మముల్ మర్మమగుచుఁ
    బదులనైదింట శోభిల్లు బ్రహ్మబిలము.

సీ. ప్రణవకుండలిశిరోమణి మండలంబున
మండలత్రయమున మాటుపఱచి
మండలత్రయమున మాటుపడున్నట్టి
అఉమక్షరత్రయం బనువు తెలిసి
అఉమక్షరత్రయం బనువు తెల్సినచోట
నంగలింగజ్ఞానసంగ మెఱిగి
యంగలింగజ్ఞానసంగ స్థలంబున
నలబిందుపంచకం బైక్యపఱచి

గీ. పరచిదానందషట్కోశపద్మ మొంది
మందిరాంతరచిత్కళా మండలముల
నంబుజానంద మణితేజకంద మగుచు
పదులనైదింట శోభిల్లుబ్రహ్మబిలము.

సీ. పద్మకాశద్యుతిప్రతికాశమై చన
పావకస్థానంబు పైఁ దనర్చు
ప్రాణలీలాపాన పరిపూర్ణసంచార
కుంభకస్థాన తత్కుహరమందు
తాలుమూలాంతర ద్వాదశస్థానమౌ
పరనాళవీథుల ప్రబలఁదెలిసి
లింగాంగసంధాన లీలానుకూలమౌ
హంసాక్షరద్వయం బాశ్రయించి

గీ. ఉర్వివర్ణద్వయంబున కూర్ధ్వమైన
వర్ణభేదంబు లన లేనివనిత గనుచు
వనితకనుచూపులో నున్న వర్ణమగుచుఁ
బదులనైదింట శోభిల్లుబ్రహ్మబిలము.

సీ. కదలక యాధారకమలంబులోనున్న
    భుజగకన్యకఁ గూర్చి పాదలఁదీర్చి
సమమైన మలకలు చక్కఁగా సవరించి
    షణ్మండలంబులు సంధిపఱచి
పరిమిత షట్చక్ర పద్మాంతములయందు
    పరిపూర్ణ బంధముల్ పరగ నునిచి
ప్రాణవాయుస్థానపటుకళాసంపూర్ణ
    ఘంటానినాదంబు కలయఁదెలిసి

గీ. తెలిసి విధుమండలంబులఁ దేటపడగ
పడగలాడింటఁ బవనంబు ప్రణవనాద
నాదపరిపూర్ణచిత్కళానంద మగుచు
పదులనైదింట శోభిల్లు బ్రహ్మబిలము.

## షట్చక్ర నిర్ణయము

సీ. ఆధారచక్రంబునందు భక్త్యంగంబు
    వసుధాంశచౌదళవారిజంబు
పీతవర్ణము క్రియాభిధ కల్గినది శక్తి
    ధాత పూజారియై తనరు నచట
నాల్గక్షరంబులు నమరుబీజంబులై
    పరమును జిత్తంబు పరగెనందు
నాసంబుముఖము నౌవాసనద్రవ్యంబు
    పదపదార్థంబుగాఁ బక్వశుద్ధి

గీ. యొనర నైష్ఠికసద్భక్తి యుక్తముగను
లీలవర్ధిల్లు నాచారలింగమునకుఁ
గోరి యర్పించి శేషంబుఁ గొన్నయట్టి
భక్తలింగంబు నిరతంబు ప్రస్తుతింతు.

సీ. స్వాధిష్ఠచక్రాన సలిలాంశమగునాఱు
దళముల పద్మంబు దనరుచుండు
నందుఁబాయకయుండు నాఱక్షరంబులు
శ్వేతవర్ణంబని చెప్పనొప్పు
పూని మహేశ్వర స్థానంబు నిజమది
పూజారి విష్ణుండు పొదలు జ్ఞాన
శక్తి యటమెలంగు చామముఖంబగు
పాణిసుబుద్ధియై పరగుచుండు
గీ. చాల యవధానభక్తిచే మేలురసము
లలమి చేకూర్చి సుగురులింగార్పితంబు
చేసి శేషంబుభోగించి చెలగునట్టి
పరమమాహేశ్వరుల నేనుబ్రస్తుతింతు.

సీ. మణిపూరమను చక్రమం దనలాంశంబు
పరికింప దశదళ పద్మమచట
నరుణవర్ణము పదియక్షరంబులునందు
రుద్రుండు పూజారి రూఢినిచ్ఛ
శక్తినివాసంబు చక్షులే వదనంబు
యదిప్రసాదిక మార్గ మనగనొప్పె
సల నిరహంకారహస్త పద్మంబున
రూపద్రవ్యంబు లారూఢముగను
గీ. పక్వమొనరించి యవధానభక్తియుక్తి
యరయఁ జేకూర్చి లింగసమర్పితంబుఁ
గొన్న శేషంబుభోగించి కుశలుఁడైన
యాప్రసాదిని వినుతింతు ననుదినంబు.

సీ. సత్య మనాహతచక్ర ప్రభావంబు
పదిరెండురేకుల పద్మమునికి
యనిలాంశ మగుద్వాదశాక్షరంబులుకూడి
హరితవర్ణంబుచే నలరియుండు
నరయనీశ్వరుఁడు పూజారియై చెలువొందు
నాదిశక్తియు నందు మోదమలరు
నరవి ముఖమును త్వక్స్పర్శయే ద్రవ్యంబు
నిత్యమానసహస్త నియతిఁబూని

గీ. లీల శోభించి సుచరాఖ్య లింగమునకు
యుక్తమొనగూడ ననుభావ భక్తికతన
నర్పితముచేసి స్వీకార మందినట్టి
ప్రాణలింగిని నిరతంబు ప్రణుతిఁజేతు.

సీ. స్వచ్ఛమైనవిశుద్ధ చక్రంబునందున
పదియారు దళములపద్మ మరయ
నందు పదారవు నక్షరంబులు గల్గి
యంబరాంశంబందు నతిశయిల్లు
నింద్రనీలచ్ఛాయనెనయు పరాశక్తి
యలసదాశివుఁడు పూజారిఁ దలఁప
కర్ణదేశంబును వర్ణింప ముఖసీమ
జ్ఞానహస్తంబును పూనిశబ్ద

గీ. పదపదార్థము నానందభక్తిగూర్చి
సారమైనట్టి నిత్యప్రసాదనామ
లింగమున కిచ్చి శేషంబులెన్నగొన్న
శరణులగునట్టి ఘనులనే సన్నుతింతు.

సీ. సలలితమాజ్ఞేయ చక్రధర్మంబది
ద్విదళపద్మముకాంతి తేజరిల్లు
ప్రణవాంశమగు దాన ప్రకటింపశక్యమే
అందులరెండు బీజాక్షరములు
యందుబాయకయుంషు నమ్మహాచిచ్ఛక్తి
పూజారిపరశివుఁడూర్జితముగ
నిర్ణయింపఁ గపోలవర్ణ మచ్చోటను
హృదయంబు ముఖపద్మ మది దలంప

గీ. పరిణయంబనుద్రవ్యమే భావహస్త
మునను జేకూర్చి మహాలింగమునకుఁ దృప్తి
యవును సమరస భక్తిచే నలరి లింగ
మైక్య సుస్థలవర్తుల నభినుతింతు.

యోగపంచరత్నాలు

సీ. అష్టాంగ యోగరహస్యంబు లొనఁగూర్చి
బంధత్రయంబు నభ్యాసపఱిచి
కేవలకుంభకక్రియఁ బవను మరల్చి
కుండలీశక్తిమేల్కొనఁగదల్చి
నాదంబుబ్రహ్మరంధ్రమున మ్రోవఁగఁ జేసి
ముక్తి సింహాసనమునకు వచ్చి
పాంచభౌతికమైన బ్రహ్మాండ పిండాండ
కరణముల్ సాంఖ్య మార్గమునఁ దెలిసి

గీ. ఆత్మలింగంబు నేత్రమధ్యమునఁ జూచి
రాజయోగంబు గన్న ధీరాగ్రగణ్య
ప్రణవ సంధాన తారకపదనిధాన
యోగబలసాంద్ర శ్రీగురుయోగిచంద్ర !

సీ. అంఘ్రిమూలం బొకటడ్డము పదము మ
ధ్యమునఁ గట్టిగ బిగియంగఁ బన్ని
కడమపాద మవలితొడ సిక్కసందుగా
నునిచి యాకుంచనంబునను మెఱసి
కను పక్కలించి శీఘ్రంబుగా రొమ్మున
గడ్డ మానించి వే కరయుగంబు
నూరుద్వయంబున నూనిచి కాయంబు
నివిడి ప్రాణు నపాను నెయ్యపఱిచి
గీ. మనసుపవనంబు గూర్చి భ్రూమధ్యదృష్టి
నిలుపుబంధత్రయాభ్యాస నిరుపమాఢ్య
ప్రణవసంధాన తారకపథనిధాన
యోగబలసాంద్ర ! శ్రీగురుయోగిచంద్ర !

సీ. ఆధారముననుండి యాకుంచనంబున
బ్రహ్మనాళంబులో బాటపఱిచి
వదనం బొకించుక వంచి దంతంబుల
మధ్యను రసనంబు మాటు సేసి
నమము నిక్కించుక కను పక్కలించుక
యోష్ఠముల్ రెండును నొయ్యమూసి
యంగుళద్వయమునఁ బింగళాశశినాడు
లంటి పూరకగతి నంటఁబట్టి
గీ. గంధవహుని సహస్రారకమలమందుఁ
గూర్చితిరి కేవలంబైన కుంభకమున
ప్రణవసంధాన తారకపథనిధాన
యోగబలసాంద్ర ! శ్రీగురుయోగిచంద్ర !

సీ. తారకయోగవిద్యారహస్యంబు శీ
లించి శిరంబు నిల్లింతవంచి
పూర్ణిమాదృష్టిని బొమలు మీఁదికి నెత్తి
మనసుచేతను బిందు వనుసరించి
మండలత్రయములమధ్య నంతర్లక్ష్య
ముద్రనీలజ్యోతి మొనకుఁ జేర్చి
కంటిరెప్పలు రెండు నంటకుండఁగ వ్రాల్చి
లోచూపుకనుగంట లోనుపఱిచి

గీ. దివ్యతేజంబు చూచి మూర్తీభవించి
యాత్మలింగంబు గనుఁగొంటి ననుభవమున
ప్రణవసంధాన తారకపథనిధాన
యోగబలసాంద్ర ! శ్రీగురుయోగిచంద్ర !

సీ. పంచీకృతంబైన పంచమహాభూత
కార్యముల్ కల్లలుగాఁగఁ జేసి
కామంబు క్రోధంబు కడు లోభమోహంబు
మదము మత్సరమును వదలఁ జేసి
సంసారముననుండి సంగి యయ్యునుగాక
బురుదలో కుమ్మరపురుగు వలెను
శమదమంబులఁ జిత్తమమలత గాలించి
బ్రహ్మంబు నిలుకడ పఱిచి వేగ

గీ. సత్తుచిత్తును నానందసరళి నగుచు
లోనవెలిఁ బూర్ణముననుంటి లీనమునను
ప్రణవసంధాన తారకపథనిధాన
యోగబలసాంద్ర ! శ్రీగురుయోగిచంద్ర !

సీ. శ్రుతులు దెమ్మని వేఁడఁ జతురాననుఁడఁగాను
నమృత మిమ్మన హరిహయుఁడఁగాను
తనునెత్తుకొను మన ధాత్రినిగాను గం
బమునఁ బుట్టుమన డింభకుఁడఁగాను
ఆత్మజుఁగాఁ గోర నదితినిగాను భూ
స్థలి దానమడుగఁ గశ్యపుఁడఁగాను
బ్రహ్మత్వ మర్థింపఁ బవనాత్మజుఁడఁగాను
హరులఁ ద్రోలుమనంగ నరుఁడఁగాను
శరరూప మగుమనఁ బురదాహకుఁడఁగాను
కలి ద్రుంచుమన మౌనిగణముగాను

గీ. పదవులనుగోర నీపదపంకజాత
జాతమకరందపాన ప్రశాంతచిత్త
బింబిత స్వప్రకాశకాభిన్నరూప
తత్త్వదార్థిక సుజ్ఞానధారదక్క.

సీ. శరధిఁ జొచ్చుటగాదు గిరిధరించుటగాదు
ధరణినెత్తుటగాదు నరమృగేంద్ర
తనువుదాల్చుటగాదు దైత్యు వేఁడుటగాదు
రాజవీరుల రణరంగమందు
దునిమివైచుటగాదు వనధిఁ గట్టుటగాదు
హాలముఁబూనుటగాదు హరిమహీజ
మవనిఁజేర్చుటగాదు హరశరం బగుటగా
దశ్వవాహనముగాదన్నదీయ

గీ. మానసాంభోజకర్ణికా మధ్యసీమ
నిరుపమానందసంస దున్మేషవేష
తరుణతావక దాంపత్య చిరవిలాస
గరిమ కరుణించుటెంతటి కార్య మభవ!

## రామ నవరత్నములు.

సీ. శ్రీజానకీదేవి చెలువుగా వామాంక
తలమున ముద్దులు గులుకుచుండ
నగ్రభాగంబున నాంజనేయుఁడు నిల్చి
పాదంబు లొత్తుచు భక్తి నెఱప
వెనుక నెమ్మనమున వినయంబు తనరార
సౌమిత్రి మౌక్తికచ్ఛత్ర మూన
నుభయపార్శ్వంబుల నొదిఁగి వింజామరల్
భరతశత్రుఘ్నులు పట్టి కొలువ

గీ. దండ సుగ్రీవుఁడు విభీషణుండు నవల
నంగదుండును జాంబవదాదు లుండఁ
దల్లి చల్లగఁ జూడఁగ నల్లనికళ
లలరునినుఁ గొల్తు నెపుడుఁ బట్టాభిరామ!

సీ. శ్రీవసిష్ఠాదు లాశీర్వాదములు సేయఁ
గల్యాణవాద్యముల్ కదిసి మ్రోయ
సరసపుణ్యాంగనాజనము పాటలు పాడ
నప్సరస్త్రీలు నృత్యంబు లాడ
దశరథజనకాదిధరణీశు లలరంగ
బాంధవుల్ మోదసంపదఁ దగంగ
కౌసల్య మొదలగు కాంత లానందింప
నిరువైపులను జెలు లెచ్చరింప

గీ. మిథిల శుభవేది నొండొరుమీఁదఁ గదిసి
పొసఁగి ముత్యాల తలఁబ్రాలు పోసికొనెడు
రమ్యమూర్తులు జానకీరామచంద్రు
లాత్మలో నుండి నను బ్రోతు రనుదినంబు.

సీ. కౌశికుయజ్ఞంబు గాచిన జయశాలి
యలయహల్యను బ్రోచినట్టి ఘనుఁడు
కాకాసురుని తప్పు గాచిన సదయుండు
మానిరక్షా ప్రతిజ్ఞానిపుణుఁడు
శబరికోరికఁ దీర్చి చల్లని దేవుండు
హనుమంతు నేలిన ఘనయశుండు
సుగ్రీవు వేగ ననుగ్రహించిన మేటి
దయ విభీషణుఁ బ్రోచు ధర్మమూర్తి

గీ. ఆర్తరక్షణబిరుదాంకుఁ డైనస్వామి
వేడుకలు మీఱ సీతమ్మతోడఁ గూడి
రామచంద్రుఁడు మమ్ము నిరంతరమ్ము
చింత లెడఁబాపి కరుణ రక్షించుఁ గాత.

సీ. శ్యామలకోమలజలదకాయమువాని
కమలసుందర లోచనములవాని
భానుకోటిప్రభాభరిత తేజమువాని
జిలుఁగుబంగరువల్వ గలుగువాని
నవ్యకిరీటసుందరహారములవాని
నునుమానికపు మొలనూలువాని
మణికంకణాంకితమంజీరములవాని
ఘనదీర్ఘబాహుయుగంబువాని

గీ. మందహాసంబువాని సమగ్రవేద
శాస్త్రముఖసర్వవిద్యలు చదువువాని
ఘనతపోజ్ఞేయమాహాత్మ్యకళలవాని
నిఖలయోగీంద్రుఁడగువాని నేఁ దలంతు.

సీ. శ్రీకరంబైనట్టి సాకేతపురములో
మాణిక్యమండపమధ్యసీమ
మందారతరుమూల సుందరమణిజాల
సింహాసనంబున జీవరత్న
కలితహాదివ్యాష్టదళపద్మమునఁ దండ్రి
తొడను గూర్చుండి ముద్దుగనువాని
లలితేంద్రనీలకోమలశరీరమువాని
కమలవిశాలనేత్రములవాని

గీ. సోదరత్రయసహవాససుఖమువాని
నతుల మకుటాదిభూషితుండైనవాని
కనకమయచేలుఁ గౌసల్యకన్నకొడుకు
ధ్యాన మొనరింతు సేవింతు నభినుతింతు.

సీ. అందంపుఁజుంచుతో నాణెము త్తెమ్ముల
జోకైననెఱరావిరేకతోడ
నిద్దంపువజ్రాలమద్దికాయలతోడ
ముద్దైన చిఱునవ్వుమొగముతోడ
బొజ్జపై నటియించు పులిగోరుతాళితో
రమణీయమణికంకణములతోడ
నవరత్నఖచితఘంటలమొలనూలితో
నీటైనగిలుకుటందియలతోడ

గీ. తోడలక్ష్మణభరతశత్రుఘ్నులాడఁ
బరుగులెత్తఁగ వెనువెంటఁ బరుగులెత్తి
తల్లి కౌసల్య రార నాతండ్రి యనుచు
నెత్తిముద్దాడు శ్రీరాము నే భజింతు.

సీ. దశరథసుతుడవై తాటకఁ బరిమార్చి
మఘుపోషివై శిల మగువఁ జేసి
శర్వునివిల్లుద్రుంచి జానకిఁ బెండ్లాడి
పరశురాము జయించి గురువునాజ్ఞ
వని కేఁగి ఖరుఁ ద్రుంచి కనకమృగం బేసి
యినజుని గూడి వాలిని వధించి
వనధి బంధించి రావణుఁ గీటడంగించి
సీతతోడ నయోధ్యఁ జెలగుచుండి

గీ. తల్లులును దమ్ములును బ్రమోదమునఁబొదల
నాంజనేయాదిసహితుఁడవై సమస్త
రాజ్యమేలెడు పట్టాభిరామమూర్తి!
క్షేమ మొనగూర్చి మమ్ము రక్షింపవయ్య.

సీ. దశరథరామ నీదయకుఁ బాత్రుఁడ నయ్య
రక్షించు జానకీరామచంద్ర
కౌసల్యరామ చక్కఁగ నేలుకోవయ్య
దరిఁ జేర్చవయ్య కోదండరామ
జయరామ నేను నీశరణొందినా నయ్య
రఘురామ నాపైఁ బరాకటయ్య
సాకేతరామ నాసన్నుతి వినవయ్య
పట్టాభిరామ చేపట్టవయ్య

గీ. అన్నమన్నించు చిన్నరామన్న సన్నుఁ
గన్నతండ్రివి మాకునీకన్న నెవరు?
శీఘ్రముగ మాకభీష్టసంసిద్ధిఁ జేయు
రామ శ్రీరామ కల్యాణరామ రామ.

సీ. నాచిన్నరామన్న ననుఁగన్నతండ్రి రా
నన్నేలునయ్య నాయన్న రార
నాముద్దులయ్య నాసామి రాఁగదవోయి
అప్ప చక్కదనాలకుప్ప రార
నాపెన్నిధానమా నాపుణ్యమూర్తి రా
నాయింద్రనీలరత్నంబ రార
బంగారుకొండ నాపాలిభాగ్యమ రార
అమృతంపుఁ జెలమ రా యయ్య రార
గీ. చూత మెవ్వరు వత్తురో చూత మనుచుఁ
దల్లి పిలువంగ నందియల్ ఘల్లు మనఁగ
నవ్వి చెలరేఁగి గునగున నడచివచ్చు
నట్టికౌసల్యగారాపుఁబట్టిఁ దలఁతు.

సీ. శ్రీరామచంద్రుని పేర నంకితమయి
నవరత్ననామసుందరము నయిన
నవపద్యనవక మేనరుఁడైన భక్తితో
వ్రాసినఁ జదివిన వరుసతోడ
సంగ్రహించిన విన్న సకలఫలంబులు
శ్రీరాము లిచ్చును సిద్ధమెప్పు
డాయురారోగ్యంబు లైశ్వర్యమును గల్గు
నిష్టసంసిద్ధియు నెల్లవేళ
గీ. ప్రతిదినంబును మానక పరమనియతి
వినెడు పురుషుఁడు ధర సర్వజనులలోన
నుత్తమోత్తముఁ డగు వేదవేత్తలయిన
వానితో సాటిగారు భూవలయమునను.

## దశసీసములు

సీ. పాలమున్నీటిలో ఫణిరాజశయ్యపై
యోగనిద్రాసక్తి నున్నవాని
కోటిసూర్యప్రభల్ మీటుకిరీటముల్
వేయుమస్తకముల వెలయువాని
కౌస్తుభమణియును గర్ణకుండలములుఁ
గమలనేత్రంబులుఁ గలుగువాని
సిరియును భూదేవిచరణంబు లొత్తంగఁ
గరుణారసము చాలఁ గలుగువాని

గీ. దలఁతు నుతియింతు ధ్యానింతుఁ దగ భజింతు
నన్నుఁ గృపతోడఁ బ్రోవు మనాథనాథ!
శ్రీమనోనాథ! మాధవ! శ్రీయనంత
పద్మనాభ! దయానిధీ! పరమపురుష!

సీ. కౌండిన్యసతినోము కానుక సోలెఁడు
నూకలిచ్చిన మెచ్చిసాకినావు
కోరి కుచేలుఁడు కొణిదెఁ డడుకులు దెచ్చి
యిచ్చిన సంపద లిచ్చినావు
పాంచాలియును మీకు బలుసుకూరయు నీళ్లు
బోసినఁ గృపతోడఁ బ్రోచినావు
సగ మొగిఁగొఱికి యాశబరియిచ్చినపండ్లు
భక్షించి యామెఁ గాపాడినావు

గీ. భక్తవత్సల వరపంచభక్ష్యములను
నాకొసంగిన నర్పింతు నీకు నెపుడు—శ్రీమనో.

సీ. ఆదినారాయణ! ఆత్మపరాయణ!
కేశవాచ్యుత! హరి! వాసుదేవ!
శ్యామలాంబుదవర్ణ! కామితార్థప్రద!
సామగానప్రియ! సదయహృదయ
భక్తరక్షామణీ! పరమాత్మ! పరమేశ!
దేవ! జగన్నాథ! దేవవంద్య!
శర్వాణిసన్నుత! గీర్వాణవందిత!
నీరజలోచన! నిగమవినుత!

గీ. లోకనాయక సద్భక్తలోకవరద!
పుండరీకాక్ష మము వేగఁ బ్రోవుమయ్య—శ్రీమనో.

సీ. గ్రాహంబుచేఁ జిక్కి కరి డస్సి మొఱపెట్ట
గజరాజునాపదఁ గడపినావు
తండ్రిబాధకునోపి తగమిమ్ము నుతియింపఁ
గరుణతోఁ బ్రహ్లాదుఁ గాచినావు
ఆపన్నుఁడై వేఁడ నావిభీషణునకు
మెచ్చి లంకారాజ్య మిచ్చినావు
కట్టినపుట్టముల్ కౌరవు లొల్వంగఁ
బాంచాలి దురవస్థఁ బాపినావు

గీ. కాన శరణంబు వేఁడెదఁ గమలనాభ
అభయదానమ్ము మాకిమ్ము సుభగచరిత—శ్రీమనో.

సీ. దేవ జనార్దన దివ్యగోవర్ధన
ఖగరాజవాహన కలుషదహన
వసుదేవనందన వాణీశవందన
కాళియమర్దన కంసహరణ
పంకజలోచన భవబంధమోచన
దారిద్ర్యభంజన దైత్యదమన
సన్మునిపాలన సద్ధర్మశీలన
కరిశాపనాశన యురగశయన

గీ. పరమపావన త్రిభువనపారిజాత
దీనమందార నను( బ్రోవ దిక్కు నీవె—శ్రీమనో.

సీ. దాతవు తల్లివి తండ్రివి భ్రాతవు
హితుఁడవు బంధుఁడ వీవ మాకు
కావంగఁ బ్రోవంగఁ గర్తవు భోక్తవు
పెన్నిధి వని నమ్మియున్నవాఁడ
నను నేరమెంచక యనుకంప గనుపింప,
దినరత్నామణి దిక్కుసూపు
వేయి మోములు రెండువేలు జిహ్వలుగల
శేషుండు మిము నుతి సేయలేఁడు

గీ. ఇట్టి మిమ్ము నుతింప నే నెంతవాఁడఁ
బాపకర్ముండఁ బాపుండఁ బాపమతిని—శ్రీమనో.

సీ. ఉదయాస్తమనముల నుడుగక నెడునాదు
మాటలే మీనామమంత్రజపము
బాహుయుగ్మంబున బహువిధంబులఁ జేయు
పనులె మీశ్రీదివ్యపాదపూజ
ఎడపక పుడమిపై నిడెడునాయడుగులు
తగ మీకుఁ జేయు ప్రదక్షిణములు
శయ్యపై వేడ్కల శయనించు టెల్లను
ధరఁ జాగి సాష్టాంగదండ మిడుట

గీ. గాఁ దలంపుము ననుఁ జాలఁ గరుణఁ బ్రోవు
నాదుకోర్కుల నీడేర్చు యాదవేంద్ర—శ్రీమనో.

సీ. విప్పపం బవధారు విశ్వేశ యీపది
సీసముల్ చెప్పితిఁ జిత్తగించు
మిది కడుభక్తితో నేప్రొద్దు నుతిసేయు
పఠనసేయు మహానుభావులకును
నాయురైశ్వర్యంబు లతిశుభప్రదములు
విష్ణుకీర్తనములు వినుట బుద్ధి
కోరినకోరికల్ కొనసాగఁగాఁ జేసి
ధనధాన్యపుత్త్రిపౌత్త్రాభివృద్ధి

గీ. సకలసంపద్విశేషముల్ సౌఖ్యములును
గలుగఁజేసి దృఢాంగులుగానొనర్చు—శ్రీమనో.

సీ. మాధవ! మీకథామాధురిఁ గ్రోలునా
నాల్క దుష్కథల ననంగ నీయకు
వైకుంఠనిలయ! మీవర్ణనల్ వినునాదు
వీనులఁ బెఱకథల్ విన(గనీయకు
కమలాక్ష! మీపాదకమలంబు సూచునా
కన్నులఁ బరసతికాంక్ష యిడకు
శౌరి! నీనిలయంబు చేరఁగోరెడునాదు
చిత్తంబునకుఁ బరచింత యిడకు

గీ. ఘోరదురితంబు లెటునన్నుఁ జేరనీయకు
మాయురభివృద్ధికృప సేయుమయ్య నాకు — శ్రీమనో.

సీ. ప్రహ్లాద నారద బక దాల్భ్య శ్రీశుక
కశ్యప గౌతమ కణ్వ కుత్స
కపిల వేదవ్యాస కౌశిక మాండవ్య
బలి విభీషణ భృగు పరశురామ
జాంబవ ద్రుక్మాంగ దాంబరీషార్జున
వామదేవ వసిష్ఠ వైనతేయ
మాండవ్య విదుర మార్కండేయ గాంగేయ
శౌనకబృహదశ్వ సదృశులైన

గీ. నిన్ను వర్ణింపనేర్తురే నీరజాక్ష
నన్నుఁ గృపతోడఁ జూడు మనాథనాథ!
శ్రీమనోనాథ! మాధవ! శ్రీయనంత
పద్మనాభ దయానిధీ పరమపురుష.

కంచివరదరాజస్వామి.

సీ. చేతిలో వెనముద్ద చెంగల్వపూబంతి
రంగైనముత్యాలరావిరేక
పచ్చలుదాఁపినపతకంబు పులిగోరు
మేలైనముత్యాలమేలుసరము
నీలాలప్రోఁగులు నిగ్గులు మెఱయంగఁ
దీరు గైకొన్న కస్తూరిబొట్టు
ధగధగద్ధగకాంతి మిగులురత్నకిరీట
మలరారు పసిఁడిదువ్వలువచెలువ

గీ. మాస లూరింప వైశాఖమాసమందు
బసిఁడిరథ మెక్కి తిరువీథి బయలువెడలు
నిన్నుఁ గంటి నాకోర్కు లన్నియును గంటి
వరగుణసమాజ! శ్రీకంచివరదరాజ!

కావేటిరంగఁడు.

సీ. మంచినీలపుఁజాయ మించుదేహమువానిఁ
గాచుచల్లనిచూడ్కిఁ జూచువాని
ఉరగేంద్రశయనుఁడై యొప్పుచుండెడువాని
మేలైనపచ్చలతాళివాని
కులుకునెమ్మోమున మొలకనవ్వులవాని
డంబైన మణికిరీటంబువాని
గుఱుతైన నవరత్నకుండలంబులవాని
పొసగిన కస్తూరిబొట్టువాని

గీ. ఆదిలక్ష్మికిఁ బ్రాణేశుఁడైనవాని
మీనకేతనజనకుఁడై మెఱయువాని
నుభయకావేరి మధ్యమం దున్నవాని
రంగధామునిఁ బొడగంటిఁ బొంగుచుంటి.

సీ. శ్రీరమా హృత్సంగ చిరకౌతుకోత్తుంగ
హస్తాగ్రకలిత రథాంగ రంగ
కవిహృద్వనజభృంగ కలుష తమ పతంగ
కనదంఘ్రి సంభూత గంగ రంగ
అక్షయోగ్రనిషంగ రాక్షసమదభంగ
అంగజకోటి సమాంగ రంగ
విమలకీర్తితరంగ విహగరాజతురంగ
మకుటసంఘటితోత్తమాంగ రంగ!

గీ. చిరతరామ్నాయ పర్వత శృంగరంగ
పరమకారుణ్య రసమయాపాంగ రంగ
రక్షితానూన భద్ర సారంగ రంగ
భూరి నిగమాంతరంగ! కస్తూరిరంగ!

"కలగంటి నంతట మేలుకొంటి"

సీ. పానుపు పెనుబాము పడగలు నిగిడించి
చల్లనిగాడ్పులచవులుగ్రోల
కౌస్తుభరోచులు కల్లోలపరిధూత
విద్రుమలతలతో వియ్యమంద
కదలుచున్నప్పుడు కనువిచ్చి చనువిచ్చి
యిందిర తనవక్షమందు నొదుఁగ
నాభిపద్మములోనినలువ యొక్కొకమాఱు
జలపక్షిరవముల కులికిపడఁగ

గీ. కన్ను మోడ్చినయపుడ పాల్కడలిలోన
నుల్లమున లోకములఁ జూచుచున్న వాని
వారిజోదరు నీరజచారునయను
మొలఁత కలఁగంటి నంతట మేలుకొంటి.

సీ. తనకు ఫణావళి తలయంపిగాఁ జేసి
పాన్పైనవాఁ డొక్కఁ బాఁపఱేఁడు
తననాభిఁ బూచినతామరఁ జదువులు
చదివెడునొకముది చదువువాఁడు
తనవక్షమున మనోజయంబునఁ (?) గ్రాలెడు
పుణ్యంపుఁ జూడ్కులపువ్వుఁ బోణి
తనమ్రోలమత్స్యావతారాదిలీలలు
తగిలిపాడెడు నొక్కఁ దండె తపసి
గీ. సకలవేదాంతములుఁ దనజాడ వెదక
నుదధి పెన్నిఁటిపైఁ దేలుచున్నవాని
మేఘసంకాశరుచిగలమేనివాని
మొలఁత కలఁగంటి నంతట మేలుకొంటి.

సీ. కాటుకకొండపైఁ గాయు రేయెండకుఁ
జెలువైన పచ్చనివలువవాని
గగనోదరంబున నెగడుచందురునకుఁ
గవయైననాభిపంకజమువాని
పొడుపుగుబ్బలిమీఁది ప్రొద్దుచందంబున
బొడవైనరత్నంపుఁ దొడవువాని
తరఁగలఁదోతెంచు నురుగులకాంతికి
గరుసైనధవళశంఖంబువాని
గీ. తెల్లదామరవిరిమీఁదఁ దేఁటివోలెఁ
బాలమున్నీటిలోపలఁ బవ్వళించి
యోగనిద్రావిలోలుఁడై యున్నవాని
మొలఁత కలఁగంటి సంతట మేలుకొంటి.

సీ. శ్రీరామచంద్రుచేఁ జెలఁగి పూజలుగొన్న
పరమేశుఁ డారంగపతి యితండు
ఏడుకోటలలోన వేడుక విహరించు
కపటనాటకుఁడైన ఘనుఁ డితండు
బ్రహ్మరుద్రామర ప్రముఖులకెల్లను
నాదిమూలంబైన యతఁ డితండు
వైనతేయుని నెక్కి వరుసదానవకోటిఁ
బరిమార్చు శ్రీజగత్పతి యితండు

గీ. విశ్వరూపంబు చూపిన వేల్పితండు
విశ్వ ముదరంబునం గలవిభుఁ డితండు
అట్టి శ్రీరంగశాయి నాయాత్మయందు
మెలఁత కలఁగంటి నంతట మేలుకొంటి.

సీ. మున్నీఁటితరగలు మోచినచాడ్పునఁ
బులకాంకురంబులు మొలకలెత్త
ప్రిదిలినకౌఁగిలి బిగియించు సిరిచేతి
కంకణఝుణఝుణాత్కార మెసఁగ
జలజాసనుఁడు లోనమెలఁగెడుపొక్కిలి
తమ్మిపైఁ దేంట్లు ఝంఝుమ్మ రనఁగ
గంధర్వగానంబు కన్నులఁ జిలికినఁ
బర్యంకనాగంబు పడగలెత్త

గీ. అల్ల నరకన్నువిచ్చి యింద్రాదిసురుల
విన్నపము లాలి నాలించుచున్నవాని
వెడఁదకన్నుల నల్లనిమోడలివాని
మెలఁత కలఁగంటి నంతట మేలుకొంటి.

సీ. శ్రీకరరత్నశింజితనూపురస్ఫుర
త్పాదపద్మంబులు పరగువాని
కాంచీకలాపసంఘటితదుకూలంబు
కాంచనచేలంబు గలుగువాని
గ్రైవేయకంబులు కమనీయహారముల్
కంకణాంగదములు గలుగువాని
మకరకుండలరత్నమహనీయమకుట స
న్మందహాసవిలాసమహిమవాని

గీ. భరతలక్ష్మణశత్రుఘ్నపవనసుతులు
గొలువ జానకితోఁ గూడి కొమరుమిగుల
నట్టియాయోధ్యరాము నే నాత్మలోన
మెలఁత కలఁగంటి నంతట మేలుకొంటి.

సీ. ఇంద్రనీలసమూహసాంద్రఘనాఘనో
జ్జ్వలమైనదేహంబు గలుగువాని
సత్యప్రధానమౌ సాధుభావంబున
సజ్జనరక్షణ సలుపువాని
మేరుమహీధరభూరిధైర్యంబున
నబ్ధిగభీరత నలరువాని

గీ. భరతలక్ష్మణశత్రుఘ్నపవనసుతులు
గొలువ జానకితోఁగూడి కొమరుమిగుల
నట్టియాయోధ్యరాము నే నాత్మలోన
మెలఁత కలఁగంటి నంతట మేలుకొంటి.

సీ. శతకోటికందర్పసమజగన్మోహన
  భూరిసౌందర్యవిస్ఫూర్తివాని
త్రిభువనకోదండదీక్షాగురుం డన
  బిరుదువిఖ్యాతిఁ బెంపెసఁగువాని
చండభండనధరాస్థలి దివ్యమేఘంబు
  వలె శరలాఘవం బలరువాని
సింధుబంధురగర్వసింధురక్రమకళా
  సింహవిక్రమకేళిఁ జెలఁగువాని
గీ. భరతలక్ష్మణశత్రుఘ్న పవనసుతులు
కొలువఁ బేరోలగంబునఁ జెలువ మలరు
నట్టి పట్టాభిరాము నే నాత్మలోన
మెలఁత కలఁగంటి నంతట మేలుకొంటి.

సీ. ఆలోలకల్లోల మగుమాలికానలి
  విలసితం బగుపాలవెల్లిఁ గంటి
నందు రత్నాంకితం బౌపెక్కుపడగలఁ
  బ్రజ్వరిల్లెడు పెనుఁబాముఁ గంటి
దానిపై సుఖలీలఁ దగిలి నిద్రించెడు
  పరమాత్ము నొకదివ్యపురుషుఁ గంటి
నాభవ్యు నురమున ననిశంబు రత్నంపుఁ
  బ్రతిమఁ బోలెడు దివ్యభామఁ గంటి
ఆ. వె. నాలతాంగిమేని యందొక్కకళయు నా
సొబగువక్త్రమందుఁ జొరఁగఁ గంటి
నంతఁ బుణ్యపాఠకాకీర్ణనాదస
మ్మిళితవిహగరుతుల మేలుకొంటి.

సీ. నీలమేఘచ్ఛాయ నెగడెడుతిరుమేన
 మెండుగాఁ గస్తురి మెత్తినాఁడు
ధగధగద్ధగఁయనుతళుకుబిళ్లయు లెస్స
 కటితటి దిండుగాఁ గట్టినాఁడు
కోటిసూర్యులకాంతి కుదురైనరత్నంబు
 ఘనకిరీటము తలఁ గలిగినాఁడు
కలుముల నీనెడుకాంతిచే నొఱపైన
 యురమునఁ గౌస్తుభ మూనినాఁడు

గీ. విరజ కావేరి మధ్యను వెలసినాఁడు
ఎలమి భక్తులకోర్కెల నిచ్చినాఁడు
అట్టి శ్రీరంగశాయి నే నాత్మలోన
మెలఁత కలఁగంటి నంతట మేలుకొంటి.

ఆర్తజన రక్షణోపాయ! యాంజనేయ!

సీ. శరధి లంఘించి దాశరథి యిచ్చినభూష
 ణము సీత కొసఁగిననాఁటిరూపు
లంకారమాముఖాలంకార మాగ్రహో
 న్నతి నీఱుచేసిననాఁటిరూపు
నీవాలమునఁ జుట్టి నీ వాలమున దైత్య
 నాథులఁ బొరిగొన్న నాటిరూపు
మరుదీశసుతుఁడ నా మరుదీశసుతుకేత
 నంబెక్కి కోడైననాఁటిరూపు

గీ. తలఁచువారికి నాపదల్ తలఁగు టరుదె
నీకృపాస్ఫూర్తి నీకీర్తి నిస్సమములు
మహితశ్రీరామపదభక్తిమద్విధేయ
ఆర్తజనరక్షణోపాయ! ఆంజనేయ!

సీ. శ్రీరాము నాత్మలోఁ జేర్చుకొన్న మహాత్మ!
చిత్తంబులోన వసింపు మయ్య
కడులావుమైఁ జౌటికడలి దాటినధీర
కడలేనిభవవార్ధిఁ గడపు మయ్య
ధవునినేమంబు సీతకు నొసంగినమేటి
పరిణామ మొసగి చేపట్టు మయ్య
ధట్టించి మందులగట్టుఁ దెచ్చినదేవ
జీవనౌషధ మిచ్చి ప్రోవు మయ్య
గీ. హనుమ నీవు సమర్థుడ వయ్య యిపుడు
నింత నన్ను నుపేక్ష సేయింపఁదగునె—మహిత.

సీ. లవణవారాశి కోలకుఁ దెచ్చె నీరాజు
నగుచు నంబుధి దాఁటినాఁడ వీవు
రాతి నాతిగఁ జేసి రక్షించె నీరాజు
మకరి నంగనఁ జేసి మంచి తీవు
మాయలమారీచు మడియించె నీరాజు
చెడుకాలనేమి నుక్కడఁచి తీవు
లంకేశుఁ ద్రుంచె నాలములోన నీరాజు
వెస లంక నీఱుగావించి తీవు
గీ. ఆశ్రితావనుఁ డగురాము నంతరాజు
పతిహితుం డగు నీవంటిబంటు గలఁడె—మహిత.

సీ. పుట్టినాఁ డితఁడు శంభునియమోఘం బైన
శక్తిచేఁ బార్వతీజఠరమునను
పట్టినాఁ డితఁడు చేపట్టుఁగొమ్మగఁ బంటి
చవిఁ జిన్ననాఁడె హస్తముల రవిని
కొట్టినాఁ డితఁడు గగ్గోలుగా లంకలో
వెన్నాడి యక్షాదివీరవరుల
చుట్టినాఁ డితఁ డాజిఁ బెట్టని కోటగా
వాలంబు కపిసేన వలగొనంగ

గీ. ఇతఁడు దైవంబు పటుతేజుఁ డితఁడు సరస
బాహుబలవంతుఁ డితఁడు నాఁ బరగి తౌర—మహిత.

సీ. రాలవే యుడులు ప్రేలాలపోలిక నీవు
వాల మల్లార్చిన వానరేంద్ర!
తూలవే గిరులు బంతులతెఱంగున నీవు
హస్తముల్ సాచిన నలఘుతేజ!
పగులదే మి న్నంటిపంటికై వడి నీవు
పెళపెళ నార్చిన భీతిరహిత!
తిరుగదే ధరణి కుమ్మరిసారెవలె నీవు
కుప్పించి యెగసినఁ గులిశదేహ!

గీ. దేవదానవమానవాధిపులలోన
నిన్ను వర్ణింపఁ దరమె నిర్నిద్రశౌర్య!—మహిత.

సీ. స్తంభసంభూతావసరఘోరతరనర
పంచాస్యకహకహార్భటులఁ దెగడి
శాకినీడాకినీసంతతప్రళయకాల
భైరవకిలకిలార్భటులఁ దెగడి
సంవర్తసమయప్రచండ దండధరారి
భర్గకోలాహలార్భటులఁ దెగడి
దక్షాధ్వరధ్వంసకాక్షుద్రబలవీర
భద్రహూహూక్రియార్భటులఁ దెగడి

గీ. పొలుచు భవదట్టహాసంబు చెలఁగఁ బంక్తి
ముఖుని రొమ్ము పగుల్పవే ముష్టిహతిని—మహిత.

సీ. నిడుదవాలంబుతో నిలువునామంబుతో
నిగనిగమెఱయు నెమ్మొగముతోడ
సహజవర్ణంబుతో సవరనిమూంజితో
సలిలపూరితకమండలముతోడ
పసిఁడియందియలతోఁ బట్టుజన్నిదముతోఁ
బాటలలోచనాబ్జములతోడ
కరములమోడ్పుతోఁ గటిహేమపటముతోఁ
గమనీయకుండలకాంతితోడ

గీ. కరుణగలమూర్తితోడ సాక్షాత్కరించి
నిండువేడుక నామది నుండు మెపుడు
మహితశ్రీరామపదభక్తిమద్విధేయ
ఆర్తజనరక్షణోపాయ! ఆంజనేయ!

ధరణి.

సీ. కుహనాకిటేంద్రునికోఱ సోఁకినభామ
కలిమిచూపులసింధుకన్యసవతి
అంభోజవర్ణున కైనశృంగారిణి
తాలిమికెల్లను దానకంబు
గజకుంభములమీఁదఁ గాపున్న దేవత
రాజశేఖరుమనోరథము రథము
పెనువేల్పుఁ గోర్కులఁ బిదికెడిధేనువు
మెట్టపట్టులకును బుట్టినిల్లు

గీ. హరునియష్టాంగములకును నాదివేల్పు
కడఁగి రత్నాదివస్తువుల్ గలుగుపెట్టె
యల్లవలయాద్రిక్రిందటి యంటుబిళ్ల
భవ్యగంధాదిగుణముల భరణి ధరణి.

(నయనరగడ)

శ్రీపార్వతీశుఁ జూడక
పాపాత్ముఁడ నగుచుఁ బోవఁ బథమునఁ జతురుల్
దీపించు దృష్టి తొలఁగిన
శ్రీపతి నడుగంగఁ గర్త శివుఁడని చెప్పెఁ.
శ్రీశైలవల్లభుని శిఖరంబుఁ బొడగంటి
కాశీపురాధీశు గౌరీశుఁ బొడగంటి
సర్వలోకేశ్వరుని సర్వేశుఁ బొడగంటి
సర్వసంరక్షకుని సర్వంబుఁ బొడగంటి
పరమాత్ము నీశానుఁ బరమేశుఁ బొడగంటి।
పరమ యోగీంద్ర హృత్పదనిలయుఁ బొడగంటి

చంద్రార్క శతకోటి సంకాశుఁ బొడగంటి
చంద్రార్క శిఖనేత్రు శంకరునిఁ బొడగంటి
రూపింపఁ బ్రకటస్వరూపంబుఁ బొడగంటి
నాపరంజ్యోతియై యమరు దేవునిఁ గంటి
వేదంబు లీశ్వరుని వినుతింపఁ బొడగంటి
నాది దేవుఁడు రుద్రుఁడని శ్రుతులఁ బొడగంటి
శ్రుతి 'యేక ఏవ రుద్రో' యనఁగఁ బొడగంటి
శ్రుతి 'పరంబ్రహ్మ' మని శూలిఁబల్కుటఁగంటి
ముక్కంటికై శ్రుతుల్ మ్రొక్కఁగాఁ బొడగంటి
ముక్కంటిలీలచే మ్రోయుచుండఁగఁ గంటి
భర్గుఁడే తత్పరాత్పరుఁడనఁగఁ బొడగంటి
భర్గుఁ డర్కునిలోనఁ బ్రభ వెలుంగుటఁగంటి
బ్రహ్మాండములకోట్లు భర్గులోఁ బొడగంటి
బ్రహ్మాండమాలికా భరణభూషితుఁ గంటి
విశ్వరూపంబైన విశ్వేశుఁ బొడగంటి
విశ్వచక్షుని విశ్వవేద్యు నభవునిఁ గంటి
మూఁడు మూర్తుల కాదిమూర్తి దేవునిఁగంటి
మూఁడు మూర్తులలోన ముక్కంటిఁ బొడగంటి
నష్టమూర్తుల కీర్తు లమరంగఁ బొడగంటి
నిష్టభోగములెల్ల నిచ్చు వేల్పని కంటి
నజ్ఞానతిమిరసంహారసూర్యునిఁ గంటి
సుజ్ఞాన సంశీల సులభ మోక్షముఁ గంటి
నక్షరత్రయరూప మక్షయునిఁ బొడగంటి
దక్షాధ్వరధ్వంసధన్యవేషునిఁ గంటి
విమలాత్ము నాద్యంత విరహితునిఁ బొడగంటి

గమలలోచన నయనకమల పూజితుఁ గంటి
వృషభేంద్రవాహనుని విషకంఠుఁ బొడగంటి
వృషభధ్వజుండైన వేదవేద్యునిఁ గంటి
ధవళసంకాశంబు దశబాహుఁ బొడగంటి
భవదుఃఖ సంహారుఁ బంచవదనునిఁ గంటి
పురవైరి నంధకాసురవైరిఁ బొడగంటి
కరివైరిఁ గంకాళకరధాముఁ బొడగంటిఁ
గారుణ్య సాగరునిఁ గల్యాణుఁ బొడగంటి
నారాయణప్రియుని నాగకంకణుఁ గంటి
మహినొప్పు శ్రీశైల మహిమ నేఁ బొడగంటి
బహువేదశాస్త్రముల్ ప్రణుతి సేయుటఁగంటి
భూలోకకైలాస పుర మనఁగఁ బొడగంటి
ఫాలాక్షుఁడచ్చోటఁ బాయకుండుటఁగంటి
ధృతిఁ దూర్పు మొగసాల త్రిపురాంతకముఁ గంటి
సతులజ్యోతిర్లింగ మట యామ్యమునఁ గంటి
బలు పశ్చిమద్వార బ్రహ్మేశ్వరముఁ గంటి
జెలువొందు నుత్తర శ్రీమహేశ్వరుఁ గంటి
క్షితి లక్షకోట్లకును శివతీర్థములు గంటి
చతురొప్పఁ బదికోట్ల శక్తిరూపులఁ గంటి
దివ్యస్థలంబులను దివ్యులను బొడగంటి
దివ్యయోగీంద్రులను దివ్యమహిమలఁ గంటి
రంగొందు పాతాళగంగ నేఁ బొడగంటి
గంగపాతాళంబు గంగఁ గలియుటఁ గంటి
గంగలోఁ ద్రిదశగముల్ గదలకుండుటఁ గంటి
గంగలో సురమునులు గదలకుండుటఁ గంటి

బుణ్య కుండము లెల్లఁ బొలుపారు నని కంటిఁ
బుణ్యజలములతోడఁ బొసఁగ. ధారలు గంటి
సరి నొప్పు బంగారు శైలంబుఁ బొడగంటిఁ
బరికింప నవరత్న పర్వతంబులు గంటి
నెనసి యోగస్థలము లెల్లచోఁ బొడగంటి
ఘనబిలంబులు గుహలు గహ్వరంబులు గంటి
కామరూపుల గిరులఁ గణఁకతోఁ బొడగంటి
కామరూపుల నున్న కల్పతరువులఁ గంటిఁ
జరపర్వతంబులును జరవృక్షములు గంటి
ధరణిఁ బ్రొద్దోకచాయ తరులు గిరులును గంటి
గిరులు నీడలులేక క్రిక్కిఱియఁ బొడగంటి
తరులు నీడలులేక తనరుచుండుటఁ గంటి
నీడ దిరుగని శైలనికరంబుఁ బొడగంటి
వృక్షమొక్కటి సర్వ వృక్ష ఫలములు గంటి
వృక్షమొక్కటి సర్వ వృక్షజాతులు గంటి
నగపక్షి మృగతరులు నాట్యమాడుటఁ గంటి
నగపక్షి మృగతరులు నాథుఁ గొల్చుటఁ గంటి
నరసురాసురు లుమానాథుఁ గొల్చుటఁ గంటి
హరివిధీంద్రాదు లట నభవుఁ గొల్చుటఁ గంటి
రుద్రుఁ గొల్చినపెక్కు రుద్రులను బొడగంటి
రుద్రగణముల వివిధరూపధారులఁ గంటి
రూఢి తపములు సేయు ఋషులనేఁ బొడగంటి
కూడి మ్రోసెడు వేదఘోషంబుఁ బొడగంటి
సురదుందుభుల మ్రోఁత సొంపారఁ బొడగంటి
సురసతులు నాట్యంబు సొరిది నాడుటఁ గంటి

నాంగికమ్ముగ నాడు భృంగీశుఁ బొడగంటి
సంగీతనాదములు సకలదిక్కులఁ గంటిఁ
బరగ శ్రీశైలంబు భావమునఁ బొడగంటి
దురితంబు లన్నియును దొలఁగి పోవుటఁ గంటి
శ్రీపర్వతేంద్రంబు శిఖరంబుఁ బొడగంటి
శ్రీపార్వతీనాథుఁ జేరికొల్చుటఁ గంటి
నాదివ్యలింగంబు నర్చింపఁ బొడగంటి
మోదమున సాయుజ్య ముక్తి నీయఁగఁ గంటిఁ
బర్వతలింగంబుఁ బ్రాణేశుఁ డని కంటిఁ
బర్వతేశ్వరుహృదయ పద్మనిలయునిఁ గంటి
శ్రీకంఠు శ్రుతివచ శ్శితికంఠుఁ బొడగంటి
లోకేశు నిజభక్త లోకేశుఁ బొడగంటి
నజు నజరు నమరు నవ్యయు నీశుఁ బొడగంటి
గజకృత్తిధరు దయాకరు జగద్గురుఁ గంటిఁ
గ్రతువైరిఁ బురవైరిఁ గామారిఁ బొడగంటిఁ
బతి నుమాపతి నాదిపతి లోకపతిఁ గంటిఁ
బతి సర్వపతి దేవపతి యీశుఁ డని కంటిఁ
బతిభక్తులకు నాదిపతి శంభుఁడని కంటి
నతికాముఁ బ్రతికాము ననిలోముఁ బొడగంటి
నతిశుద్ధు నతిబుద్ధు నతిబొద్ధుఁ బొడగంటి
శివకథామర్మములు శివధర్మములు గంటి
శివమూల మంత్రములు శివతంత్రములు గంటి
తారకబ్రహ్మంబు తత్త్వంబుఁ బొడగంటి
హారకర్పూర నీహారాద్రి నిభుఁ గంటి
నిర్వాణ నిస్సీమ నిష్పాపరుచిఁ గంటి

దుర్వార దుస్పార దుర్భేదహరుఁ గంటి
ప్రణవాది మంత్రప్రపంచంబుఁ బొడగంటి
నణిమాది గుణదూర మగువీథిఁ బొడగంటి
షట్తర్క షట్కర్మ షట్చక్ర గతిఁ గంటి
షట్త్రింశ దుత్తర స్థలలక్షణముఁ గంటి
అక్షరత్రయరూప మగునబ్ధిఁ బొడగంటి
నక్షరాంబుధిలోన నమృతంబుఁ బొడగంటి
నక్షరగ్రామంబు లందైదు పొడగంటి
నక్షరపు లక్షణము లన్నియును బొడగంటి
నమితశబ్దబ్రహ్మమంతయును బొడగంటి
విమలశబ్దబ్రహ్మ విభవ మేర్పడఁగంటి
చొర నవసరములేక శ్రుతు లున్కిఁ బొడగంటి
హరతత్త్వ నిరతులై యతు లున్కిఁ బొడగంటిఁ
గర్మంబు లందు దగ్గఱరామిఁ బొడగంటి
ధర్మముల్ తమత్రోవ తలపింపఁ బొడగంటి
శివభక్తి సంసార సీమదాఁటుటఁ గంటి
నవివేకులకు భక్తి యలవికా దని కంటి
నొగి నభవులో లోక ముదయింపఁ బొడగంటి
నగణిత క్రమమైన మది దైవమని కంటి
నిరవొప్ప హరతత్త్వమే యంద మని కంటి
హరతత్త్వ మక్షీణ మానంద మని కంటి
రుసులెల్ల శైవస్వరూపులని పొడగంటి
విస మమృతమును జేయు విమలచిత్తులఁ గంటి
బసవన్న నన్నేలుభర్తగాఁ బొడగంటి
బసవన్న మాపాలిపరమేశుఁ డని కంటి

బసవాక్షరత్రయము పావనం బని కంటి
బసవన్న భక్తులకుఁ బరుసవే దని కంటి
బసవా యనినఁ బాయుఁ బాపంబు లని కంటి
బసవా యనిన మోక్షపద మబ్బునని కంటి
కడఁగి కన్నపఁ డీశుఁ గాలఁ దన్నుటఁ గంటి
జడలతో గండూషజలము లుమియుటఁ గంటి
మిఱుమిండఁ డెంతయును మేటియని పొడగంటి
గఱకంఠుపైఁ గినిసి గంటివేయుట గంటి
ధరణి వేశ్యయు నంబి తర్కింపఁ బొడగంటి
నిరువురకుఁ బరమేశుఁ డెదుర నిల్చుటఁ గంటి
గొడుకుఁ జంపినఁ గాని కుడువ నను పతిఁ గంటి
నెదరు దిరిగిన కంచి యేడు వాడలు గంటిఁ
గొడుకుతోడనె కూడి కొని పోవఁ బొడగంటి
భల్లాణుపత్నిఁ దాపసుఁడు వేఁడుటఁ గంటి
నిల్లాలి భల్లాణుఁ డిచ్చి మ్రొక్కుటఁ గంటి
గఱకంఠునకు నక్కగారు దక్కుటఁ గంటి
నెఱుకమై శ్రీశైల మెక్కుడిగ్గమిఁ గంటి
మతిమంతు మడివాలు మాచధీమణిఁ గంటిఁ
జతురుఁడై యేనుఁగును జావ నుదుకుటఁ గంటి
భక్తు లప్రతిహత ప్రథిత మతులని కంటి
భక్తులకుఁ బ్రత్యర్థిపరులు లేరని కంటి
భక్తులకు నెందు నాపదలు లేవని కంటి।
భక్తు లాపదలచేఁ బట్టువడ రని కంటి
భక్తు లహికేయూర పద బద్ధు లని కంటి
భక్తు లతి నిర్వాణ పదసిద్ధులని కంటి

భక్తులు జగత్ప్రాణ పదలోలు రని కంటి
భక్తులు సదానంద పదశీలు రని కంటి
భక్త లేపదవులును బడయ నొల్లమిఁ గంటి
భక్తులకు నేరుచుల్ భక్తిఁ బోలమిఁ గంటి
భక్త లద్భుతకర్మ పారీణు లని కంటి
భక్త లద్భుత పుణ్యఫలభాగులని కంటి
భక్తుల కుమాభర్త ప్రాణంబులని కంటి
భక్త లుద్భట దోషభవ ముక్త లని కంటి
భక్త లసదృశభోగ భాగ్యాఢ్యు లని కంటి
భక్త లిహపరభోగ భాగ్యాఢ్యు లని కంటి
శివభక్త లతుల శ్రీకరము లని కంటి
శివభక్త లాచారశేఖరము లని కంటి
శివభక్తి దూషకులు చిరపాపు లని కంటి
శివభక్తి దూషకులు చెడిపోదు రని కంటి
శివభక్తి కల్యాణసీమ దాఁటుట గంటి
శివభక్తి యభిమత స్థితికర్త యని కంటి
శివభక్తి శత్రులకు శివము లేదని కంటి
శివభక్తి మిత్రులకు శివసౌఖ్య మని కంటి
నిశ్చలము భక్తులకు నెఱయఁ జేకుఱఁ గంటి
దుశ్చరిత భక్తులకుఁ దొలఁగించు నని కంటి
త్రిభువనము భక్తులకుఁ దృణకణము లని కంటి
సభలందు భక్తులకు జయవాద మని కంటి
భక్తి యేవేదములు పడయులే వని కంటి
భక్తి యేవాదముల్ పడయులే వని కంటి
భక్తి యింద్రాదులును బడయలేరని కంటి

భక్తి సూర్యాదులును బడయలేరని కంటి
భక్తి బ్రహ్మాదులును బడయలేరని కంటి
భక్తి విష్ణ్వాదులును బడయ లేరని కంటి
భక్తి సత్యముచేతఁ బ్రభవించు నని కంటి
భక్తిరుచి సద్గుణప్రారంభ మని కంటి
భక్తి గురుకారుణ్య ఫలమూల మని కంటి
భక్తి చాతుర్వర్గ ఫలదాయి యని కంటి
భస్మధారికిఁగాని భక్తి లే దని కంటి
భస్మంబు భక్తియును పావనం బని కంటి
భస్మ ముత్తమలోక పాథేయ మని కంటి
భస్మ త్రిపుండ్రంబు పరమార్థ మని కంటి
భస్మంబు శ్రుతులెల్లఁ బాటించు నని కంటి
భస్మంబు యోగసంపద మూల మని కంటి
భస్మంబు సర్వసంపత్కరం బని కంటి
భస్మంబు శివయోగ ఫలవృక్ష మని కంటి
భస్మ మిహపరములకుఁ బట్టుఁగొమ్మని కంటి
భస్మంబు మాపాలి పరమేశుఁ డని కంటి
భస్మంబు త్రైలోక్య పావనం బని కంటి
భస్మంబు కర్మాబ్ధిబాడబం బని కంటి
భస్మంబు ఋషులెల్ల భక్తిఁదాల్చుటఁ గంటి
భస్మంబు హార్యజులు భక్తిఁదాల్చుటఁ గంటి
రుద్రాక్ష రుద్రనేత్రోద్భవం బని కంటి
రుద్రాక్ష రుద్రస్వరూప మని పొడగంటి
రుద్రాక్ష వేదముల రూపు బల్కుటఁ గంటి
రుద్రాక్ష బ్రహ్మాది ఋషులు గట్టుటఁగంటి

రుద్రాక్ష భవగజముద్రుంచునని పొడగంటి
రుద్రాక్ష పాపములు రోలఁ ద్రోలుటఁ గంటి
రుద్రాక్ష పుణ్యములు రొక్క మిచ్చుటఁ గంటి
రుద్రాక్ష జపమునకు రుద్రుఁ డౌనని కంటి
రుద్రాక్ష ధరుఁడు శ్రీరుద్రుఁ డౌనని కంటి
రుద్రాక్ష ఫలమహిమ రుద్రుఁ డిచ్చుట గంటి
సకల నిష్కళమంత్ర సంబంధ మని కంటి
నకలంక మగుమంత్ర మపవర్గ మని కంటి
పాదతీర్థముఁ ద్రావఁ బాపహర మని కంటి
బాదతీర్థముఁ ద్రావ ఫల మెక్కుడని కంటి
బాదతీర్థము వేదభక్తిరస మని కంటిఁ
బాదతీర్థము తీర్థ ఫలసార మని కంటిఁ
బాదతీర్థముఁ ద్రావ భవహరంబని కంటి
ధరఁ బ్రసాదస్థలము తలఁపలేనని కంటి
సరిఁ బ్రసాదస్థలము చవి మెఱుంగుటఁ గంటి
నెలకొని ప్రసాదంబు నిలుప రాదని కంటి
మలసి ప్రసాదంబు మలహరం బని కంటి
గొనకొని ప్రసాదంబు కుడువవలె నని కంటి
పనిగొని ప్రసాదంబు భవహరంబని కంటిఁ
గుమతి ప్రసాదంబు కుడువరా దని కంటి
విమల ప్రసాదంబు విడువరా దని కంటిఁ
దెలియరు ప్రసాదంబు తెలఁగజ్ఞులని కంటి
మలదేహికిఁ బ్రసాద మలవి కాదని కంటి
మునుకొని ప్రసాదంబు ముట్టరా దని కంటి
దనియరు ప్రసాదంబు తత్త్వజ్ఞు లని కంటి

నెనయ రుచు లీశునకు నీవలయు నని కంటి
గొనకొనక నిల్చి మతి కొనవలయు నని కంటి
ననుదినము నర్పించు నాతఁ డతఁ డని కంటిఁ
బెనఁగి ప్రసాదంబుఁ బెట్టరా దని కంటి
భర్గోపకృతులు సద్భక్తులని పొడగంటి
స్వర్గాది భోగముల్ సరకుగా వని కంటిఁ
గలదు లే దనరాదు కైవల్యమని కంటిఁ
గలదన్న చోటనే కలఁ డీశుఁ డని కంటి
తత్త్వంబు లారు ద్రుఁ దడవలే వని కంటి
సత్త్వాది గుణకోటి సంఖ్య కేమని కంటి
నఖిలేశునకు నాది యరయరా దని కంటి
నఖిలైక్యునకు నంత్య మరయరాదని కంటి
నఖిలేశునకు నెక్కు డరయలే దని కంటి
నఖిలాండనాయకుం డాదియని పొడగంటి
నఖిలంబుఁ బుట్టించు నభవుఁ డని పొడగంటి
నఖిలంబు హరునందు నణఁగునని పొడగంటి
సంసార హరమైన సర్వేశుఁ బొడగంటి
హింసకులు వడయలే రిహపరము లని కంటి
సచరాచరానేక జగదుద్భవముఁ గంటి
నచరంబున జగమ్ములన్నియును బొడగంటి
నా దహంకారమమకారంబుఁ బొడగంటి
లే దితర పరతత్త్వ లేశంబుఁ బొడగంటి
నత్యద్భుతాకార మాకార మని కంటి
ప్రత్యక్ష మానంద పాకంబుఁ బొడగంటిఁ
బుణ్యపాపము లీశుఁ బొంద నేరమిఁ గంటి

గణ్యముల్ శ్రుతు లీశుఁ గానఁనేరమిఁ గంటి
వేదము లుమానాథు వెదకి కానమిఁ గంటి
నాదిదేవుఁడు శంభుఁడని శ్రుతులఁ బొడగంటి
బంచవింశతిమీఁదఁ బతి రుద్రుఁడని కంటిఁ
బంచాశదక్షర ప్రభవంబుఁ బొడగంటి
నీలోకనిర్వాహ మీశానుఁ డని కంటి
నీలోకసన్నాహ మీశానుఁ డని కంటి
నీలోకనిస్తార మీశానుఁ డని కంటి
నీలోకనిర్వాణ మీశానుఁ డని కంటి
బ్రహ్మాది సురలెల్లఁ బశువు లని పొడగంటి
బ్రహ్మ విష్ణ్వాదులకుఁ బతి రుద్రుఁ డని కంటి
బ్రహ్మ విష్ణువుల కౌ వాదంబుఁ బొడగంటి
బ్రహ్మపద మిద్ధఱును బడసి కానమిఁ గంటి
నంత లోకప్రభువు నరచేతిలోఁ గంటి
జింతించు భక్తులకు శివుఁడు లోనని కంటి
శివభక్తి తుదముట్టఁ జేరఁగాదని కంటి
శివభక్తి తుదిముట్టఁ జేరలేనని కంటి
శివభక్తి శ్రుతుల కాశ్రితమగుట పొడగంటి
శివభక్తి నతుల కాశీర్వాదమని కంటి
నాసనన్యాస కరణాతీతుఁ బొడగంటి
దాసోహ మనుత్రోవ తలనున్న శివుఁ గంటి
ద్రోహు లద్వైతులకుఁ దొలఁగి పోవుటఁ గంటి
దేహదోషాతీత దివ్యభోగముఁ గంటి
సుఖదుఃఖములు శివుని సోఁకనేరమిఁ గంటి
నఖిలబీజములు సోమాదిత్యులని కంటి

నా రెండు వెలుఁగులే హరుకన్ను లని కంటి
గౌరీశుఁడే సర్వకర్త యనఁగాఁ గంటి
గారుణ్యమున శివుఁడు కనుపించె నని కంటి
కఱకుమాటల భక్తిగలుగ నేరమిఁ గంటి
నెఱుఁగరా దెవ్వరికి నీశాను నని కంటి
మనదధీచుని దక్షు మఖమునను బొడగంటిఁ
బెనుపొంద శ్రుతుల శాపించి విడుచుటఁ గంటిఁ
బరగ శివమంత్రంబు ప్రబలిపొందుటఁ గంటిఁ
బరికింప శివభక్తి పదమెక్కు డని కంటి
శరధిఁ దరువఁగ సద్విషాగ్ని పొంగుటఁ గంటి
సురలెల్ల గరళంబుఁ జూచి పాఱుటఁ గంటి
గరళ మవ్వాడు లోకకర్త మ్రింగుటఁ గంటి
గరకంఠనామంబు గణుతి కెక్కఁగఁ గంటి
క్షేమదస్ఫుట సౌఖ్యఖేటంబుఁ బొడగంటి
సోమ ఖండాఖండ జూటంబుఁ బొడగంటి
భరిత నయనాభీల ఫాలంబుఁబొడగంటి
సురచిర స్ఫుటజైత్ర శూలంబుఁ బొడగంటి
క్రతుహరుని శుద్ధ కంకాళంబుఁ బొడగంటి
జితగజాజిన మహాచేలంబుఁ బొడగంటి
గురుమౌళి సురసరిత్కూలంబుఁ బొడగంటి
గిరిసుతా తనుభాగకీలంబుఁ బొడగంటి
నతిసుందరాకార మాది వృషభునిఁ గంటి
రతిరాగ భస్మాంగరాగంబుఁ బొడగంటి
గురుకుచము కచము ననుకూలంబుఁ బొడగంటి
హరినేత్ర పూజితుని నాదిమూలముఁ గంటిఁ

బరికింప నాలోని పాపంబు కడ గంటి
నరసిపాపము నన్ను నంటరా దని కంటి
బహుపాపధరుఁ డేల భక్తుఁడౌనని కంటి
బహుపాపములు నన్నుఁ బట్టి విడుచుటఁ గంటి
నయముగా నయనములు నాకీయఁ బొడగంటి
భయభక్తి లీ భర్గు పాదములు పొడగంటి
నిది పుణ్య మనికంటి నిది గణ్యమని కంటి
నిది యోగ మనికంటి నిది భోగమని కంటి
నిది ధర్మ మనికంటి నిది మర్మ మని కంటి
నిది నిత్య మనికంటి నిది సత్య మని కంటి
నిది పుణ్యములకెల్ల నెక్కుడని పొడగంటి
నిది గణ్యముల కెల్ల నెక్కుడని పొడగంటి
నిది యోగముల కెల్ల నెక్కుడని పొడగంటి
నిది భోగములకెల్ల నెక్కుడని పొడగంటి
నిది ధర్మములకెల్ల నెక్కుడని పొడగంటి
నిది మర్మములకెల్ల నెక్కుడని పొడగంటి
నిది నిత్యములకెల్ల నెక్కుడని పొడగంటి
నిది సత్యముల కెల్ల నెక్కుడని పొడగంటిఁ
గణఁగి సంసారంబు కడగంటి నని కంటిఁ
గణఁగి శ్రీగిరి చెన్న కారుణ్య మని కంటి
ఘనుఁడు రంగన దూషకరగండఁ డని కంటి
జనకల్ప తరులలో జయశాలి యని కంటిఁ
దవిలి రంగనమంత్రి ధన్యకృతి యని కంటి
భువిలోనఁ బ్రోలాంబ పుణ్యవతి యని కంటి
నింక శ్రీగిరిఁ జేర నేఁ గందు నని కంటి

శంకరుని కృప వడయు సమయమిది యని కంటి
నీఁకను నాయెత్తు కృతు లిత్తు నని పొడగంటి
నీఁకఁగృతుల్ చెప్ప నాకేమి భయమని కంటి
వడిఁగృతుల్ నాయెత్తు వచ్చునని పొడగంటి
మృదుఁ డింక నాకృతుల్ మెచ్చునని పొడగంటిఁ
దనర శ్రీరంగకవి దాత యని పొడగంటి
భువిలోపలఁ బ్రసిద్ధ పుణ్యుఁ డనఁగాఁ గంటి
శివభక్తి దీపి కాశీతాంశువని కంటి
శ్రీగిరీశునకు నర్పింతు నని పొడగంటి
శ్రీగిరీశ్వరునికృప చెన్నలరు నని కంటి.



# *శివమంత్రవర్ణనము

(నమశ్శివాయ రగడ)

క॥ శ్రీకాము లతులకీర్తి
శ్రీకాము లుమాధినాథచిత్తానంద
శ్రీకాములు సద్భక్తిం
జేకొనుఁడు 'నమశ్శివాయ' చెప్పెద మీకున్.

నమశ్శివాయ

శ్రీగిరీశ వశ్యమంత్ర సేకరము నమశ్శివాయ
ఆగమోపదిష్ట విధి మహాకరము నమశ్శివాయ
పంచవర్ణ పంచరూప భాసురము నమశ్శివాయ

# దేవతాస్తుతి స్తబకము

అంచితానురక్త జిత గజాసురము నమశ్శివాయ తేది 27.6.56
సునిశితోపనిష దధీత సుస్వరము నమశ్శివాయ
కనదనూన భక్తిరస వికస్వరము నమశ్శివాయ
పారలౌకిక ప్రధాన భాషణము నమశ్శివాయ
భూరిపుణ్య హేతుభూత భూషణము నమశ్శివాయ
సతత జన్మ దాహ దగ్ధ చందనము నమశ్శివాయ
నత విశిష్ట భక్తబృంద నందనము నమశ్శివాయ
శ్రుతిశిర స్సహస్ర రత్న సుందరము నమశ్శివాయ
నుత కుతర్క శరధి మథన మందరము నమశ్శివాయ
దారువన మునీంద్ర ముఖ్యధర్మదము నమశ్శివాయ
దూర దూర హృత నికృష్ట దుర్మదము నమశ్శివాయ
తరుణ చంద్ర జూట దర్ప దర్పణము నమశ్శివాయ
హరణ భరణ శక్తి కృత సమర్పణము నమశ్శివాయ
పరమభక్త మహిత హిత విభావనము నమశ్శివాయ
చిరతర ప్రభావ భావజీవనము నమశ్శివాయ
వామదేవ తత్త్వ లేశ వాచకము నమశ్శివాయ
సోమపాన ఫల సహస్ర సూచకము నమశ్శివాయ
నరకహర విశిష్టమంత్ర నాయకము నమశ్శివాయ
ధరణిసుర సుధీ విధా విధాయకము నమశ్శివాయ
దారుణాధి జలధిమగ్న తారకము నమశ్శివాయ
కారణప్రధాన వస్తుకారకము నమశ్శివాయ
బాఢపాప ఘోరకృత్య పాచకము నమశ్శివాయ
మూఢ గూఢ మోహబంధ మోచకము నమశ్శివాయ
కర్మదోష హరవిచార కారణము నమశ్శివాయ
ధర్మ మర్మ మూలమంత్ర ధారణము నమశ్శివాయ

ప్రస్తవ ప్రశస్త భరణ పండితము నమశ్శివాయ
మస్తకాయమాన విభవమండితము నమశ్శివాయ
రక్త భక్త నిత్య సత్య రక్షణము నమశ్శివాయ
భక్తలోక హృదయశోక భక్షణము నమశ్శివాయ
భజనధన్య సుజన వజ్రపంజరము నమశ్శివాయ
కుజనదృష్టి దోషకంజ కుంజరము నమశ్శివాయ
సర్గదుష్ట దుష్టచిత్తశాసకము నమశ్శివాయ
భర్గరూప దుర్గలసదుపాసకము నమశ్శివాయ
పురభిదభిమతానురక్త పోషకము నమశ్శివాయ
సురభవన కళంకపంక శోషకము నమశ్శివాయ
పాశుపత పథ ప్రవృద్ధ పాలనము నమశ్శివాయ
క్లేశ పాశ వలన దళన ఖేలనము నమశ్శివాయ
యోగిహృదయ సదయ జల పయోధరము నమశ్శివాయ
భోగిభూష పక్షవిభవ భూధరము నమశ్శివాయ
దురితహాత నికృష్టదుష్ట దుర్భరము నమశ్శివాయ
నిరతిశయ దయాశమాది నిర్భరము నమశ్శివాయ
భవవిపినాపోక్ష దహన పాటవము నమశ్శివాయ
కవిముఖప్రసిద్ధ నియమ కాటవము నమశ్శివాయ
నికటపుణ్య తంత్రనిచయ నిశ్చయము నమశ్శివాయ
ప్రకటధీర భావభర తపశ్చయము నమశ్శివాయ
భూతనాథ చరణకమల పూజనము నమశ్శివాయ
ప్రాతప్రశస్త వస్తుభాజనము నమశ్శివాయ
శోషణాది శుద్ధకరణ శోధితము నమశ్శివాయ
పోషితాగమ ప్రమేయ బోధితము నమశ్శివాయ
ప్రసవశరవికార భావభంజనము నమశ్శివాయ

రసికభక్త రాజలోకరంజనము నమశ్శివాయ
కలుషగజనికాయ సింహగర్జనము నమశ్శివాయ
వలభిదాది చపలభజన వర్జనము నమశ్శివాయ
శరణగణ గణాధినాథ శాతనము నమశ్శివాయ
నరసురేశవినుతనత సనాతనము నమశ్శివాయ
ఘనఘనాఘుచండ విపినఖండనము నమశ్శివాయ
మననమథిత శివరహస్యమండనము నమశ్శివాయ
కుతలజాత భర్గరూపగురువనము నమశ్శివాయ
తతఫలప్రదాన కల్పతరువనము నమశ్శివాయ
మారమథన పరులలోని మంతనము నమశ్శివాయ
చేరి శివునిఁగొలుచువారి చింతనము నమశ్శివాయ
కలయ వెదకి శ్రుతులు దొలుతఁ గన్నయది నమశ్శివాయ
ఒలసి మంత్రకోటి గొలువ నున్నయది నమశ్శివాయ
నరకలోకవాసికైన నాకదము నమశ్శివాయ
విరసమతికి నైన నురువివేకదము నమశ్శివాయ
అల్పపుణ్యమతుల కెందు నందనిది నమశ్శివాయ
కల్పకోటిశతములందుఁ గందనిది నమశ్శివాయ
పురహరునకు మొదలఁ మొదలఁ బుట్టినది నమశ్శివాయ
పరమధర్మ నిరతు లర్థిఁ బట్టినది నమశ్శివాయ
శివుఁ డజాది సురలకెల్లఁ జెప్పినది నమశ్శివాయ
కవసి వాసవాది నతులఁ గప్పినది నమశ్శివాయ
దురితప్రరుఁడు దొడవుగాఁగఁ దొడిగెడిది నమశ్శివాయ
కరణదుఃఖ మలిన హేతులఁ గడిగెడిది నమశ్శివాయ
ఓరవోక సర్వసమితి నుండెడిది నమశ్శివాయ
పారిజాతఫల సమృద్ధిఁ బండెడిది నమశ్శివాయ

దురితవితతిఁ దూరుపాఱఁ దోలెడిది నమశ్శివాయ
వరము లోలి నిచ్చుచోట వ్రాలెడిది నమశ్శివాయ
మునులు ఘనులు మించి తలఁచి మ్రొక్కెడిది నమశ్శివాయ
ఇనశశిశిఖినయనవీధి నెక్కెడిది నమశ్శివాయ
ఓటలేక పుణ్యపథము లూటెడిది నమశ్శివాయ
మేటిసుకృతకోటి నెల్ల మీటెడిది నమశ్శివాయ
తిర మిడుకొని విబుధవరులఁ ద్రిప్పెడిది నమశ్శివాయ
గురుముఖప్రదత్తమగుచుఁ గ్రొప్పెడిది నమశ్శివాయ
బహువిధప్రమాదములను బాపెడిది నమశ్శివాయ
సుహితపుణ్యభోగపంక్తిఁ జూపెడిది నమశ్శివాయ
మూల మీ నమశ్శివాయ ముఖ్య మీ నమశ్శివాయ
శీల మీ నమశ్శివాయ శిఖర మీ నమశ్శివాయ
సుపథ మీనమశ్శివాయ శుద్ధ మీనమశ్శివాయ
నిపుణ మీనమశ్శివాయ నిత్య మీనమశ్శివాయ
గగన మీనమశ్శివాయ గర్త మీనమశ్శివాయ
నిగమ మీనమశ్శివాయ నిఖల మీనమశ్శివాయ
వీర మీనమశ్శివాయ విమల మీనమశ్శివాయ
సార మీనమశ్శివాయ సౌఖ్య మీనమశ్శివాయ
ధనద మీనమశ్శివాయ ధన్య మీనమశ్శివాయ
జనన మీనమశ్శివాయ జన్య మీనమశ్శివాయ
యోగ మీనమశ్శివాయ యోగ్య మీనమశ్శివాయ
భోగ మీనమశ్శివాయ భోగ్య మీనమశ్శివాయ
సరస మీనమశ్శివాయ సత్య మీనమశ్శివాయ
పరమ మీనమశ్శివాయ బ్రహ్మ మీనమశ్శివాయ

కం. ఈయష్టోత్తరశతముం
బాయక పఠియించునతఁడు పరమానంద
శ్రీయుక్తుఁడు రైయుక్తుఁడు
ధీయుక్తుఁడు నై తనర్చు దివ్యమహత్త్వన్.

చం. అనిమనరంగనాథుఁడు దయానిధి శ్రీగిరినాథుమీఁదఁ జె
ప్పిన శివమంత్రవర్ణనము చిత్తసముద్గత భక్తియుక్తి వ్రా
సినఁ గొనియాడినన్ వినినఁ జెల్వొసలారఁ బఠించినన్ జగ
జ్జనులకుఁబుణ్యసంపద లసంఖ్యములై సమకూరు నిమ్మహిన్.

## రంగనాథుని శివకవిత్వము.

రంగనాథుఁడను కవీశ్వరునిఁగూర్చి యిటీవల చెలరేగిన వాద దావాగ్నిలోఁ జిక్కువడి నేనొడలు కాల్చుకొనఁజాలను. ప్రాచీన కావ్య లక్షణ శాస్త్ర కవిచరిత్రాది పరిజ్ఞానము గొల్పుటలో నాకుఁ బ్రాచీన లక్షణ గ్రంథకర్తలు పితృ తుల్యులు. ఉహ్వాని యువ్వెత్తున వారి పరిజ్ఞానము నుత్తుత్తి దానిఁగా నే నూఁదివేయఁ జాలను. వారు భ్రమ ప్రమాదములు లేనివారనఁ గాదు, ప్రబల ప్రమాణములచే నట్టి వట్టిసరకును నిరూపించి కొట్టివేయుట లగ్గు. రంగనాథునిఁ గూర్చి యుపలబ్ధాంశముల నెత్తి చూపుటకే నాయీ యుపక్రమము. ఇందు ప్రామాణ్య చర్చను ప్రాజ్ఞులు కావింపఁగలరు గాక!

i

కర్ణాటక కవియగు తోంటదార్యకవి 'పాల్కురికి సోమేశ్వర పురాణము'న రంగనాథుని విషయము నిట్లు చెప్పినాఁడు. చక్రపాణి రంగనాథుఁడను వైష్ణవునితో సోమనాథునకు మతవిషయమునఁ దగవు

వాటిల్లెను. అ శైవుని దర్శింపఁడుగాన సోమనాథుఁడు తెరచాటున నుండి వాదముచేయ నంగీకరించెను. కాని యా వైష్ణవుని జయించుటకు సోమనాథుని పుత్రుఁడగు చతుర్ముఖ బసవేశ్వరుఁడే తలపడెను. వారిర్వురకు గొప్ప వాదము జరిగెను. రంగనాథుఁ డోడిపోయెను. పరాజయదుఃఖముతో నారంగనాథుఁడు శ్రీశైలమార్గముననే తిరిగి పోయెను. శ్రీశైల మల్లికార్జునిఁజూడక ద్వేషబుద్ధితోనే యరిగెను. ఆ శివద్వేషముచే నాతనికిఁ గన్నులు గ్రుడ్డివయ్యెను. అహోబలమున కరిగి యాతఁడు నరసింహస్వామిని బ్రార్థించెను. ఆ స్వామివలన స్వప్నమున శివాధిక్యబోధమును బడసి లజ్జితుఁడై తిరిగి శ్రీశైలమునకు వచ్చి మల్లికార్జుని బహువిధములఁ బ్రస్తుతించెను. ఒక కన్ను వచ్చెను. పదపడి పాలుకురికికి వచ్చి సోమనాథుని దర్శించి యపచారము క్షమింపఁ బ్రార్థించెను. సోమనాథుఁ డనుగ్రహించెను. రెండవ కన్నును వచ్చెను. రంగనాథుఁడు శైవదీక్ష నొసఁగుమని సోమనాథునిఁ బ్రార్థించెను. పుత్త్రుఁడగు చతుర్ముఖ బసవేశ్వరునిచేత సోమనాథుఁ డాతని శివదీక్షితుని జేయించెను. రంగనాథుఁ డప్పుడు వీరభద్ర విజయ శరభచరిత్రాదులను రచియించి గురుపాదముల కర్పించెను."

ii

పాల్కురికి సోమనాథపురాణమే కాక కర్ణాటకకృతి యగు గురురాజచరిత్రముగూడ నీ చక్రపాణి రంగనాథుని చరిత్రమును జెప్పుచున్నది. తోంటదార్యకవి చెప్పినట్లే యీ గురురాజ చరిత్రకర్త సిద్ధనంజేశకవియు రంగనాథుని యోటమిని జెప్పినాఁడు. 'వీరభద్ర విజయము' 'శరభలీల' యను గ్రంథములనే కాక యాతఁడు శ్రీగిరినాథవిక్రమ మని యేనూఱు సీసపద్యముల తెలుఁగు గ్రంథమును గూడ రచించెనట! దానినే సంస్కృతమునఁగూడ రచించెనట! అ కవి యిట్లు చెప్పుచున్నాఁడు.

'శ్రీశైలభక్తకును సీసంగళేనూఱు
లే సప్ప పద్యంగళెంటు సావిరగళుం
భాసురద దండకం సాహస్ర తారావళియు నాల్కు లయగ్రాహియు
ఆశతక వృత్తగళు దోధకం సావిరవు
భాసురద తోటకం నూఱు రగళెగళేడు
భాషిసిద మత్తకోకిల మూఱుసాసిరం గీతియం తాఱునూఱు
సరస మంజెర వెంటు కందంగళైనూఱు
విరచిసిద కృతియు మూవత్తాఱు గద్యగళు
నిరువ మూవత్తాఱు వుభయశతకం వొప్పమిగిలు సర్వేశనిమగె'

ఇందు 'శ్రీగిరినాథ విక్రమము' అనుపేర శ్రీశైల మల్లికార్జునిపై నైదువందల సీసపద్యములను, నెనిమిదివేల పద్యములుగల మహాగ్రంథమును, వేయిపాదములు గల దండకమును, నొక తారావళిని, నాలుగు లయగ్రాహులను, నొకవృత్త శతకమును, వేయి దోదక వృత్తములను, నూఱు తోటక వృత్తములను, నేఁడు రగడలను, మూఁడువేల మత్తకోకిలలను, నాఱువందల గీతపద్యములను, నెనిమిది మంజరులను, నైనూఱు కందములను, ముప్పదియాఱు గద్యములను, ముప్పదియాఱు ఉభయశతకములను చెప్పినట్లు ఈ పద్యమునం దున్నది. ఇతని యీ కృతులెల్ల నిప్పుడు మనకు గానరావు.

iii

కాని శివదూషణచేఁ గన్నులుపోఁగా శివస్తుతిచేఁ గన్నులు తెచ్చికొన్నట్లుగా రంగనకవి రచించినట్లుగా శ్రీగిరిమల్లికార్జునినిమీఁద రగడ యొకటియున్నది. 'శివభక్తిదీపిక' యని దానికిఁ బేరు. దానికే 'నయనరగడ' యని నామాంతరము.

iv

నేఁడు శివమంత్రవర్ణనము అనుపేర మఱియొక రగడ రంగ నాథుఁడు రచించినదిగానే దొరకినది. నమశ్శివాయరగడయని దీనికి నామాంతరము. దీని కడపట నీక్రింది పద్యమున్నది.

'అని మన? (మును?) రంగనాథుఁడు దయానిధి శ్రీగిరినాథుమీఁదఁ జె
ప్పినశివమంత్రవర్ణనము చిత్తసముద్గత భక్తియుక్తి వ్రా
సినఁ గొనియాడినన్ వినినఁ జెల్వొనలారఁ బఠించినన్ జగ
జ్జనులకుఁ బుణ్యసంపద లసంఖ్యములై సమకూఱు నిమ్మహిన్.

ఈ పద్యమును రంగనాథుఁడే రచించెనో లేక తర్వాతికాల మున నితరుఁడే రచించెనో! ఈ రెండు రగడల నిప్పు డిక్కడఁ బ్రకటించినాఁడను. సిద్ధనంజేశ కవి పద్యములో లెక్కింపఁబడిన రంగనాథుని రగడ లేడింటిలో నిప్పటికి రెండు రగడలు దొరకినవన వచ్చును. 1. శివభక్తిదీపిక యను నయనరగడ 2. శివమంత్ర వర్ణన మను నీ నమశ్శివాయరగడ.

v

శివభక్తిదీపిక వ్రాఁతప్రతిలో కడపట నిట్లున్నది.

'వైష్ణవ చక్రపాణి రంగనాథుడు శైవ దీక్షాధారణమైన తర్వాతను చేసిన నయనరగళ'

vi

'ఏకశిలానగర వృత్తాంతము'లో రంగనాథునిగూర్చి యిట్లున్నది.

'రంగనాథుడు ఆందోళికపై నెక్కి చనుదెంచునప్పుడు త్రిపు రాంతకదేవుని గోపురంబు జూచి 'అదియేమి?' యని యడిగిన నావివరాలు త్రిపురాంతక గోపురంబని పలుకుటయు నా శివభవనంబు

జూడనొల్లక మైనపుజడ్డు కప్పించుకొనియె. అప్పుడు రంగనాథుని నేత్రంబులు గానరాక జాత్యంధుని వలెనే మగిడి శ్రీరంగానకు పోయి యద్దేవుని బ్రసన్నుని జేసికొని నేత్రంబులు పోయెనని మొఱయాడు టయు, నద్దేవుండు కరుణించి త్రిపురాంతక దేవుణ్ణి వేడుకొమ్మను టయు రంగనాథుండు మళ్లీ త్రిపురాంతకమున కేతెంచి యద్దేవునకు నమస్కరించి తనయెత్తుకృతులు సమర్పింతునని వ్రతంబుచేసి భక్తి మయంబగు రగడ చెప్పిన నద్దేవుండు ప్రసన్నుండై రంగనాథునకు నిరుకన్నుల నొసగుటయు రంగనాథుడు పాలకూర్తికిం జని సోమ నాథునిచే శివదీక్షగైకొనియె. ఆయయ్యవద్ద శైవరహస్యంబులు తెలిసికొనుచుండె. అంత నిక్కడ ప్రతాపరుద్రుండు రంగనాథుని ప్రభావంబువిని యాశ్చర్యంబు నొందెను.' రంగనాథుని గూర్చిన పైకథ నిన్ననో నేఁడో యెవరో సృష్టించిరని యూహింప వీలులేనిది.

vii

శ్రీనాథుని సమకాలపువాఁడగు కొలని గణపతి దేవుఁడు తన 'శివయోగ సారము' న చక్రపాణి రంగనకవి నిట్లు స్తుతించినాఁడు.

'అసమశివభక్తిరసమా
నసునిం బాల్కురికి సోమనాథుని, గవిరా
జసమున్నతయశు సద్యః
ప్రసాది యగు చక్రపాణి రంగనఁ గొలుతున్

viii

గురురాజకవి పద్యమున రంగనాథుఁడు నూఱు తోటక వృత్త ములనుగూడ రచించినట్లు కలదు. ఛందోగ్రంథములలో రంగ నాథుని తోటకము లివి రెండు కానవచ్చినవి.

బాలబోధచ్ఛందస్సులో —

తోటకము. ఉపవాసము లెల్లను నుండుట నీ
కృప వచ్చుటకా యది రిత్త సుమీ
యపవిత్రునిఁ బుల్లని యంబలికై
సుపవిత్రునిఁ జేయుట సుద్ది గదే.

హనుమచ్ఛందస్సులో —

తోటకము. చెలువార గజాజినచేలముతో
గళనీలిమతో నహికంకణుఁడై
తలఁ జంద్రకళం గల దైవము మా
కులదైవము దైవతకోటులలోన్

వీనినిబట్టి సిద్ధనంజేశకవి చెప్పిన తోటకవృత్తములను రంగ నాథుఁడు రచించుట సమర్థిత మగుచున్నది.

రంగనాథుని యనుకరణము కావచ్చును. కాశీఖండమున శ్రీ నాథుఁడు కూడ తోటకవృత్తరచనము చేసినాఁడు.

ix

బాలబోధచ్ఛందమున రంగనాథునిదిగా నీక్రింది కందపద్యము కలదు.

క॥ ఫాల తలభస్మ రేఖలు -

ఇది సమగ్రముగా లేదు. ఇది సిద్ధ నంజేశకవి పేర్కొన్న నూటు కందములలోఁ జేరినదేమో!

x

ప్రయోగరత్నాకరములో రంగనాథుని మిత్రవిందాపరిణయము లోనిదిగా నీక్రింది పద్యభాగ మున్నది.

"వనమాలి గొలుచు నందుననె యొల్లప్పుడు"

xi

పలువురు శివకవులు కవిస్తుతిలో రంగనాథుని శివకవినిగా స్తుతించినారు. మచ్చుకు ఒకటి.

భద్రకవి లింగకవి రంగనాథ ప్రశంస.

'దండితోఁ బండితత్రయముఁ గీర్తించి
సకలవేదపురాణశాస్త్రేతిహాస
నికరార్థములు ప్రమాణించి సద్భక్తి
శ్రీమతి నుద్ధరించిన పాలకుఱికి
సోమనాథేశ్వరు సొంపుతోఁ గొలిచి
రంగద్విశాలాంతరంగంబునందు
రంగనాథునిఁ గవిరాజున్యుఁ దలఁచి
యసమానచరితుఁ బ్రత్యగ్రకల్యాణ
బసవేశుఁ బిడుపర్తి బసవేశుఁ గొలిచి'

(సానందోపాఖ్యానము)

xii

వైష్ణవుఁడైన చక్రపాణి రంగనాథుడు శైవుఁడై రంగనకవి యయినాఁడు. ఇట్లే శైవుఁడైన తెనాలి రామలింగకవి వైష్ణవుఁడై రామకృష్ణుఁ డయినాఁడు.

xiii

రంగనాథుని పద్యములుగా ప్రబంధ రత్నావళిలో నీపద్యము లున్నవి. ఇవికూడ (శ్రీశైలమల్లికార్జున) శివస్తవపరములే కాన, పయి రంగనాథుని రచనములే యగుట సుస్పష్ట మయినది.

అదలని తేరు తేరికిని నాదరువై తగు విల్లు వింటికిం
గుదురగు నారి నారిపయిఁ గూర్చ శరంబు శరంబు బొద్దునం

బొదలిన యంత యంతముఖముల్ నిజవాసములైన గుబ్బముల్
చెదరక నీకు నెట్టి పని సేయు నయా! గిరిజాధినాయకా!

ఓజు చేముట్టక యొగ్గానఁ బట్టక
చక్కఁగా దివిఁ బాఱు చక్రములును
లాయానఁ గట్టక లలి మేఁత వెట్టక
వర్ణహీనంబైన వారువములు
తవన వెట్టక జీవితము కాసు ముట్టక
సత్త్వసంపదఁ జూపు సారధియును
కడచీలఁ దట్టక ఘనముగా మెట్టక
గంభీరసంపద గలుగునిరుసుఁ

గలిగి తనరారునరదంబుఁ గడఁక నెక్కి
త్రిపురవిజయంబుఁ జేకొన్న దేవదేవుఁ
డిందుశేఖరుఁ డానందమందిరుండు
మనలఁ గరుణావిధేయుఁడై మనుచుఁగాత!

గోశతపంచవార్ధులును గోయుగవార్ధులు గోత్రివార్ధులున్
గోశరవార్ధులున్ విదితగోశర (వార్ధులు) పంచవార్ధు లా
కేశవతల్ప పద్మభవ కేకిప్లవాహన దానవేశ దే
వేశుల కిచ్చునట్టి షర్మేశ్వరుఁడిచ్చుత మా కభీష్టముల్.

xiv

పొత్తపి వెంకటరమణకవి రచించిన లక్షణశిరోమణి యను లక్షణ గ్రంథములో 'అచ్చవెల్లి రంగన్నగారు' అనుపేర రంగనాథ రామాయణ ద్విపద లుదాహరింపఁబడినవి. 'అచ్చవెల్లి' యను గ్రామము నేఁడు కడపజిల్లా పులివెందల తాలూకాలో నున్నది.

XV

ఒకానొక లక్షణగ్రంథమున నిట్లున్నది.

రంగనాథయ పద్యము :—

ఉ. మంచెన చూచితే శివసమాహితచిత్తులు పద్మవాసనా
కుంచనచంచదున్మిషితకోమలమూల సరోజకర్ణికా
భ్యంచితబిందునాదరసభవ్యనిరంతరశబ్దవల్లి శీ
లించు తెలుంగు శ్రీగిరిం జలింపనిమర్త్యనిలింపు లింపునన్



# చాటుపద్యమణిమంజరి

## కవిప్రశంసా స్తబకము.

### సంస్కృత కవులు.

### బిల్హణుఁడు

ఈతఁడు కాశ్మీరదేశమువాఁడు. ఆంధ్రదేశమున క్రీ॥ పదవ శతాబ్దినాఁట చాళుక్యరాజగు సోమేశ్వరుని యాస్థానమునఁ బెక్కేండ్లు కవీశ్వరుఁడుగా నుండి యా రాజు చరిత్రమునే విక్రమాంకదేవ చరిత్ర మను పేరఁ బ్రశస్తకావ్యముగా రచించినాఁడు. ఏదో కోపమువచ్చి తుదకు విక్రమాంకదేవుఁ డీతని సర్వస్వమును హరించి దేశమునుండి వెడలఁగొట్టఁగాఁ జెప్పిన శ్లోకము:-

శ్లో॥ సర్వస్వం గృహవర్తి కుంతలపతి ర్గృహ్ణాతు త న్మే పున
ర్భాండాగార మఖండ మేవ హృదయే జాగర్తి సారస్వతమ్
రే! క్షుద్రాః! త్యజత ప్రమోద మఘనా ప్యాయాంతి మ స్మందిరం
హేలాందోళిత కర్ణతాళకరటి స్కంధాదిరూఢాః శ్రియః.

తొలుత రాజాస్థానమునఁ బ్రవేశము కలుగకపోఁగా నందుకై పండితులవెంట రాజద్వారాశ్రయము జరుపునాళ్లలో నాతఁడు చెప్పికొన్నది.

శ్లో॥ రాజద్వారే స్మరాగారే విశంతి ప్రవిశంతి చ
దండవ త్పండితా స్సర్వే బిల్హణో వృషణాయతే.

ఆతని వైదుష్యదర్పము:-

శ్లో॥ బిందుద్వంద్వతరంగితాగ్రసరణిః కర్తా శిరోబిందుకం
కర్మేతి క్రమశిక్షితాన్వయకలా యేకేపి తేభ్యోంజలిః
యే తు గ్రన్థసహస్రశాణకషణత్రుట్యత్కళంకై ర్గిరా
ముల్లాసైః కవయంతి బిల్హణకవి స్తేష్వేవ సన్నహ్యతి.

రాజద్వారము నాశ్రయించి చెడిన బిల్హణాదులఁగూర్చి యెవరో చెప్పిన శ్లోకము:-

శ్లో॥ జీవన్నేవ పిశాచతా ముపగతఃఖ్యాతః కవి ర్బిల్హణః
ఛందోగోయ మితి ప్రభాకరగురు ర్దేశా త్సముత్సారితః
మాతంగత్వ ముపేయివాన్ వరరుచిః ప్రఖ్యాతనామాపిసన్
రాజద్వార ముపాశ్రితైః ఖలు జనైః కిం కిం న సంభావ్యతే॥

## పెద్దిభట్టు

ఈతఁడు వెలుగోటి సింగభూపాలునినాఁటివాఁడు. మల్లినాథునిపేర సీతడే గ్రంథములు రచించెనని ప్రతీతి. అందు కీ యైతిహ్య మున్నది. మల్లినాథుఁడును పెద్దిభట్టు నన్నదమ్ములు. మల్లినాథుఁడు మందబుద్ధి గలవాఁడు. పెద్దిభట్టు పెద్దబుద్ధి గలవాఁడు. వీరు నివసించు గ్రామము చేరువ నడవిలో నొక యోగీశ్వరుఁడు తపస్సు చేసికొనుచుండెను. మందబుద్ధి యగుమల్లినాథుఁడు తత్పరతతో నా యోగీశ్వరుని శుశ్రూషించుచుండెను. పెద్దిభట్టును సకృత్తుగా సందర్శించుచుండెడివాఁడు. మల్లినాథుఁ డొకప్పుడు కార్యవశమున గ్రామాంతరమున కరిగెను. అన్నగారిచే నాజ్ఞప్తుఁడై యప్పుడు పెద్దిభట్టాయోగి నారాధించుచుండెను. అది యా యోగికి నిర్యాణకాల మయ్యెను. మల్లినాథుఁడు దగ్గఱ లేఁడయ్యెను. తన కిన్నినాళ్లు చేసిన శుశ్రూషకై యా యోగి

మల్లినాథునకు సారస్వతము నుపదేశించి యుద్ధరింపఁదలఁచెను. కాని యట్లు తటస్థింపదయ్యెను. అప్పుడు సేవించుచుఁ జెంతనున్న పెద్దిభట్టును జూచి మీయన్నకుఁ జేయఁదలంచుకొన్న యుపదేశము నాతని యసన్నిధిచే నీకుఁ జేయుచున్నాను. దీని ఫలము మీ యన్నగారికే చెందఁజేయుదువు గాక యని యొక మంత్రముపదేశించి యా యోగి సిద్ధిపొందెను. పెద్దిభట్టంతతో మహోపాధ్యాయుఁడయ్యెను. గుర్వాజ్ఞ చొప్పున నాతఁడు తాను రచించిన గ్రంథములన్నింటిని నన్నగారగు మల్లినాథుని పేరనే ప్రకటించెను.

## మల్లినాథుని వైదుష్యము.

గ్రంథములందు మల్లినాథుఁడని పేరున్నది. కావున నా పేరే పేర్కొనియెదను. ఈయన స్వతంత్ర గ్రంథము లంతగా రచించినట్టు కానరాదు. హెచ్చుగా వ్యాఖ్యాన గ్రంథములే యగపడుచున్నవి. రఘువంశ కుమారసంభవ మేఘసందేశ కిరాతార్జునీయ శిశుపాలవధములకుఁ బంచకావ్యములన్న పేరు కల్గుటయును, సంస్కృత భాష నభ్యసించు విద్యార్థు లీ గ్రంథములనే ప్రధానముగా నారంభించి చదువుటయును, సుగమములైన మల్లినాథ వ్యాఖ్యలు వెలసిన తర్వాతనే యేర్పడిన వని కొందఱు తలంచుట కలదు. కాని తార్కికరక్షటీకలో మల్లినాథుడే "స్ఫుటీకృతం చైత దస్మాభిః పంచకావ్యటీకాసు" అనుటవలన నాయననాఁటికే యా గ్రంథములకుఁ బంచకావ్యసంజ్ఞ కలదని యేర్పడుచున్నది. ప్రధానముగా విద్యార్థులా గ్రంథములనే చదువుటకుఁ గారణము మల్లినాథ వ్యాఖ్యలు కావచ్చును. రఘువంశాది కావ్యములకు మల్లినాథునకుఁ బూర్వకాలమందే పదులకొలఁది వ్యాఖ్య లున్నవి. కాని ఈయన వ్యాఖ్యలు వెలసిన తర్వాత వానికిఁ బ్రచారము తగ్గినది. ముద్ర

ణాది సౌకర్యము లేని యాకాలముననే మన మల్లినాథుని గ్రంథము లాసేతుశీతాచలము వ్యాపించినవి. ఇట్టి వ్యాప్తికి వాని ఘనతయే కారణము.

మల్లినాథుఁడు రచియించిన గ్రంథము లివి తెలియవచ్చుచున్నవి. రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశ, కిరాతార్జునీయ, శిశుపాలవధము లనుపంచకావ్యములకు వ్యాఖ్యలు; నైషధవ్యాఖ్య, భట్టికావ్యవ్యాఖ్య, ఏకావళివ్యాఖ్య, తంత్రవార్త్తికటీక, స్వరమంజరీ వ్యాఖ్య (పరిమళము), తార్కికరక్షటీక, జ్యోతిషగ్రంథము. రఘువీర చరితము— ఇది మల్లినాథకృతి యగునో కాదో !

పెద్దిభట్టు సింగభూపతి కాలమున నున్నవాఁ డనుటకు సాధకముగా నీ క్రింది శ్లోకము దొరకినది. తర్వాత దీనిని చమత్కార చంద్రికలో చూచితిని.

శ్లో॥ కిం వాససా చీకిరిబాకిరేణ కిం దారుణా వంకరటింకరేణ
శ్రీసింగభూపాల విలోకనార్థం వైదుష్య మేకం విదుషాం
సహాయమ్.

పెద్దిభట్టొకనాఁడు చీఁకిరి బాఁకిరి చినుఁగులప్రాఁత కట్టుకొని, వంకర టింకర కఱ్ఱ చేతఁ బట్టుకొని సింగభూపతి విద్వత్సభకుఁ బోవుచుండఁ ద్రోవలో నెవరో యడిగిరఁట. "తాతగారూ! రాజసభ కిట్టి వేషముతోఁ బోవుచున్నారే"మని. అప్పుడాయన పై శ్లోకము చెప్పెనట!

రెండవయర్థము:-పల్లకీ లేకపోయిన నేమి యని; పల్లకికి చీకిరి బాకిరి కుచ్చులు, వంకర టింకర బొంగు ఉండును. మఱియుఁ బెద్దిభట్టు గణాధిప ప్రసాదము గలవాఁడని చంపూరామాయణవ్యాఖ్యాది

శ్లోకములం దున్నది. రఘువంశాది వ్యాఖ్యలందుఁ బ్రథావముగాఁ జేసిన గణపతి స్తుతిశ్లోకము లున్నవి.

పెద్దిభట్టుపేర నీ క్రింది కథలను గొందఱు చెప్పుచున్నారు. "పెద్దిభట్టు తోడల్లుఁడు ఘనాంతము వేదవిద్య నేర్చినవాఁడు. మంచి కండపుష్టి కలవాఁడు. పెద్దిభట్టు మంచి సంస్కృత సాహిత్యము, శాస్త్రపాండిత్యముఁ గలవాఁడుగదా! పెద్దయల్లుఁ డగు నా వేదముగ్ధుఁడును, చిన్న యల్లుఁడగు నీ శాస్త్రచతురుఁడును నత్తవారింటికేక కాలమున నొకప్పు డేతెంచిరి. అత్తమామ లా పెద్దయల్లు నలక్ష్యముతో నగౌరవముతోను, నీ పిన్నయల్లుని మన్నన మర్యాదలతోను జూడసాగిరి. అతని వేదవైదుష్యమును వెక్కిరించి యీతని శాస్త్ర చాతుర్యమును సన్నుతించిరి. అతనికి నడవలోఁ జాఁపమీఁదను, నీతనికిఁ బడుకగదిలోఁ బట్టెమంచముమీఁదను శయనవిధాన మేర్పఱచిరి. పెద్దాతఁడు కోపమునఁ గుములుచుండెను. పిన్నాతఁ డుత్సాహమున నుప్పొంగుచుండెను. పడుక గదినుండి రాత్రి లఘుశంకకు బయలుదేఁగుచు నీ పిన్నాతఁడు త్రోవలో నడవలోఁ బండుకొనియున్న తోడియల్లు నొకతన్ను తన్ని యెఱుఁగక ప్రమాదమునఁ దన్నినట్లు నటించి "క్షమధ్వమ్" అని బుజ్జగించి పోవుచుండెను. ఒకనాఁడాయెను. రెండ్లాయెను. అనుదినము నట్లే తన్నుచు "క్షమధ్వమ్" చెప్పుచుండ సాగించెను. ఒకనాఁడు రెండ్లోర్చుకొనెను. కాని పెద్దయాతఁ డామీఁద నాఁగఁజాలఁడయ్యెను. మూఁడవనాఁడు నట్లే యాతఁడు తన్ని "క్షమధ్వము" చెప్పెను. కోపాటోపముతో లేచి యా పెద్దయాతఁడీ చిన్నయాతని సిగ పట్టుకొని వంగలాగి "పోగరుబోతా! ప్రతిదినముఁ దన్నుచు నొకటే క్షమధ్వము చెప్పసాగించితివి. నీకొక క్షమధ్వము వచ్చిన నాకు ముప్పది రెండు శ్రయధ్వములు వచ్చును. ఏమనుకొ

న్నావో నా దెబ్బ చూచికొమ్మ"ని ప్రథమా ద్వితీయేషు శ్రయధ్వం, ద్వితీయా స్తృతీయేషు శ్రయధ్వం, తృతీయా శ్చతుర్థేషు శ్రయధ్వం (ఇట్లు ముప్పదిరెండు శ్రయధ్వములు గల వేదమంత్ర మున్నది) అని సస్వరముగాఁ జదువుచు నొక్కొక గ్రుద్దు చొప్పున ముప్పదిరెండు గ్రుద్దులు వెన్నెముకలు విఱుగునట్లు వీఁపుమీఁదఁ దగిలించెను. అవమానితుఁడై పిన్నయల్లు డడఁగి యుండెను. అనేకు లీకథను బెద్దిభట్టు పేరఁ జెప్పుదురు. తన్నులు తగిలినవనుటకు శ్రయధ్వములయిన వనుట పారిభాషికముగా వైదికుల వాడుకలో నున్నది.

ఎల్లప్పుడును సుకవి సూక్తి రసాస్వాదన తత్పరుఁడుగా నుండు నీ పెద్దిభట్టు స్త్రీవర్ణనమున మంచి మంచి శ్లోకములను జదువుచుండఁగా వినుచున్నదై యాతని యిల్లాలొకనాఁ డిట్లు వేఁడికొన్నదట. "వారిని వారిని వర్ణించిన శ్లోకములను జదువుదురే గాని నన్నొకనాఁడైన వర్ణింపరైతిరి గదా!" యని. నాఁ డిట్లు వర్ణించినాఁడు పెద్దిభట్టు.

శ్లో॥ మేరుమందరసమానమధ్యమా తింత్రిణీదళవిశాలలోచనా
అర్కశుష్కఫలకోమలస్తనీ పెద్దిభట్ట గృహిణీ విరాజతే.

గ్రంథ వ్యాఖ్యానదీక్షతోఁ గాలమెల్లఁ గడపుచుఁ బెద్దిభట్టింటి పని నంటించుకొనకుండెను. ఇత్యర్థః, ఇతిభావః అనుచు నీయన కూరుచుండుట వలన నిల్లాలికి గృహనిర్వాహము దుష్కరమగుచుండెను. ఒకనాఁ డొక యాప్తవిద్వాంసుఁ డతిథియై యింటికి రాఁగా నేఁడేమి కూరగాయలు వండెదవని పెద్దిభట్టు భార్య నడిగెను. ఆమె యిట్లు బదులు చెప్పెను. "ఇత్యర్థముల కూర - ఇతిభావముల పులుసు - వండెదను. మీరింటి నిండ నించుచున్న పదార్థము లివే కదా!"

ఈతఁడు శ్రీహర్షనైషధమునకు వార్ధక్యమున వ్యాఖ్య గావింప నారంభించెను. జీవిత సంశయముచేఁ దొందర తొందరగా రచించుట

చేత నా వ్యాఖ్య యపర్యాప్తకముగా నుండెను. అది చూచి యొక పండితుఁ డింత లఘువుగా రచించుచున్నా రేమని యడుఁగగా "మాఘే మేఘే గతం వయః" (మాఘమున, మేఘ సందేశమున వయస్సు కడచెను) అని పెద్దిభట్టు బదులు చెప్పెను. ఇట్టి కథలు మఱికొన్ని యున్నవి.

## బాణుఁడు.

ఈతఁడు క్రీ॥ 7-వ శతాబ్దినాఁడు హర్షవర్ధనుఁ డను రాజునాస్థానమున నుండి కాదంబర్యాది దివ్య గ్రంథముల రచించిన మహాకవి. ఈతఁడు మరణింపఁగా నీతని మిత్రుఁ డింకొక కవీశ్వరుఁడు చెప్పిన శ్లోకము.

శ్లో॥ ధ్వస్తః కావ్యోరుమేరుః కవివిపణిమహారత్నరాశి ర్విశీర్ణః
శుష్కశ్శబ్దౌఘసింధుః ప్రళయ ముపగతో వాక్యమాణిక్యకోశః
దివ్యోక్తీనాం నిధానం నిధన ముపగతం హా హతా దివ్యవాణీ
బాణే గీర్వాణవాణీ ప్రణయిని విధినా శాయితే దీర్ఘనిద్రామ్.

## కపర్దిస్వామి

ఈతఁడు మల్లినాథుని వంశమునఁ బూర్వుఁడట.

శ్లో॥ అంబా కుప్యతి నమయా
నస్నుషయా సాపి నాంబయా నమయా
అహమపి నతయా నతయా
వద రాజన్ కస్య దోషోయమ్.

## శాకల్యమల్లుభట్టు

ఈతఁడు రామాయణ యుద్ధకాండ శేషమును పూరించిన యయ్యలార్యుని బంధువు. విద్యానగరపు హరిహరరాయుల సమకాలపువాఁడు.

శ్లో॥ ఏకోఽభూ త్పులినా త్తత స్తు నలినా చ్చాన్యోఽపి నాకోరభూత్
ప్రాచ్యాస్తే త్రయఏవ దివ్యకవయో దీవ్యన్తు దేవ్యా గిరా
అర్వాంచో యది గద్యపద్యరచనా చాతుర్యవాగుద్ధతా
స్తాన్సర్వా నతిశయ్య ఖేలతితరాం శాకల్యమల్లః కవిః

ఆహో నారద శక్ర కిం క్వను గతో భూలోక మాలోకితుం
కో రాజా భువి విక్రమీ హరిహరో ధత్తే కియన్మండలమ్
ఆపూర్వార్ణవ మాపరార్ణవ ... ...
పూర్ణ స్తత్కవయో గజేంద్రవిజయీ శాకల్యమల్లః కవిః.

అభ్యుద్ధృతా వసుమతీ దళితోరివర్గః
క్రోడీకృతా బలవతా బలిరాజలక్ష్మీః
ఏకత్రజన్మనికృతం యదనేన యూనా
జన్మత్రయే తదకరోత్ పురుషః పురాణః

## లొల్లవారు

వీరిలోఁ గడపటివాఁడగులక్ష్మీధరుఁడు బహు మహాగ్రంథకర్త. గజపతి ప్రతాపరుద్రునియు శ్రీకృష్ణ దేవరాయలయు నాస్థానులలో విద్వత్కవిగా నుండినవాఁడు.

శ్లో॥ శేషాశేషోక్తిభూషాః కణచరణ చణగ్రంథ సౌగంధ్య జిఘ్రా
భట్టోక్తి ప్రౌఢిలీఢా గురుగురుతరగీ ర్గుంభశుంభ ద్విజృంభాః
నిశ్శంకా శ్శంకరోక్తా పశుపతిమతనిర్వాహకా స్సాంఖ్యసఖ్యా
యస్య శ్రీలొల్లలక్ష్మీధర విబుధమణే ర్భాంతి వాచాం నిగుంభాః

శ్లో॥ వయమిహ పదవిద్యాం మంత్ర మాన్వీక్షికీం వా
యది పథి విపథే వా వర్తయామ స్సపంథాః
ఉదయతి దిశి యస్యాం భానుమాన్ సైవ పూర్వా
నహి తరణి రుదీతే దిక్పరాధీనవృత్తిః

శ్లో॥ సాయం సంఫుల్లమల్లీ సుమసురభిసుధా మాధురీ సాధురీతిః
ప్రేంఖత్పుంఖానుపుంఖ స్ఫురదమరసరి ద్వీచివాచాలవాచః
లొల్ల శ్రీలక్ష్మణాఖ్యో గుణమణిజలధి ర్భాసతే భూసురాళీ
కేళీనాళీకపాళీ దళశతకిరణో విద్వదగ్రేసరోఽసౌ.

శ్లో॥ యః కర్ణాటవసుంధరాధిపమహాస్థానే సువర్ణాయితో
యో విద్వన్నికషాయితో నృపగృహే వేమాఖ్య పృథ్వీశితుః
శ్రీమల్లొల్లటభట్టశిష్య యితి యో లొల్లాఖ్యయా శ్రూయతే
శ్రీ శేషాన్వయశేఖర స్స హి మహాదేవో విపశ్చి న్మహాన్

శ్లో॥ నికషాయితు మీహే వా సువర్ణాయితు మేవ వా
సువర్ణాయితు మేవే హే నికషో న హ్యలంక్రియా

శ్లో॥ తర్కాన్యక్కృత వావదూకనిచయం వాదిత్వ మాస్తాం మమ
వ్యాఖ్యాతృత్వ ముదారశిష్యనివహ శ్లాఘ్యం తథా తిష్ఠతు
స్వర్లోకాచ్చ్యవమానసిద్ధతటినీ కల్లోలసల్లాపినా
ముల్లాసావచసాం న కస్య మనసాం మత్కా శ్చమత్కారిణః

శ్లో॥ గతోఽయం శంకరాచార్యో వీరమాహేశ్వరో గతః
షట్చక్రభేదనే కో వా జానీతే మత్పరిశ్రమమ్.

జగన్నాథపండితరాయలు

ఈతఁడు క్రీ. 1650 ప్రాంతము వాఁడు.

శ్లో॥ కవయతి పండితరాజే కవయ స్త్వన్యేఽపి విద్వాంసః
నృత్యతి పినాకపాణౌ నృత్య న్త్యన్యేపి భూతవేతాళాః

శ్లో॥ మాధుర్యై రపి ధుర్యై ర్ద్రాక్షాక్షీరేక్షుమాక్షికాదీనామ్
వన్ద్యైవ మాధురీయం పండితరాజస్య కవితాయాః

శ్లో॥ గిరాం దేవీ వీణాగుణరణనహీనాదరకరా
యదీయానాం వాచా మమృతమయమాచామతి రసమ్
వచస్తస్యాకర్ణ్య శ్రవణసుభగం పండితపతే
రధున్వన్మూర్ధానం నృపశు రథ వాయం పశుపతిః॥

శ్లో॥ మధుద్రాక్షా సాక్షాదమృత మథ వామాధరసుధా
కదాచిత్కేషాంచి త్ఖలు హి విదధీరన్నపి ముదమ్
ధ్రువం తే జీవన్తో ప్యహహ మృతకా మన్దమతయో
న యేషా మానన్దం జనయతి జగన్నాథ భణితిః॥

శ్లో॥ ఢిల్లీశ్వరో వా జగదీశ్వరో వా
మనోరథాన్ పూరయితుం సమర్థః
అన్యై ర్నృపాలైః పరిదీయమానం
శాకాయ వా స్యాత్ లవణాయ వా స్యాత్॥

శ్లో॥ నిర్మాణే యది మార్మికోసి నితరా మత్యంతపాకద్రవన్
మృద్వీకా మధుమాధురీ మధుపరీ హారోద్ధురాణాం గిరామ్
కావ్యం తర్హి నఖే సుఖేన కథయ త్వం సమ్ముఖే మాదృశాం
నోచేద్దుష్కృత మాత్మనా కృతమివ స్వాంతాద్బహి ర్మాకృథాః॥

శ్లో॥ యవనీ నవనీతకోమలాంగీ
శయనీయం యది యాతి చేత్కదాచిత్
అవనీతల మేవ సాధు మన్యే
నవనీ మాఘవనీ వినోదహేతుః॥

శ్లో॥ న యాచే గజాళిం న వా వాజిరాజిం
నవిత్తేషు చిత్తం న మే కించిదస్తి
ఇయం సుస్తనీ మస్తకన్యస్తహస్తా
లవంగీ కురంగీ దృగంగీకరోతు.

## సుసర్ల బ్రహ్మన్న శాస్త్రి.

ఈతఁడు కృష్ణామండలమున పెదకళ్లేపల్లి వాస్తవ్యుఁడు.

శ్లో॥ క్షేత్రం దాశరథిః ఖలం నిజపదస్పర్శేన దోషోజ్ఝితం
తర్కజ్ఞస్య హి గౌతమీతటజుషో విప్రస్య స ప్రత్యదాత్
గోదాసప్తకతీరసంస్థితిజుషాం షడ్దర్శనీదర్శినాం
శ్రీతిమ్మక్షితిపో౽ఖిలం తదకర స్పర్శం విధత్తే౽ధునా॥

శ్లో॥ తద్ధిత స్తద్ధిత స్త్వద్ధిత స్త్వద్ధితః
సద్ధిత స్సద్ధితో మద్ధితో మద్ధితః
ఏక ఏవ హ్యసౌ తిమ్మరాజప్రభు
స్తద్ధిత స్త్వద్ధిత స్సద్ధితో మద్ధితః॥

## నడిమింటి మంగళేశ్వరశాస్త్రిలు.

విశాఖపట్టణంజిల్లా పార్వతీపురము తాలూకాలోని నాగూరను నగ్రహారమున మీఁదఁ బేర్కొన్న నడిమింటి మంగళేశ్వర శాస్త్రిలను నుద్దండవిద్వాంసుఁడు జన్మించెను. ఇప్పటికి నెనుబది యేండ్లక్రిందటివఱకు నీతఁడు జీవించియుండెను. విశాఖపట్టణ మండలమందేగాక సర్వాంధ్రదేశమందును నీపండితప్రకాండుని పేరు ప్రఖ్యాతమయినది. వ్యాకరణశాస్త్రమం దీయన మహాపండితుఁడు. తెనాలి రామలింగనివిధము వాఁడు. సుకవి. సంస్కృతభాషాపరిచయము గోరు బాలురకయి సమాసకుసుమావళి యనుపేర నీయన రచియించిన లఘుగ్రంథము మనదేశమున బహువ్యాప్తికలది. సంస్కృతభాషాభ్యాసము సేయు ప్రతివిద్యార్థియు నాగ్రంథప్రతిని జదువుచున్నాఁడు.

1. బొబ్బిలి సంస్థానమునకు వీరి యగ్రహారము చేరువనున్నది. ఆ కారణమున బొబ్బిలిప్రభువులతో నీయనకుఁ దఱచుగా సమాగమము కల్గుచుండెడిది. నక్క యెడమవైపునుండి కుడివైపునకుఁ బోయిన మంచిదా కుడివైపునుండి యెడమవైపునకుఁబోయిన మంచిదాయని యొక నాఁడు బొబ్బిలిరాజుగారు విద్వద్గోష్ఠిలో మంగళేశ్వర శాస్త్రిలుగారి నడిగిరి. శాస్త్రిలుగా రిట్లు బదులుచెప్పిరి! అది కఱవలేదుగదా!! కఱవకుండ నెటుపోయినను మంచిదే.

2. బొబ్బిలిరాజుగారు మీకు ఊరు+ఇచ్చెదమనుచున్నారని తదాస్థానోద్యోగియగు తనమిత్రుఁడొకఁడు చెప్పఁగా దానితత్త్వ మెఱిఁగిన యీయన యిట్లు బదులుచెప్పెను. ‘‘మీరాజుగా రెప్పుడూ ఊరిస్తూనే వుంటారులెండి’’...

3. బొబ్బిలిరాజుగారు సీతారామపురమను పేరుగల తమ సంస్థానగ్రామమున వేంచేసియున్న గోపాలస్వామియే యజమానుడుగా నొకప్పుడు యజ్ఞము చేయించినారట. ఆ యజ్ఞమునకు విచ్చేయను మన మంగళేశ్వరశాస్త్రిలుగారికిని ఆహ్వానపత్రిక వచ్చెను. దానికీయన యిట్లు బదులు వ్రాసిపుచ్చెను. ‘ప్రభూ! శ్రీవేణుగోపాలస్వామివారు స్వయముగాఁజేయుచున్న యజ్ఞమును దర్శింప నేను దప్పక రావలసినవాఁడనే కాని నాకిక్కడ నొక్క చిక్కు తటస్థించినది. మాగ్రామమున రేగాలమ్మయని గ్రామదేవతకలదు. ఆమెను మాయూరనే నెలకొనియున్న పోతురాజను దేవరకిచ్చి పెద్దలు పెండ్లిచేసినారు. రేగాలమ్మ యెన్నాళ్లకును సమర్తాడదయ్యెను. పోతురాజు బ్రహ్మచర్యమున నిల్వఁజాలక తనకిట్టి యసందర్భవివాహ మేల చేయవలెనని మాగ్రామమువారిమీఁద మహాగ్రహావిష్టుఁడై యున్నాఁడు. మేమందఱము పోతురాజుగారివలన భీతిగొనియున్నాము. మా యదృష్టవశ

మున నీనాటికి రేగాలమ్మ పెద్దమనుష్యురాలయినది. మీరు శ్రీవేణుగోపాలస్వామివారియజ్ఞమునకుఁ బెట్టించిన సుముహూర్తము చాల దొడ్డదగుటచే మేము నదే సుముహూర్తమున సౌభాగ్యవతియగు రేగాలమ్మకు గర్భాధానమంగళము జరిపింపనిదివఱకే నిర్ణయించి పోతురాజుగారి నాశ్వాసపఱచి ప్రయత్నములు జరుపుచున్నాము. గ్రామమునఁ బెద్దవాఁడనగుటచే నేనాశుభకార్యమున నుండితీఱవలయును. అప్పు డుండకున్నను, సుముహూర్తముమార్చినను బోతురాజుగారికి మహాగ్రహము వచ్చును. ఈకారణమున శ్రీస్వామివారి యజ్ఞమునకు రాజాలనందుకు నన్ను క్షమింపవేఁడెదను.'

4. బొబ్బిలిసంస్థాన గ్రామవాస్తవ్యులగు నొకరియింటఁ గొంత సొమ్ము దొంగలు దోచుకొనిపోయిరట. దానిని విచారింప రాజుగారి కాయింటియతఁడు విన్నవించుకొనెను. కన్నముత్రవ్వక చేసిన దొంగతికము విచారింప సాధ్యముకానిదనియు నట్టి దొంగతికములనుగూర్చి యింకమీఁద దమకు విన్నపము లంపుకొనరాదనియు వ్రోసిపుచ్చి యట్లే దండూరావేయించిరట. దానిమీఁద నీకవిచెప్పిన శ్లోకము:

శ్లో॥ చోరస్సద్మోర్ధ్వభేదాదర రవిఘటనాత్తత్ప్రిఘూణాప్రఖానా,
దేడూకచ్ఛేదనాద్వావిశతి యదిగృహాంతత్రనో నోవిచారః,
కింత్వస్మాకంసురంగాకలనయితి పురే ఘోషయామాసయస్మా
త్తస్మాదేతత్సురంగాధిపఇతి బిరుదం ప్రోచురేతత్పురస్థాః.

5. తురుష్కులనుగూర్చి యీయన యీ క్రింది శ్లోకము చెప్పెనట!

శ్లో॥ తురకఃకరకశ్చైవ ద్వావేతౌ మలమోచకౌ,
తురకోదర్శనాదేవ కరకస్తునిషేవణాత్.

6. ఈయనకు రుక్మేశ్వరశాస్త్రిలను అన్నగారు గొప్పవిద్వాంసుడుండెను. వీరిరువురును రాజకార్యవశమున నొకప్పుడు విశాఖపట్టణమువచ్చి యక్కడ శిష్యులతో స్వయంపాకము చేసికొనుచుండిరి. ఒకనాఁడు రుక్మేశ్వరశాస్త్రిలు తమ్మునితో నిట్లనియె. "అబ్బీ, కూరగాయలకై బాజారునకు వెళ్లుచున్నాను. నేనేకూరతెచ్చినను యేదో యాక్షేపముచేయుచుందువు. నీకు సరిపడు పదార్థములు నాకు తెలియకున్నవి; నేడేమి తెమ్మందువో చెప్పుము" అనెను. మంగళేశ్వరశాస్త్రిలు కోపముతో నేతెమ్మన్నదితెచ్చెదరేని మాణిక్యముతెండు, అనెను. రుక్మేశ్వరశాస్త్రిలు చెప్పిన శ్లోకము:—

శ్లో॥ మాణిక్యక్రయణంలోకే మంగళాయభవేత్కిల,
మంగళేనసహాజేఽస్మాకం మాణిక్యాత్కింప్రయోజనమ్.

7. మంగళేశ్వరశాస్త్రిగారికి గోపాలశాస్త్రి యను కుమారుడు ప్రయోజకుఁడు విద్వాంసుడుండెను. తండ్రి జీవించియుండగానే యాతడు చనిపోయెను. ఎప్పుడును ఎల్లరను వెక్కిరించు స్వభావమే కలవాడగుటచేత గ్రామస్థులందరు నీయనను లోలోన ద్వేషించుచుండిరి. ఈయనను సాధింప వారికెన్నడును తఱిదొరకకుండెను. ఇప్పుడురా సమయమనుకొని వారెవ్వరును శవమును మోయరారైరి. అట్టి దుఃఖసమయమందుకూడ యీతని చాతుర్యము కుంఠితము కాలేదు. ఇట్లనెనట:—కొడుకు గోపాలశాస్త్రి బ్రతికీ నిర్వాహకుడే. చచ్చీ నిర్వాహకుడేయైనాడే:—ఈ కథను విశ్వగుణాదర్శాది గ్రంథకర్త శ్లేషయమక చక్రవర్తి అర్వాణిపాలెం వేంకటాచార్యులపేరఁ గొందరు చెప్పుచున్నారు.

8. విజయనగర ప్రభువైన నారాయణగజపతి సన్నిధానమునకు సమ్మానము వడయుటకై యొకప్పుడొక మాధ్వ పండితుఁడు

వచ్చెనట. రాజుగా రాయనవైదుష్యోన్మేషమును బరీక్షింపను బండిత సభ కూర్పించిరి. ఎందరో పండితు లందు వచ్చియుండిరి. మంగళే శ్వరశాస్త్రిలును బ్రచ్ఛన్నముగా నచ్చటికి వచ్చియుండెను. మాధ్వ పండితుఁడు మతవిషయోపన్యాసముచేయ ననుజ్ఞగొని యద్వైతవిశిష్టా ద్వైతములను ఖండింప నారంభించెను. అద్వైతము శాబ్దప్రమాణ బాధితమని చెప్పుచు "భిదాసత్యం భిదాసత్యం భిదాసత్యమ్" అని శ్రుతివాక్యమున్నట్టు వైదికస్వరముతోఁ బల్కెనట. తోడనే మంగ ళేశ్వరశాస్త్రిలు "భిదాసత్య మితియోవదతి స చండాలోభవతి స చండాలోభవతి స చండాలోభవతి" యని యంతకంటె రంజకముగా నుచ్చస్వరముతో శ్రుతిరీతిని బఠించెనట! అందఱు నబ్బపడి యీయన కేసిచూచిరి. రాజుగా రభిముఖులైరి. ఎక్కడిదీ శ్రుతివాక్య మని యడి గిరి. మంగళేశ్వరశాస్త్రి లిట్లు పలికెను: 'ప్రభూ! మన మాధ్వాచా ర్యులుగారు సెలవిచ్చిన శ్రుతివాక్యము పూర్వపక్షవాక్యము. ఇది సిద్ధాంతవాక్యము. రెండును ఒక యనువాకమందలివే. తొమ్మిదవ యట్టమునన్నవి. వారు పూర్వపక్షగ్రంథమువఱకే చదువుకొన్నారు కాఁబోలును! కనుక నీ గ్రంథము వారుదహరింపఁజాలక పోయినారు. నేను తొమ్మిదవ యట్టమును బూర్ణముగా నేకరువుపెట్టఁగల్గుదును,' అనెను. మాధ్వాచార్యులుగారి ముఖము మకమక లాడెను. అంతకు ముందు ప్రఖ్యాతినిబట్టి వినుకలిమాత్రమే కలిగియున్న మంగళేశ్వర శాస్త్రిల నప్పుడు కనుకలికలిగినందులకు సంతోషించి నారాయణగజ పతి చేరికయొసఁగి గౌరవించెను. అప్పుడు మంగళేశ్వరశాస్త్రిలీ శ్లోక ముతో రాజు నాశీర్వదించెను.

శ్లో॥ పూషవాడాన్వయాబ్ధీందో। స్వస్తినారాయణ ప్రభో।
నేత్రేగాత్రే తదాశ్రోత్రే। వక్త్రేపుష్పేషు శోభతే.

9. ఈ శ్లోకమందలి గుట్టును చక్కని సంస్కృత సాహిత్యము గలవారు గుర్తింపఁగల్గుదురు. శ్లోకచాతుర్యమునకు మెచ్చి రాజీయ నను మిక్కిలి సమ్మానించెను. ఆ సందర్భమందే "శాస్త్రిలుగారూ మీ పాండిత్యమునకును, జాతుర్యమునకును దగినట్టుగా లేదండీ ఇంటి పేరు, నడిమింటివారు. మొదటింటివారుగాక నడిమింటివారయితిరి" అనెనట. రాజుకు ఈయనపల్కిన బదులు: "ప్రభూ! ఏ యిల్లయినను బూసపాటి చేయదా ?"

10. మంగళేశ్వరశాస్త్రి లొకప్పుడు తమయూర నొకరియింట వివాహముహూర్తము జరుగుచుండఁగాఁ దాంబూలమునకు వెళ్లెను. మంగళసూత్రధారణ సమయమునఁ బురోహితుఁడు వరునిచే "మాంగ ల్యతంతునా నేనమమజీవన హేతునా! కంఠేబధ్నామిసుభగేత్వం జీవశరదాంశతమ్" అన్న శ్లోకమును బఠింపించుచుండెను. మంగ ళేశ్వరశాస్త్రిలు పెడదిరిగి యక్కడ నున్నవారితో మీ కీశ్లోక మున కర్థము తెలిసినదా యనెను. ఏదో కొంటెతనముండుననుకొని వారు తెలియలేదు సెలవిండని కోరిరి. శాస్త్రిలుగారుచేసిన యనర్థ మిది-మాంగల్యతంతు-న ఇది మాంగల్యతంతువు కాదు, నేను ముసలి ముండకొడుకను. ఇట్టినాకింక నెక్కడిమాంగల్యమనిభావము. అనేన మమ-జీవనహేతు. న (నా?) దీనిచే నాబ్రతుకుఁదెరువును జెడినది. రెండేకరాలో మూఁడేకరాలో ఉన్నయాస్తి కాస్త తెగ నమ్ముకొ న్నాను. జీవనోపాధిపోయినదనిభావము. కంఠే-బధ్నామి. నీకుత్రికకు త్రాడుకట్టుచున్నాను. నావల్ల నీకు సౌఖ్యములేదు సరికదా ఇదొక నిర్బంధముకూడ నీకు కల్గినది అని భావము. సుభగే-సుభగురాలా! (పరికరాలంకారము) త్వం-నీవు. సుభగురాలవు గనుక, శరదాం శతమ్=నూఱేండ్లపాటు, జీవ=జీవించుము.

11. విజయనగరసంస్థానమున నసంతరావను దుబాసియుండెను. ఏదోపనియుండి మంగళేశ్వరశాస్త్రి లాయనదగ్గఱ కేఁగెను. కుమార సంభవము చదువుచున్న శిష్యుఁడు వెంటనుండెను. అనంతరావుగారు పండితులచేఁ బొగడించుకొనఁ గోరికకలవాఁడని యీయన యెఱిఁగెను. ప్రాచీనశ్లోకములకు సందర్భానుసారముగా నానార్థములను జెప్పు చాతుర్యము మంగళేశ్వరశాస్త్రిలుగారికిఁ గలదని విని యనంతరావు గారును గోరిరి. ఏదేని శ్లోకమునకు వింతయర్థమును సెలవిండని:— మంగళేశ్వరశాస్త్రిలును వెంటనున్న శిష్యుడు చదువుచున్న కుమార సంభవశ్లోకము నెత్తుకొని యర్థముచెప్పెను.

శ్లో॥ అనంతరత్న ప్రభవస్యయస్య।
హిమన్న సౌభాగ్యవిలోపిజాతమ్,
ఏకోహిదోషో గుణసన్నిపాతే
నిమజ్జతీందోః కిరణేష్వివాంకః.

అర్థమిది: హేఅనంతరత్న=రత్నమువంటి ఓయనంతరాయా! హి=ఎందువలన, జాతమ్ = (నీయొక్క) పుట్టుక, మన్నసౌభాగ్య విలోపి=నా (మంగళేశ్వరశాస్త్రిల) యిబ్బందినితీర్చునది (నఞర్థక న శబ్దముతో సుప్సుపా, అన్నవిధినే సమాసము) యైనదో, అందువలన, అయస్య=శుభకర్మమునకు, ప్రభవసి=తగుచున్నావు (కాని) ఏకః= ఒక్కటి, అహిదోషః=సర్పదోషము, (కలదు.) అనఁగా సర్పమునకు రెండునాల్కలుండును. అట్లే, నీవు రెండుభాషలాడుదువు. (దుబాసి, ద్విభాషి), ఇది, గుణసన్నిపాతే=గుణసమూహమున, నిమజ్జతి= మునుఁగుచున్నది. ఇందోఃకిరణేషు=చంద్రకిరణములందు, అంకఇవ, కళంకమువలె :—

12. మంగళేశ్వరశాస్త్రిలుగారు జగన్నాథస్వామిని సేవింపఁ గోరి యొకతూరి పూరి (జగన్నాథక్షేత్రము) కరిగిరట! పాండిత్య ప్రఖ్యాతిని విని యక్కడి యోఢ్ర విద్వాంసులు వీరిని దర్శింప నరుగుదెంచిరి. అప్పుడీయన మంచి నిడుపును వెడలుపును గలమఱ్ఱియాకులను కోసికొనివచ్చి విస్తళ్లు కుట్టుచుండెను. జగన్నాథక్షేత్రమున కరిగినవారెవరును మఱ్ఱియాకు విస్తరిలో భుజింపరు. తర్వాతఁగూడ భుజింప రనఁగా నక్కడ నున్నప్పుడది యత్యంతము నిషిద్ధమే యగును గదా! ఈ కారణముచే నా క్షేత్రమున మఱ్ఱిచెట్లు చక్కఁగాఁ బెరిగి మంచియాకులతో నుండును. విలక్షణప్రతిభ గలవాఁ డగుటచే నీయన యా యాకులను కోసికొనివచ్చి విస్తళ్లుకుట్ట నారంభించెను. ఆ యోఢ్రపండితు లది చూచి శాస్త్రిలుగారి నాక్షేపించిరి. "అయ్యా! మఱ్ఱియాకులో భుజించుట నిషిద్ధము. అందును జగన్నాథ క్షేత్రమున భుజించుట యత్యంతనిషిద్ధము. అనుకరణీయమగు వర్తనముతో నుండవలసిన మీరిట్లుచేయుట పాడికాదు" అన శాస్త్రిలుగారు మఱ్ఱియాకులో భుజించుట యేల నిషిద్ధమయ్యెనని వారి నడిగిరి. "శ్రీనారాయణమూర్తి వటపత్రశాయి. స్వామివారికి శయ్యగా నగుటచే నత్యంత పూజ్యమయిన వటపత్రమున భుజించుట నిషిద్ధమగును. ఈ క్షేత్రము స్వామివారి యవతార క్షేత్రము. ఇక్కడ భుజించుట యత్యంత నిషిద్ధము" అని వారు బదులు చెప్పిరి. శాస్త్రిలుగారు వెడనవ్వు నవ్వి యిట్లనిరి. "ఇట్టి యవతార క్షేత్రమున శ్రీ స్వామివారి యవతారమూర్తులనే మడమడాయించి యాహారించుచున్న మీ కాయన శయ్యయైన వటపత్రమున భోజనము నిషిద్ధమాయెనా! సెబాసు"!— ఓఢ్రులు మత్స్యభుక్కులు. శ్రీ నారాయణమూర్తి మత్స్యావతారము నెత్తెను. కావున వారు శ్రీ నారాయణుని యవతారమూర్తులనే యారగించువారగుదురు —

శ్రీ శాస్త్రులుగారి కిట్టిదవు సమాధానమునకు వారు నిట్టూర్పు పుచ్చి యూరకుండిరి.

13. మంగళేశ్వరశాస్త్రులుగారి నొకప్పు డధికారగర్వితుఁ డగు నొక యభ్యాగతుఁడు చేయెత్తక 'నమస్కారమండీ' యనెనట. శాస్త్రులుగారు "దీర్ఘమాయురస్తు" అని యాశీర్వదించిరి. దీర్ఘమ్-ఆయుః-మాయుః అస్తు అనియు నిక్కడ రెండు దెఱఁగుల ఛేదముకల్గును. మొదటి విధమునకు దీర్ఘాయుష్మంతుడ వగుమని యర్థము. రెండవ విధమునకు నీకు గొప్ప పైత్యము కల్గుగాక యని యర్థము. శాస్త్రుల గారి శబ్దోచ్చారము ద్వితీయార్థస్ఫోరకముగానే యుండెను.

14. అట్లే మఱొకప్పు డొకయుద్యోగి యీయన గుమ్మము దాఁటి లోనికిఁ బోవుచుండఁగాఁ బరిహాసపూర్వకముగా 'దండాలండీ' అనెనట! మాటాడక శాస్త్రులుగారు లోనికరిగి కొంతసేపటికిఁ దిరిగి వచ్చిరి. ఆ యుద్యోగి యడిగెను: "శాస్త్రులుగారూ! మీరు విశేష జ్ఞులు. నమస్కరించినప్పుడు ప్రత్యభివాదము చేయవలదా" యని. కోపము చిప్పిలఁగా నీతఁ డిట్లు బదులు చెప్పెను. అయ్యా, మీరు గుమ్మమున కావల నొక కాలు, ఈవల నొక కాలు నుండఁగా నడుమ నమస్కరించితిరి. దానికి నేనేమి ప్రత్యభివాదము చేయుదును! ఇందు జుగుప్సిత మగునర్థ మున్నది. ఇట్టిదే యింకొకటి.

15. మంగళేశ్వరశాస్త్రులుగారు కుమార్తె నత్తవారింటికిఁ బంప వలసి యుండెను. ఈ సందర్భము విని బొబ్బిలిరాజుగారు వారిని సత్కరింపవలసినదిగా రాజపురుషుని కాజ్ఞాపించిరి. రాజాజ్ఞానుసార మాతఁ డేదో యీయవలసినది యిచ్చిపంపక వీరిని వికటముగాఁ బ్రశ్నించెను. 'అయ్యా, మీరు కుమార్తె నత్తవారింటికిఁ బంపునప్పు

జేమి పెట్టిపంపెదరండీ!' అని. ఈయన బదులు—'చి తము! మేము బీద బ్రాహ్మణులము! ఏమున్నది! ఇంత పసుపు కుంకుమ చీర రవిక యిచ్చి పంపెదము. తమవలె మేమేమి రాజాశ్రయసంపన్నులమా వేలు పెట్టి పంపుటకు ?'

16. నరసరాజును నాతనిమీఁదఁ జెప్పిన శ్లోకము :—

శ్లో॥ యాగక్రియార్థంఖలు వృత్తరాజో వర్ణక్రియార్థంఖలుభృంగ రాజః
తులాక్రియార్థంఖలు వి త్తరాజో న కించిదర్థం భువి నర్సరాజః

17. దక్షిణామూర్తి విగ్రహమును స్వర్ణకారుఁడు హరింపఁగాఁ జెప్పినది :—

శ్లో॥ భూత్వా పౌల్కసకాత్ ప్రపద్య రజకా నాభాష్య పౌరాణికాః
గానస్థాన ముపేత్య చాశుకరణా నాలింగ్య నత్వా కవీః,
వేశ్యాసద్మని సంప్రవిశ్యచ గతా వైద్యస్య పాణిగ్రహం
భూయో హంత సువర్ణకారసదనే సానంద మాస్తే మృషా॥



# చాటుపద్యమణిమంజరి

## కవిప్రశంసాస్తబకము

### తెలుఁగు కవులు

### వేములవాడ భీమకవి.

క. కూరడుగము కాయడుగము
నారయఁగా నుల్లి బచ్చ లల్ల మడుగ మా
పేరాముదపా కడిగినఁ
బౌరమ్మున నేసి నట్టి బాపఁడు ద్రెళ్లన్.

ఈతనిపద్యములు పెక్కులు 'మైలమ భీమన' మీఁదివి. అక్కడ చూచునది.

### శ్రీనాథ కవిసార్వభౌముఁడు.

కర్ణాటాధీశ్వరుఁడగు ప్రౌఢదేవరాయల నీతఁడు దర్శింపఁ బోయినప్పుడు చెప్పినపద్యము లీక్రిందివి క్రొత్తగాఁ జేకూరినవి. దేవరాయల యాస్థానమున ధర్మాధికారిగా ముమ్మకవి యనుపేరి విద్వత్కవి యుండెనట! ముందుగా శ్రీనాథుఁ డాకవీశ్వరుని దర్శించి యీక్రిందిపద్యములు చెప్పెనట!

సీ. వంపావిరూపాక్షుబహుజటాజూటికా
రగ్వధప్రసవసౌరభ్యములకు
తుంగభద్రాసముత్తుంగవీచీఘటా
గంభీరఘుమఘుమారంభములకు

కళసాపురప్రాంతకదళీవనాంతర
ద్రాక్షాలతాఫల స్తబకములకు
కర్ణాటకామినీకర్ణ హాటకరత్న
తాటంకయుగ ధాళధళ్యములకు

గీ. నిర్నిబంధనిబంధమై నెనయుకవిత
తెలుఁగునను సంస్కృతంబునఁ బలుకనేర్తు
ప్రౌఢదేవేంద్రరాయభూపాలవరుని
సమ్ముఖంబున దయఁజూడు ముమ్మసుకవి!

చ. తరువున గాండివం బిడఁడె ధర్మజునానఁ గిరీటి యేను వా
క్సరసిజనేత్రయానతి విచారముచొప్పున గర్వహీనతఁ
మరలి తెలుంగుభూమి కసమానగతిం గొనిపోవువాఁడనై
బిరుదులు నారివాఁగుకడఁ బెట్టితి సత్కవిసార్వభౌముఁడఁ

ముమ్మ కవియొడ నీవిధముగా నార్జవము నెఱపెను. పిదప రాయలసందర్శనమునకు జాగగుచుండఁగా రాయల కిట్లు వార్త పంపెను:—

సీ. డంబు సూపి ధరాతలంబుపైఁ దిరుగాడు
కవిమీఁదఁగాని నాకవచ (?) మేయ
దుష్ప్రయోగంబుల దొరకొని చెప్పెడు
కవిశిరస్సునఁగాని కాలు చాఁప
సంగీతసాహిత్యసరసవిద్యల నేర్చు
కవులతొమ్ములు గాని కాల్చి విడువ
చదివి చెప్పఁగ నేర్చి సభయందు విలసిల్లు
కవినోరుఁగాని ప్రక్కలుగఁ దన్న

గీ. దంటకవులకు బలువైనయింటిమగఁడఁ
గవులవాదంబు విన వేడ్క గల్గెనేని
నన్నుఁ బిలిపింపు మాస్థానసన్నిధికిని
లక్షణోపేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర!

రాయలసందర్శనము సమకూరెను. డిండిమభట్టు ప్రత్యర్థి పండితుఁడుగా నేర్పడెను. బాలను యువతినిఁ ప్రౌఢను లోలను గూర్చి రాజు నాల్గు సీసపద్యములు చెప్పఁగోరెను. శ్రీనాథుఁడు చెప్పెను. అందొకటి:—

సీ. కమనీయకరపల్లవము మేను గదియంగ
నొయ్యన చాఁచిన నులికిపడును
ఆలింగనమునకు నక్కునఁ జేర్చినఁ
జేదోయి యురముపైఁ జేర్చికొనును
చుంబనమ్మున కోష్ఠబింబంబు గమకింప
వదన మొయ్య నొకింత వంచుకొనును
గిలిగింత సేఁతకుఁ గినుకయు సిగ్గును
మొలవంగఁ గన్నులు మోడ్చుకొనును

గీ. అట్టిబాల రతిక్రీడ ననువుపఱుప
నేర్పుగల్గునె పరులకు నీకుఁగాక
రాజపరమేశ! రాజాధిరాజవిభవ!
లక్షణోపేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర!

డిండిమభట్టారకునితోడి వివాద మీసందర్భమందలిదె. ప్రత్యర్థిని జయించినపిదప శ్రీనాథుఁడు చెప్పినపద్యము లివి చేకూఱినవి.

మ. జననాథోత్తమ! దేవరాయనృపతీ! చక్రేశ! శ్రీవత్సలాం
ఛనసంకాశ! మహాప్రభావ! హరిరత్నోదకమ్! నాబోటికిన్
గునృపస్తోత్రసముద్భవం బయినవాగ్దోషంబు శాంతంబుగాఁ
గనకస్నానము చేసి కాక పొగడంగా శక్యమే దేవరన్.

కనకస్నానమహోత్సవము జరగినది.

శా. జోటీ! భారతి! యార్భటిన్ మెఱయుమీ! చోద్యంబుగా నేను గ
ర్నాటాధీశ్వరుఁ బ్రౌఢదేవనృపతిన్ నాసీరధాటీచమూ
కోటీఘోటకధట్టికాఘురపుటీకుట్టాకసంఘట్టన
స్ఫోటీధూతధరారజశ్ఛురితాంభోటిన్ బ్రశంసించెదన్.

ఇత్యాదిపద్యముల దేవరాయలను స్తుతించినాఁడు.

## కందుకూరి రుద్రకవి.

ఈ కవి విశ్వబ్రాహ్మణకులుఁడు. ఈయనవంశమువా రిప్పుడు కందుకూరిదగ్గఱనే చింతలపాలెమను గ్రామమున నున్నారు. రుద్రకవియనంతర మావంశమునకు "కవివారు" అని యుపనామ మేర్పడిన దఁట! నేఁటిదాఁక నా వంశమువారు "రుద్ర" నామము పారంపర్యముగాఁ బెట్టుకొనుచున్నారు. ఈ క్రింది విధమున రుద్రకవిచరిత్ర విషయ మావంశమువారిదగ్గఱఁ జేకూరినది:—

రుద్రకవి కృష్ణరాయలనాఁటివాఁడు. రాయలయాస్థానమున కీయనను దత్రత్యులు మంత్రులు రానీయరైరి. రాయలసన్నిహితభృత్యుఁడగు మంగల కొండోజి యనువాని తోడ్పాటున రాయల సందర్శనము పొనఁగఁగా రుద్రకవి యీ క్రిందిపద్యము చెప్పినాఁడు.

క. ఎంగిలిముచ్చుగులాములు
సంగతిగాఁ గులము చెఱుపఁ జనుదెంచి రయా
యింగిత మెఱిఁగినఘనుఁ డీ
మంగలకొండోజి మేలు మంత్రులకన్నన్.

క. ఆపలు కాలించి మహా
కోపంబునఁ దాతయాఖ్యకోవిదుఁ డనియెన్
"కాపల్లీ? తేవర్ణః
కోఽపితు? వద, కించ నామ గుణవ?" న్నని తాన్.

రుద్రుని వాక్యము.

ఉ. బంధురవిప్రవప్రగృహభాసురగోపురసౌధవీథికా
బంధుతటాకకూపపరిపక్వఫలాన్వితవృక్షవాటికా
గంధమదభ్రమద్భ్రమరగానవిహారికిఁ గందుకూరికిన్
సింధుపరీతభూములను జెప్పఁగ నొప్పగుసామ్య మబ్బునే.

సీ. వరనిజకర్మధూర్వహత బ్రాహ్మణులు మీర్
పరికింప నిలఁ బరబ్రహ్మ నేను
ఇనుముచేతను నొనర్చినశంఖచక్రాంక
గురువులు మీ ర్జగద్గురుఁడ నేను
దానప్రతిగ్రహాధీనబిరుదు మీది
వేషణీహనుమంత బిరుదు నాది
ఋషివంశభూషణశ్రేష్ఠులు మీరలు
కనకకుంతలపరిష్కారి నేను

గీ. అనుచుఁ దెల్పితి మామకఘనకులంబు
రాయలు వినంగ నంద ఱౌరా యనంగ
సత్కవులలోనఁ దాతయాచార్య! యేన
రూఢి కెక్కినకందుకూర్ రుద్రకవిని.

సీ. ఆమాట తప్తలోహశలాకతో దీటు
గా నాఁటి చెవిఁ బుట్టుకతిన బాధ
యిట్టట్టుగాఁ జేయ నిట్టూర్పు నిగిడించి
యూరకే తలయూఁచి హుంకరించె
తాతయ తా "నిషీ" దేతి వాక్కుడుగఁగా
రుద్రుఁ "డెక్కడ" నని రూఢిఁ బలికె
నపుడు "సమీచీన మద్య సమస్యా యి
మా వద" యని దుస్సమస్య లెన్ని

గీ. యిచ్చె నన్నిటిఁ బూరించె హృదయలసద
సూయఁ దాతయాజ్ఞైకవిధేయుఁ డైన
రాజుముం దతిజడగోషరక్త్రయూత్మ
వీక్ష నీక్షించి యిట్లనె దక్షుఁ డగుచు.

పూరించినసమస్య లీక్రిందివి యఁట:—తల లొకేక్కఁబదినాల్గు కానఁబడియెఁ దద్ద్వారివక్షంబునఁ — దుగ్ధపయోధిమధ్యమున — వక్త్రింబుల్ పది కన్నులైదు—అస్ఖలితబ్రహ్మచారి—ఉంద్రా వోరి దురాత్మక — [ఈ సమస్యలు మోచెర్లదత్తప్ప వెంకన్నకవులు పూరించిన వని వినికి. ఇవి యీవఱకు ముద్రితము లయినవి.]

ఉ. రింష్ట్రిహి యేమిటం గఱచు? ఋతువు లెక్కడపుంచు? నంధకున్
నంష్ట్రిసుఁ జేసె నేవిభుఁ? డనంతరమం దతఁ డేమి చేసె చే
రుంష్ట్రిఖిలాత్ముఁ డై నలవురూప మదేగతి నుండెఁ? జెప్పుమా
దంష్ట్రిలమీఁద శంకరుఁడు తాండవమాడెను రాముకైవడిన్.

క. పచ్చలు కెంపులు హేమము
నిచ్చలముగ విశ్వకర్మ నిర్మించె నయాం
యుచ్చులకొఱకై తాపిన
పచ్చనిరాచిలుకమీఁదఁ బచ్చిక మొలచెన్.

ఈ క్రిందివి రుద్రకవి కోపించి రాజుమీఁదఁ జెప్పిన పద్యములఁట :—

ఉ. తిట్టుదునా భుజంగవిషదిగ్ధదవానలధాగద్ధగచి
ట్చిట్టచిటార్భటిప్రకటశీఘ్రమహోగ్రతదంతనిష్ఠురో
ద్ఘట్టనవిస్ఫులింగలయకారణదారుణలబ్ధలుబ్ధరా
ట్పట్టణగోపురధ్వజనిపాతహతాహుతిగాఁగ నుద్ధతిన్.

ఉ. తిట్టుదునా మహోగ్రకరతీవ్రవచోవరగద్యపద్యసం
ఘట్టఘరట్టఘట్టవధగా విధి గాచిన నైన మానినీ
పట్టణవప్రసౌధమణిబంధురసింధురసైంధవాఢ్యులన్
బట్టపురాజులన్ దొరలఁ బండితులన్ దురహంకృతాత్ములన్.

ఉ. తిట్టుదునా మహోగ్రకరతీవ్రవచోవరగద్యపద్యసం
ఘట్టఫణీంద్రకోటిఘునకంఠవిషాగ్నుల రీతి మెట్టునన్
నెట్టనఁ దాఁకఁగా వలయు నిందయుఁ జేయక పద్య మిస్తినా
పట్టపురాజురీతి బహుభంగుల లెస్స సుఖింపఁగా వలెన్.

ఈవిధముగా సింహావలోకనముగా మూఁడుపద్యములను బలికెనఁట! రాయలు భయభ్రాంతుఁడై మీసామర్థ్యము మాకుఁ దెలియదాయె నని స్తుతియించెను. పిమ్మట నీశాన్యసింహాసనారూఢుని గావించెను.

[అనఁగా :— అష్టదిగ్గజము లనఁ బరగు కవీశ్వరు లెనమండ్రును రాయల యాస్థానమండపమున నెనిమిదిదిక్కులను నెనిమిది సింహాసనములపై వెలసియుండెడివా రని యగుచున్నది. అందు రుద్రకవి యీశాన్యసింహాసనమువాఁ డయినాఁడు.]

రుద్రకవి రాయలయాస్థానమునఁ బండ్రెండేండ్లు వసియించెను. సప్తకవు లనఁబరగు పెద్దన, తిమ్మన, పుత్తేటిరామభద్రయ, పింగళిసూరన, కవిరాట్టు, తెనాలిరామలింగయ, బట్టుమూర్తి యనువారితోఁ, దాతయాచార్యులతో నసేక విధముల వాగ్వాదములు సలిపెను. కవిరాట్టు ఎవ్వరో?

వరకవి కొండయ్య, ప్రెగడరాజు నరసరాజు సనునల్లుమామలు కవులు రుద్రకవి కవిత నాక్షేపించిరఁట. ఈక్రిందిపద్యములను రుద్రకవి చెప్పెనఁట :—

క. విదితంబుగఁ గవిరుద్రుని
సదమలవాగ్జనితశాస్త్రసంహితపదముల్
కుదిరిక తెలియక యూరక
వదరకురా వెఱ్ఱిముండ! వరకవి కొండా!

చ. "తెలియని వన్ని తప్పులని.—

[ఈపద్యము తెనాలి రామలింగనిపద్యముగాఁ బ్రఖ్యాతము. 'ఒకని కవిత్వమం దెనయు'ననుపద్య మింకొకటి దీనితోడిది రామలింగనిది కలదు.]

రుద్రకవికిఁ గొప్పోలు త్రిపురాంతకుఁడు, నాగళ్ళ చిట్టప్ప యనువారిర్వురు శిష్యులఁట! నవఘంటసురతాననుపండితునితో వాదించుచు క్రిందిపద్యమును శ్రీకృష్ణరాయలఁగూర్చి త్రిపురాంతకుఁడు చెప్పినాఁడట!

చ. గడియకు నూఱుపద్యము లఖండతరప్రతిభన్ ఘటింతునో
బడిబడి నూఱుఘంటములఁ బద్యములన్ లిఖియింతునో పదం
పడి వివిధాంధ్రభాషలఁ బ్రబంధము లొక్కొకనాఁడు చేతునో
యడుగుఁడి మీమనంబునకు హర్షము వేంకటకృష్ణభూవరా!

[ఇది కృష్ణరాయలఁగూర్చినది కామి స్పష్టము. మోచర్ల దత్తప్పగారి నాదరించిన తెట్టుప్రభువు, వేజెండ్ల-వేంకటకృష్ణరాజుగారిం గూర్చి చెప్పఁబడినది కాఁదగును. "తెట్టుకుమారకృష్ణ జగతీవరనందన రాజ్యలక్ష్మికిం బట్టు"—పై వేంకట కృష్ణరాజుగారు, ఎండ్లూరిప్రభు వగు మందపాటి రామచంద్రరాజుగారి మేనమామ]

చ. జబగడదష్టం, లణ్ణు, శషసత్రు, కపయ్యు, ఝభ, ఞటంచు వా
జబజబలెల్లఁ జేసి యగసాలెల బేలల బోయపాలెపుం
బబువులఁ దేల్చి చేతఁ గలపైకము దోఁచుటగాదు రుద్ర! నీ
డబడబ భద్రమంత్రియెదుటం గొనసాగదు పోకుపోకుమీ!

అని భద్రమంత్రి చెప్పఁగాఁ గొప్పోలుత్రిపురాంతకుఁ డిట్లు చెప్పెను :—

క. భద్రా! శ్వానము మొఱఁగిన
రుద్రాంకితజంగమయ్యరూఢికిఁ గొదువా
చిద్రూపుఁ డయినసాటౌ
ద్రుద్రుఁడయా కందుకూరిరుద్రుఁడు ధాత్రిన్.

చిట్టప్ప యిట్లు చెప్పినాఁడు.

క. రుద్రకవివాక్పటుత్వము
భద్రప్రదయుక్తిఁ దనరు భాసురలీలన్
రుద్రస్వరూపు నెదురను
క్షుద్రు లెదుర్కొనఁగఁ గలరె కుంభినిలోనన్.

"రవి గానఁ జోఁ గవి గాంచునే కదా." అన్నసమస్యను రుద్రకవియే పూరించినాఁడఁట. పెద్దనగారు రుద్రకవిని "తగురా కవిరుద్ర"యని యిట్లు ప్రశంసించిరఁట.

ఉ. వ్యగ్రకవిత్వతత్త్వచతురాస్యులు గైయటభాష్యఫక్కికా
నుగ్రహశక్తి కల్గినఘనుల్ కవు లెందఱు లేరు? నీదుప్ర
త్యగ్రవచోధురీణకవితల్ తగురా కవిరుద్ర! రుద్రఢ
క్కాగ్రసముజ్జ్వలస్ఫురితహల్లులకున్ స్వరపాళి కొజ్జలై.

శాకాబ్దములు 1480. జయసంవత్సర మాఘ శుద్ధ పంచమీ జయవాసరమున మల్కిబహిమ్ ప్రభువు రుద్రకవికి రెంటచింతల (చింతలపాలెము) గ్రామము నొసఁగినాఁడు. పై గ్రామము నేఁటికిని రుద్రకవివంశ్యులకే చెల్లుచున్నది.

శ్లో. అద్యాశీతిచతుశ్శతాధికసహస్రం సై శకాబ్దా గతా
స్త[అ]స్మిన్ శ్రీజయవత్సరే జయతిథౌ మాసేచ మాఘే తథా
పంచమ్యాం ద్వయతింత్రిణీజనపదం రుద్రస్య విద్వత్కవేః
ప్రీత్యా శ్రీయిభరామభూపతి రదాత్ క్షోణీధరాఖండలః.

సీ. ఇల శకవత్సరంబులు వేయునన్నూట
యెనుబదియును జనునెడ జయాబ్ద
మున మాఘమాసంబునను శుద్ధపంచమి
నాఁడు మల్కిభరామనరవరుండు
తగుకందుకూరిరుద్రకవీశునకు జరు
గుంబల్లిపురిని మాన్యం బొసంగె
నైఋతిభాగంబున న్బదేన్కుచ్చెళ్ల
పొల మది రెంటచింతల యనంగ

గీ. నలరు పురియుత్తరమునఁ దా నరయ జోగి
రాజుగారి పొలంబు పూర్వదిశ.యొడ్డె
వారిపొలము దక్షిణము పాలేరు పడమ
రమర గూడూరు పొలిమేర హద్దు లివియు.

మల్కిభరాము పొగడ్తపద్యములు :—

ఉ. రాసుతుఁ డైనమల్కియిభరామునికీర్తియు వెండికొండయుం
గ్రాసునఁ బెట్టి తూన్చ రజతాచల మెత్తున రాకయుండినం
భాసురలీల నిల్వ నల బ్రహ్మ సదాశివు జాహ్నవీపతిం
వాసుకికంకణుం బృషభవాహనుఁ జంద్రకళావతంసునిం.

చ. పొలుపుగ నంతరాళమునఁ బూచినపూవును బువ్వులోనఁ బిం
పలరినచెట్టు చెట్టుచిగురాకునఁ బండినపండు పంటిపై
కొలదలిపిందె పిందెగలకొమ్మయు నీకు దశావిభూతి ని
శ్చలసుఖ మాయువుం మతి నొసంగును మల్కిభరామ
భూవరా! (?)

ఈక్రిందిపద్యమున రుద్రకవి నెవరో ప్రశంసించిరి.

మ. హరి స్కాన్కందపురీజనార్దనువరం బందెన్ మహాసత్కవీ
శ్వరు లౌరాయలవారిసన్నిధిని హర్షంబందెఁ బట్టంబు గ
ట్టిరి యాందోళికలున్ జగ్రతరఘోటీ లగ్రహారంబు లం
దఱు చూడన్ బహుమాన మందెఁ గవిరుద్రాఖ్యుండు తా ము
[ఖ్యుఁడై.

"—దనుజమర్దన కందుకూరిజనార్దనా" అను మకుటము గల శృంగారపద్యాష్టకము (1భాగమున ముద్రితము) రుద్రకవికృతి యని వినికి. "బలవదరీదరీకుహరభాస్వదరీయదరీదరీ హరీ" యను మకుటము గల శతక మొకటి కూడ రుద్రకవికృతియే యని వినికి. అది సమగ్రముగా లభింప లేదు. మచ్చునకు మూఁడు పద్యములు మాత్రము :—

చ. కలశపయోనిమీఁదఁ దరఁగల్ మఱి హారనిద్రయా వేయుభం
గులతలపాన్పు పాము బుసకొట్టఁగ నేగతి నిద్ర చెందెదో
యలసతఁ దండ్రి చీమచిటుకన్నను నిద్దుర రాదు మాకు నో-బల.

చ. కలుషసరిత్తరీ పుషితగంధకరీ మహిభృత్కరీ భవా
చలభిదురీ దయారసవిశాలఝురీ నిగమార్థమాధురీ
ఖలగజకేసరీ విభవకంపితమేరుగిరీ లతాదరీ—బలవదరీ

చ. అలపగవానితమ్ముఁడు భయాతురుఁడై చనుదెంచినంతనే
బళిబళి వచ్చి తీవనుచుఁ బట్టము గట్టవె లంక కప్పుడే
కొలిచిన నిన్నె కొల్వవలెఁ గోరిక లిచ్చిన నీవ యీవలెన్—బల

పంచరత్నము లనుపేర జనార్దనస్తోత్ర మొకటి రుద్రకవి కృతి యున్నది. ఒక్కపద్యము.

పంచ. అనాథనాథ నాగతల్ప యజ్ఞకల్ప మానిరం
జనా జనార్తినాశనా దిశావరీవృథార్ధశా
సనా సనాతనా యనాదిసత్య కందుకూరిశ్రీ
జనార్దనా జనార్దనా ససాహసారిమర్దనా!

సుగ్రీవవిజయ మను యక్షగానమును నిరంకుశోపాఖ్యాన మను రసవత్ప్రబంధమును రుద్రకవికృతులు లోకమున వ్యాపించియున్నవి. ‹‹మావంశమున రుద్రకవి నామధారులు పలువురున్నారు. కృష్ణరాయలనాఁటివాఁడు ప్రథమ రుద్రకవి. ఇబ్రహీంనాఁటివాఁడు ద్వితీయ రుద్రకవి. వారికిఁ దర్వాతఁ గూడఁ గవిత నేర్చినరుద్రకవు లున్నా’’రని యిప్పటివారు రుద్రకవివంశ్యులు చెప్పుచున్నారు. శ్రీకృష్ణరాయలు క్రీ. 1530-న స్వర్గస్థుఁడయ్యెను. ఇబ్రహీంపాదుషా క్రీ. 1558 రుద్రకవి కిచ్చిన గ్రామము నేఁటికి ననుభూయమానముగా నున్నది. కాన యిబ్రహీంకాలమున రుద్రకవి యుండుట సునిశ్చితము. నిరంకుశోపాఖ్యాన కర్త యీతఁడు కాఁదగును. వేశ్యావర్ణనమున నాగ్రంథమందు సీసపాద మొకటి యిట్లున్నది ‹‹చేరి కన్నడభూమి చెఱపట్టు పాశ్చాత్యనృపతికైన నొకింత కృప తలిర్చు.’’—ఇట్లుండుటఁబట్టి యీ గ్రంథము విద్యానగరవినాశానంతరము రచింపఁబడినది కాఁదగు ననఁదగును. ఈతఁడే బాలుఁడుగాఁ గృష్ణరాయలనాఁటఁగూడ నున్నాఁడేమో! లేక యీతని తాత వేఱొకఁడే యానాఁట నున్నాఁడో! కృష్ణరాయల నాఁట రుద్రకవి యుండెననుట కాధారముగా మీఁద నుదాహరింపఁబడిన యాభాణకములకుఁ బద్యములకుఁ బరమ ప్రామాణ్య మంగీకరింపరాదు. ఆ పద్యములు కొన్ని యిటీవలివారావంశమునారే యైతిహ్యములనుబట్టి రచించియుందురు.

రుద్రకవివంశ్యు లిటీవలివారు రచించినపద్యము లివి కొన్ని:—

క. ఈసారికి వైశాఖపు
మాసానకు లక్ష్మి తొలఁగి మతిచెడి భ్రష్టై
వీసానకుఁ గొఱగాకయు
ఖాసారామన్న నల్లకాడుం జేరున్.

సీ. భాసిల్లునిభరాముపట్టభద్రుం డిచ్చె
భూదానశాసనపుణ్యలేఖ
వసియించు దిక్కుల వరకీర్తి యగునని
రసికశేఖరుఁడనె రమణతోడ
కరమొప్పు కాశికాపురముతో సరియగు
స్కాందపట్టణసీమ గడిఁదిఁ జెలఁగు
నరణి జేరై నట్టెజరుగుమల్లిపాలానఁ
దుదఁ బదేకుచ్చెళ్లు దొరయ నొసఁగ
బహుకాలమును బుత్త్రపౌత్త్రాభివృద్ధిగా
ననుభవించు మటంచు నానతిచ్చె
నిట్లు మేమిడుభూమి యించుకం తైనను
నాశ చెందినవారు కాశిలోన

గీ. విప్రగోవధ చేసిన విధి విధించు
పాపమునఁ జెంది మక్కాను బందిఁ జంపి
మేటి యగునానల నొసంగి మెసఁగినట్లు [?]
కందుకురిరుద్రఘనులకుఁ గరుణ నొసఁగ.

సీ. శ్రీలలరఁగ రెంటచింతలఖండ్రిక
కేవలప్రభుఁడు మల్కిభరాముఁ
డలరుద్రకవికి నత్యంత మా ప్రేమచే
నీనా మొసంగిన నివల మఱియు
తానీష పాచ్ఛావు తనరార నడపించె
వెనుక తావుష్ఖానుఁ డనువు మీఱ
దయచేసెఁ బిమ్మటఁ దగఁ బాల్ఫఖానుఁడు
నతనికిఁ బిదప నింపలరఁగాను
సాతులాఖానుఁడు సాహెబు మన్నించెఁ
దగనొప్పె నైదుముస్తాఖనుండు
గరిమతో ననవర్తిఖానుఁడు కృప నిచ్చె
కడుసురాజిద్దవుల్ గారు నిడిరి
త్రావరుసఁ బ్రభు లీవల దయచేసి
నందుకు సాక్షి యీనానుభవంబు
దీనికిఁ గొర్లశీతిద్వయంబై యొప్పు
శ్రీజనార్దనవరశ్రీఁ జెలంగు
కవిరుద్రఘను నలఖండ్రిక ఫలభోక్త
లీరేడు పూరుషు లీవలయిరి
రుద్రాఖ్య, కవితయు, రూఢి తత్కులమందుఁ
దత్కులీనుల మేము దానికడను
క్షీరనదీతటక్షేత్రమందుఁ దపంబు
గావించుభవదీయకవులమయ్య

గీ. భూరిసుకవీంద్ర మందారమేరుధీర
చారుగుణశీల సత్క్రియాసత్యలోల
పల్లెచెంచలరాయ! సత్ప్రభువిధేయ!

రుద్రకవి విషయ మప్పకవీయమున నిట్లు కలదు:

చ. కొలఁదిగ మున్ను చెప్పెఁ జలిగొండనృసింహుఁడు వెల్లయంచు నీ
వల నగసాలిరుద్ర పనువాఁడును మొల్క యటంచుఁ గూరిచెన్
దెలియక కొందఱిట్లు విశ్రుతిన్ బదమధ్యమునన్ లకారరే
ఫలతలపై యకారమును బాపుదు రార్యులు నవ్వునట్లుగన్.

ఇందుకు వినుకొండలో గుంటుపల్లి భాస్కరయగారి సమ్ముఖమందుఁ గందుకూరి రుద్రయగారు చెప్పినపద్యము—

చ. వెలగకు వెల్లయంచు నరవిం జలిగొండనృసింహుఁ డాడఁగా,
మొలకకు మొల్కయంచుఁ గవిముఖ్యుఁడు రుద్రయ పల్క దోసమా?
భళి భళి మంచిమాటయె ప్రబంధము నా జలరాశి యందులో
పల నెఱసు ల్గ్రహింతురె యపారము లౌమణు లెల్ల నుండఁగన్.

మొల్క యనుప్రయోగము గలపద్య మిది—

ఉ. ఎన్నఁడు నేరిచెన్ బెళుకు లీచెలికన్నులు, కారుమబ్బు ల
న్నన్న! కురుల్, పిఱుందు పటువై పటువై ఖరిఁ గై కొనెంగదే,
మొన్నగదమ్మ పిన్న మొలమొల్కలు నేఁడివె ముద్దులాడి లేఁ
జన్నులు మిన్నలై పయఁటనందున దాఁగురుమూఁత లాడెడున్.

అల్లసాని పెద్దన్న

హరుఁ డధికుండు వింటికిఁ బురాంతకుకంటెఁ గిరీటి మేటి శం
కరపురుహూతనందనులకంటెను రాముఁడు నేర్పు నిందుశే
ఖరకపికేతుభార్గవులకంటెఁ గుమారుఁడు మీఱు నంబికా
వర నర జామదగ్న్య శిఖవాహుల కెక్కుడు రాఘవుం డిలన్.

రెండవపాదాన నిత్యసమాసము, మూఁడవపాదాన అఖండము,

కంకంటి పాపరాజు

గీ. ఒంటిమిట్టను గోపురం బున్నయట్టి
సిద్ధసానికి సంకల్పసిద్ధి రస్తు
చెలఁగి నామీఁదఁ బద్యంబు చెప్పినట్టి
పాపరాజుకు సంగమప్రాప్తి రస్తు.

తెనాలి రామలింగ కవి

క. ఒడ్డారపునాకొడుకులు
దొడ్డదొరల్ కవుల కీయ దొరకొనుచోఁ దా
మడ్డాలె వచ్చుచుందురు
ముడ్డా చూచెదవు భట్టుమూర్తనగారూ!

అళియరామరాయలకు వాయురోగము రాఁగా అంతఃపుర స్త్రీలతోఁ జెప్పినది:

క. ఓయమ్మలాల మందులు
వే యేల మకారకొమ్ము విషకవిగానిఁ
వా యెత్తకుండఁ జేసిన
వా యెత్తదు రామరాయవసుధేశునకుఁ.

మకారకొమ్ము విషకవి = మూర్తికవి, వాయి = వాయురోగము.

బెణక కవి

ఉ. శ్రీనరసింహదేవునివిశేషకృపఁ రచియింప నేర్తు నో
మానవనాథులార! నను మక్కువ సేయుచు నాదరింపుఁడీ
మానితవెన్ని నామకులమాన్యుఁడ భీమయమంత్రిపుత్రుఁడఁ
మాసిభశంకరాంబసుకుమారుఁడఁ బెణ్కపకాఖ్యసత్కవిఁ.

గీ. రాగగరిమ లెఱిఁగి రహిమీఱఁ బదములు
పాడ నేర్తు ద్విపదపద్యఫణితి
తెలిసి చదువ నేర్తు ధీమంతు లవునన
బేర్మి భీమయాఖ్య బెణకకవిని.

ఈతఁడుశా - శక 1621 ప్రమాదిసంవత్సరము నాఁటివాఁడు - తాడిపర్తి తాలూకా సుమంచిపల్లె బొందలదిన్నె గ్రామముల పొలమేరలసందున రాతిబండపైఁ బయి పద్యము లీ కవి చెక్కించు కొన్నాఁడు.

క్షేత్రయకవి

క. తముఁదామె వత్తు రర్థులు
క్రమ మెఱిఁగినదాతకడకు రమ్మన్నారా
కమలంబు లున్నకొలనికి
భ్రమరంబుల నచ్యుతేంద్రరఘునాథనృపా !

" ఇతి మువ్వగోపాలభక్తేన క్షేత్రకవినా ఉక్తత్వాచ్చ"
ఆంధ్రకౌముది.

కూచిమంచితిమ్మకవి

మ. కవివిద్వద్ధరణీసుధాశనవరుల్ కార్యార్థులై తన్నుఁ డా
సి వడిన్ జేతులు దోసిలించుకొని యాశీర్వాదముల్ సేయ నె
క్కువ దర్పంబున నిట్టటుల్ గదలకే కొఱ్ఱమింగినట్లుండువా
రవనిన్ దుర్నృపు లేమి యీఁగలరొ భర్గా ! పార్వతీవల్లభా !

## వక్కలంక వీరభద్రకవి

సీ. అతఁడు రాజకిరీటుఁ డఖిలరాజకిరీట
ఘటితపదాబ్జసంగతులు మీరు
అతఁడు వారణదూరుఁ డఖిలవారణరాజ
గణసమాకులపురాంగణులు మీరు
అతఁ డాదిభిక్షుఁడు తతభిక్షుకానీక
యాచితార్థప్రదాయకులు మీరు
అతఁడు సర్వజ్ఞుఁ డంచితనైకసర్వజ్ఞ
పూజనీయసమస్తబుధులు మీరు

గీ. భళిర మీతోటిసాటి కేపాటిమేటి
సర్వలోకేశ్వరుం (డనఁ జనెడుశివుఁడు)
వత్సవాయజగత్పతీశ్వరతనూజ !
ఘనసుగుణసాంద్ర ! జగపతిక్ష్మాతలేంద్ర !

సీ. అంబుజం బిల్లుగా హర్షించుపువుఁబోణి
ధరజగజ్జఠరనిర్భరవటుహరి
హరశేషచ్ఛాయ నాకతారశ్రేణి ?
ధరశార్ఙ్గధరుబొడ్డుదనరుకొడుకు
భూరిసింహము గుఱ్ఱముగ రూఢిఁ గలచేడె
దక్షమఘక్షయాద్ధత్యబలుఁడు
రథగజతురగభద్రజయాయురక్షతా

... ... ... ...

గీ. సంతతోత్సవశాలివై జగతి లేవ
నలరు మిల వక్కలంకవీరయను బ్రోవు
వత్సవయరాయ గజపతీశ్వరతనూజ
రాయజగపతిరాజ ! గోత్రాబిడౌజ !

## దిట్టకవి తిప్పన

గీ. దిట్టకవిప్రసిద్ధి గలతిప్పన సత్కవిసార్వభౌముఁ డౌ
నెట్టనినం గవిత్వమున నెవ్వరు వానికి నీడు గామిఁ దాఁ
గట్టినగోచిదక్క నొకకానియు డాఁపక యర్థికోటికిన్
బెట్టుట బాపురే బిరుదు వెట్టిన వారిక చెల్లు నుర్వరన్.

## పుష్పగిరి తిమ్మకవి

ఈయన ములికినాటి బ్రాహ్మణుఁడు. నెల్లూరిమండలమందలి మోడెగుంటలో నున్నవాఁడు. ఈయనకృతులుగా సమీరకుమార విజయము, కొన్నిశతకములు నుపలబ్ధములు. కంకంటిపాపరాజు నుత్తరరామాయణ మీయన రచియించినదే యని లోకప్రతీతి. సమీరకుమారవిజయమునకు నుత్తరరామాయణమునకు శైలీభేదము గోచరించుటచే నా ప్రతీతి విశ్వాస్యము కానేరదని కొందఱవాదము. గ్రంథద్వయమందలి పద్యైక్యము వారు పాటింపరు. తిమ్మకవి నివాసగ్రామముచేరువ నుపలబ్ధమయిన యొకప్రాఁత వ్రాఁతపుస్తకమున గ్రంథాంతగద్యమున, పాపరాజప్రమోదసంపాదనార్థము, తిమ్మకవి రచియించినట్లున్నది. తిమ్మకవి సాహాయ్యముచే నానాఁడు మఱియుఁ గొందఱు కవులలో గణన గాంచిరి. ద్విపదభాగవతకర్త తేకుమళ్ల రంగశాయికవి యిట్టివాఁడు.

మ. కమనీయం బగునీదుకావ్యరస మాకర్ణించి నానాబుధుల్
సముఁడౌ నీతఁడు పూర్వసత్కవులకున్ సాబాసు గే యంచు స్తో
త్రము గావింతురు శంభుజూటతటినీరంగత్తరంగార్భటిన్
మమతాహంకృతిదూర! పుష్పగిరితిమ్మా! సత్కవిగ్రామణీ!

అడిదము సూరకవి

చ. ఇరువదిమూఁడుపూరుషము లిప్పటి కయ్యెఁ గవిత్వవృత్తిచే
నరపతు లెల్ల మెచ్చఁ బదునాలుతరంబులు మించుపిమ్మటన్
వెరవగు జీవనస్థితి లభించుట తొమ్మిది యయ్యెఁ బూరుషాం
తరములు నిక్కలింగవసుధాధవుచెంగట నాశ్రయించుటల్.

పూసపాటి పెద్దవిజయరామమహారాజుగారు బొబ్బిలి ఖానుతోడి యుద్ధమునుండి తిరిగివచ్చుచుండఁగాఁ ద్రోవలోఁ జూచి సూరకవి చెప్పినపద్య మిది యొకటి!

సీ. గరిడీలలోపల గంతు వేయుట కేమి
యీఁటె పట్టి యరిపై దాఁటవలెను
సొగసుగ మొలకత్తి బిగియఁ జెక్కుట కేమి
వెఱవక వైరుల నఱకవలెను
మాటిమాటికిఁ బెడ్డమాట లాడుట కేమి
యదలించి రిపులఁ జెండాడవలెను
తొమ్మన నెత్తుగందమ్ము పూయుట కేమి
గాయంపునెత్తురుల్ గ్రమ్మవలెను

గీ. కాని లేకున్న సత్కీర్తికాంత గలదె
పూసపాటికులాంభోధిపూర్ణసోమ!
సమరజయభీమ! గజపతిసార్వభౌమ!
విమలసద్గుణరామ! శ్రీవిజయరామ!

సూరకవి తన శిష్యులఁగూర్చి చెప్పినదఁట:—

గీ. పారమందిరి యక్కినపల్లివారు
దుక్కిచేతను దీర దెందువుల కెల్ల
దూసి కృష్ణుండు చదువంటె దుఃఖపడును
ధీరుఁడై నిల్చె మురపాక సూరసుకవి.

చింతకాయ లిచ్చినవానిమీఁదిపద్యము—

గీ. బండ్లు నోడలు పట్టవు పలుకులైతె
చేరి వేఁడిన నీఁడాయెఁ జింతకాయ
కొండశంభాములో రాచకొండుకన్న
శంబమున మేలు లేదాని సన్నిధానఁగు.

బాచన్నమీఁది పద్యము—

క. బాచా బూచులలోపల
బాచన్నే పెద్దబూచి పల్లుఁ దానుఁ
బూచంటె రాత్రి వెఱతురు
బాచన్నను జూచి పట్టపగలే వెఱతుర్.

శృంగవరపుఁగోట జమీనుదారు రాజభూపాలరాజుగారు విజయనగరపు పూసపాటివారితోఁ బోరాడఁబూనఁగాఁ జెప్పిన పద్యము—

గీ. విజయరామమహారాజవీరుఁ డేలు
పట్టములికించె రాజభూపాలరాజు
కడను మాటల కేమి యీకాలమునను
బుత్తి నవ్వేను బులితోఁక గొత్తి కఱచె.

పర్లాకిమిడిరాజుగారిమీఁదఁ జెప్పినపద్యములు—

క. గోవిందద్వావశివలె
నే వచ్చితి రాకరాక నీనగరికి నో
పావనగుణ నారాయణ
దేవుమహారాజ సాహితీనవభోజా.

క. నీ విచ్చు బత్తె కర్ణా ర్క
భూవల్లభుఁ డిచ్చు త్యాగమున కైన వచ్చున్
బావనగుణ నారాయణ
దేవుమహారాజ సాహితీనవభోజా.

క. వారిధికిని వారిధియే
మేరునగంబునకు సాటి మేరునగంబే
నారాయణదేవునకు సరి
నారాయణదేవు గాక నరపతు లెదురా.

పాలకొండను గూర్చి చెప్పినది—

శా. రాజా జారుఁడు మంత్రి నిర్దయుఁడు నీరాష్ట్రంబులోఁ బెద్దలా
కోజుల్ కొండలు జీవహింసకును సంకోచింప రెవ్వారికిన్
దాజీ మీాయరు పాలకొండపురిలో దాక్షిణ్యశూన్యత్వ మీా
ఫాజీపట్టణ మేల వచ్చితిని నాపాపంబు సర్వేశ్వరా.

మ. నరసింగుండును వెంకుపాతుఁడును గృష్ణాపాతుఁడున్ నాయుఁడున్
శరభాపాతుఁడు పాలకొండధరణీసామ్రాజ్యధౌరేయులై
ధర వర్ధిల్లెడు రామభద్రనృపునాస్థానంబునం బంచముల్
చిరకాలంబుగ వీరివెంటఁ దిరుగన్ జీచీ మనం బొప్పునే.

బత్తుల - అయ్యన్న యనుదాతనుగూర్చి చెప్పినవానిలో—

క. ఇచ్చెడువానికి రణమునఁ
జొచ్చెడువానికిని గాక సురుచిరకీర్తుల్
వచ్చునె పందకు లోభికిఁ
బచ్చనివిల్కాఁడ వయ్య బత్తులయయ్యా!

గీ. చేదుఁ బట్టువేళఁ జెలఁగి యేడ్చును బిడ్డ
యంత కంత సుఖము నదియె యిచ్చు
నర్థి యడుగువేళ నది కష్ట మనిపించు
ననఘచరిత బత్తులయ్యనార్య.

పాలకొండ ప్రాంతమునుగూర్చి—

శా. క్షేమాకీర్ణవికీర్ణధామములు నక్షీణేక్షురంభాటవీ
స్తోమంబుల్ బహుశాలిధాన్యతతు లెచ్చోటన్ నదీమాతృక
గ్రామంబుల్ బహుళాగ్రహారము లనేకంబుల్ ధరం జూడఁగాఁ
క్షామం బన్నది లేదు శ్రీరగిరిదేశంబందు నెందేనియున్.

కొట్రబాలకవియు సూరకవియు సమకాలమువారు. వీరిద్వర
వాగ్ధాటి కోడి పర్వతా లనుపేరు గలకవి యొకఁ డూడనిఁబాడెను.

గీ. నరునినొగలమీఁద హరి యున్నచందాన
సూరకవివరేణ్యుజోగఁ గూడు
కొట్రబాలకవియుఖంత వాగ్ధాటికిఁ
బర్వతాలుగాఁడు పాటిపోయె.

ఒకప్పుడు సూరకవి బోయదొంగలబారినుండి తప్పించుకొని చెప్పినది—

మ. హనుమంతుం డెదుటన్ దివాకరసుతుం డాచెంత సౌమిత్రియున్
దను సేవింపఁగ జానకీవిభుఁడు వాత్సల్యంబుతో నిల్చి యిం
పున నన్నెప్పుడు గాచుచుండఁగను నీబోయాధముల్ కిన్కచే
ననుఁ జంపంగలవారె రావుకులజన్మా! రంగ రాయోత్తమా!

గంటము చేసి యిచ్చినకమసాలిమీఁదఁ జెప్పినది.

క. ముల్లోకంబుల నాలుక
పల్లి పరశురాముకీర్తి ప్రబలి వెలుంగన్
మల్లీసుమవల్లిన్ జా
బిల్లిన్ మఱి పాలవెల్లి భీష్ముని తల్లిన్.

మన్నె దొరలమీఁది పద్యములు—

క. అర్బుదములు న్యర్బుదములు
బర్బరదేశాధిపతులు పడిగాపులు నీ
దర్బారునఁ బడియుందురు
దోర్బలసంపన్న మన్నె దొరయెరకన్నా.

క. ధీరాగ్రణి శివరామ
క్ష్మారమణుం డేలు చెముడు శంభరపురమా
పోరామారొంపిల్లా
పారాదామంగరాజ పాళెముపట్లా!

సమస్య

ఉ. సారతరప్రబంధములు లసంఖ్యముగా నొనరించునట్టియా
సూరకవీంద్రుని౦ జనిగి చూత మటంచును మాటిమాటికిన్
ఊరసమెత్తి దుష్కృతుల నిచ్చినవారల నోరు మొత్తుఁడీ
మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీర లందఱున్.

తన్నాదరించిన పొన్నుపాటి వేంకటమంత్రి స్వర్గస్థుఁడు కాఁగాఁ జెప్పినది.

మ. కరుణాసాగరుఁ బొన్నుపాటికులవేంకట్రామదాసున్ వసుం
ధరయందుంచక స్వర్గలోకమునకుం దర్లించినా వేమి? త
త్పురిఁ గల్పాదులు లేవె యాచకులకున్? భూయాచకశ్రేణి కె
వ్వరు దిక్కీమిది మొండిజగ్గడవు కావా? వెఱ్ఱినై పల్కితిన్

## కొట్ర బాల (భాస్కర) కవి

**ఈయననుగూర్చి యొకానొకబట్టుకవి చెప్పినది.**

శా. భట్రాజుల్ నిరసించి పద్యములు చెప్పంబూనుచో మేటి సా
చట్రాతింబలె నున్నవానికిని నిచ్చల్ తెల్వి పుట్టించు నే
కుట్రల్ నేరనిసత్యసంధుఁ డని లోకుల్ మెచ్చ వర్తించు నీ
కొట్రాబాలకవీందుశేఖరుఁడు మాకుం బూజ్యుఁ డెల్లప్పుడున్.

[ఆబట్టుకవి అడిదము సూరకవినిగూర్చి చెప్పినపద్యములు]

క. అంతా కవులము గామా
అంతింతో పద్యసమితి నల్లఁగ లేమా
దంతివి నీతో సమమా
కాంతాసుమబాణ! సూరకవి నెఱజాణా!

క. రవి యెఱుఁగును భువితత్త్వము
భువిలోపల జనుల నెల్ల బోషించు సదా
శివుఁ డెఱుఁగు నాత్మతత్త్వము
కవితాతత్త్వంబు సూరకవియే యెఱుఁగున్.

## కృష్టిపాటి - వేంకటసుబ్బకవి

ఈయన కర్నూలు మండలవాసి. ఇప్పటికి డెబ్బదియేండ్లకుఁ బూర్వమున్నవాఁడు. మహానందిక్షేత్రమున జగద్గురుశ్రీ (పుష్పగిరి) శంకరభారతీస్వామి సన్నిధిని బ్రాహ్మణసమారాధనము జరుగుచుండు వేళఁ గుంభవర్షము గురియ నారంభింపగాఁ గవిత్వమహత్త్వముచే నావర్షబాధఁ దొలఁగించి శ్రీవారిచే గొప్ప సన్మానముఁ బడసినాఁడట! అప్పటి పద్యము లివి:—

ఉ. గోండ్రలు పెట్టి మేఘుఁ డతికోపమునన్ గురియంగఁ జొచ్చె మా
తండ్రి! మరుత్తనూజ! నను దబ్బఱకాఁడని యెంచకుండ నీ
వేండ్రము నీవె మాన్పవలె వేయువిధంబులఁ గాకయున్న మీ
తండ్రికినైనఁ జెప్పి జలదప్రతిబంధము మాన్పు మారుతీ!

శా. విద్యుత్పింగళమంగళేక్షణకృపావిస్ఫూర్త శ్రీకృష్టిపా
డ్విద్వద్వేంకటసుబ్బసూరికవితోద్వృత్తత్వ మాలించి నీ
విద్యుద్గర్జనభర్జనాదు లడరన్ వేమాఱు వర్షింపకే
విద్యాశంకరభారతీవిజయముల్ విక్రాంతి వాటిల్లఁగాన్!

నశ్యమునుగూర్చి యీయనకును ఉయ్యాలవాడ నారసింహా రెడ్డిగారి యాస్థానపండితుఁ డగునోబళాచార్యులకును జరిగినసంభాషణ పద్యము లివి—

ఉ. సస్యము లేదుగా! పవననందనసన్న్యకటాక్షవీక్షణా
పశ్యవరప్రభావవిభవానుభవాద్భుతభూమిభృద్ధనుః
కైశ్యఘుమంఘుమంఘుమితగాంగఝురీవిలుఠత్తరంగసా
దృశ్యకవిత్వతత్త్వముఖరీకృతవేంకటసుబ్బసూరికిన్

శా. క్షోక్షో! నస్య మవశ్య మీశ్వరజటాకోటీరటద్ద్యోధునీ
ప్రాకాశోర్మిసకాశపేశలసుశబ్దప్రక్రియోపక్రమా
నేకగ్రంథనిబంధనార్జితసమున్నిద్రప్రతాపప్రథా
స్తోకశ్రీకర కృష్టిపాటికులసింధుస్వచ్ఛచంద్రోదయా!

## అల్లమరాజు - సుబ్రహ్మణ్యకవి

ఈయన యిప్పటికి ముప్పదేండ్లకు ముందున్న గొప్పకవి. బహుగ్రంథకర్త. పీఠికాపురాధీశ్వరుఁ డగురావు వేంకటమహీపతి గంగాధరరామారాయప్రభునిచే సమ్మానితుఁడు. ప్రభునామమును బొందించి యాశువుగా నీకవి చెప్పినపద్యము.

క. శ్రీధర శౌరీ వైకుం
ఠాధర శ్రీరావువేంకటమహీధరగం
గాధర రామారాయ
ప్రాంధరునిం బ్రోవు మెపుడుఁ గరుణాదృష్టిన్.

కాట్రావులపల్లె యుప్పునీటి నూతులఁ గూర్చి చెప్పిన పద్యము.

క. దేవాసురు లబ్ధిఁ దరువ
నావిర్భూత మయి హాలహల మపుడు మహా
దేవునకున్ భీతిలి కా
ట్రావులపలినూతులందు డాఁగెను జుండీ.

వైదికుని కవిత్వము నాక్షేపించువారిఁగూర్చి చెప్పినది:—

ఉ. చందనశాఖకన్న విరసం బగుబూరుగు మేలటన్న రీ
విం దగినట్లు వైదికకవిత్వసుధారసధార లెల్లఁ జె
ల్వొందఁగ భూతలంబున నియోగికవిత్వముతోడ సాటిరా
దందురు బెట్టిదం బగు నటందురు కొందఱు మూఢమానవుల్

బుక్కపట్నం తిరుమల తాతాచార్యులు

ఈతఁడు రేఁతగా బూతుఁబద్దెములను జెప్పుచుండువాఁడఁట! ఒకప్పు డొకశాస్త్రి నాయన మడిగి ఎల్లవిశ్వగుణాదర్శకర్త యీయన లేదనఁగాఁ గోపించి యీ క్రింది పద్యము చెప్పెను.

క. శాస్త్రులట యీనీఁచునకు
పాస్త్రాత్తులమగఁడు వీనిపరువేమో కా
కాస్తంత నస్య మడిగిన
నాస్తే యని పలుక వీనినాలుకవీఁకా.

ఇట్టి చెట్టతికమునకు నేవగించి వేఱొకకవి దూఱి చెప్పిన పద్యము—

గీ. అహహా తిరుమలవంశంబు నడవిఁ గలిపి
బుక్కపట్టణ మంతయు బూఁది చేసి
కొంటెకూఁతలు నేరుచుకొంటి వౌర
కుటిలతిరుమలతాతన్న! కొంటెదున్న.

తాతాచార్యుఁడు వైద్యముచేయునఁట! రోగము కుదుర్చుకొన్న వాఁడై యచ్చన్న యనునొకఁడు తా నిచ్చెదనన్నయీవి యీయక పోఁగా నీ పద్యము నీ యాచార్యుఁడు చెప్పెను:—

క. పచ్చడము దుప్పటాయెను
విచ్చలవిడి తులసిపత్రి విడియం బాయెన్
అచ్చల నగుబా టాయెను
అచ్చన్నా! నీదుకీర్తి యట్టిట్టాయెన్.

## తురగా - వెంకమరాజుగారు.

ముదిసి ముప్పునఁబడినప్పు డీపద్యము చెప్పుకొన్నాఁడఁట! ఈయన స్వర్గస్థుఁడయి యిప్పటికి నిర్వది యేండ్లు కావచ్చినది.

ఉ. దార యడంగెఁ బిమ్మట సుదారుఁడు రెండవపట్టి తీఱె దృ
క్సారము దూరమయ్యె నధికం బగుదేహపటుత్వ మాఱె నా
హారము వండిపెట్టుటకు నాఁడుదియుం గఱవయ్యె నేఁటికీ
దారుణకష్ట ముంచితిగదా నతలోకవిపన్నివారకా!

## మాడభూషి - వేంకటాచార్యుఁడు

ఈయన యిప్పటికి ముప్పదియేండ్లకు ముందు వైకుంఠవాసి యయ్యెను. 'విద్యానభినవపండితరాయ'లని యీయన బిరుదనామము. ఈయన తర్కవ్యాకరణములందు గొప్ప పండితుఁడు. సంస్కృతాంధ్రములందు గొప్పకవి. శతావధానాష్టావధాన చాతుర్యమం దీయన జగజ్జెట్టి. ఏకసంధాగ్రాహి. పనప్పాకం అనంతాచార్యులుగా రీయన ప్రాణమిత్రము. అనంతాచార్యులుగారిదగ్గఱ కొకప్పు డవలిప్పుఁ డగు నొక యరవదేశపు విద్వాంసుఁడు వచ్చి స్వరచితము లయినశ్లోకములను జదువుచు నర్థసారస్యము వివరించుచుఁ బ్రశంసించుకొనుచు నుండఁగా వేంకటాచార్యులుగారు వినుచునుండిరి. పదిశ్లోకము లయినవి. ఆత్మోత్కృష్ట ప్రశంసాపరాయణుఁడుగా నున్న యాపండితునితో "నయ్యా! యీ శ్లోకములు పిన్ననాఁడు మానాయనగారు నాకుఁ జెప్పిరి. ప్రాచీన కవికృతములయిన యీశ్లోకముల ననంతాచార్యులుగా రెఱుఁగరుగదా యని యాత్మీయములుగాఁ జదువ నారంభించితిరా?" యని యక్కు పలికిరఁట. కుపితుఁడై వెడనవ్వు నవ్వి యా యరవదేశపుఁ బండితుఁడు వేంకటాచార్యులుగారి నెఱుఁగక "యేదీ నీకు వచ్చునేని చదువుము. రచించినవాఁడను నేనే యిక్కడ నుండఁగా నాతోనే యిట్లు పలికెద వేమయ్యా! ఎవ్వరవు నీవు?" అని తూటారించెనఁట! 'ఇదిగో చదువుచున్నా'నని వేంకటాచార్యులుగా రన్నింటిని నేకసంధాగ్రహణమున నప్పగించిరి. వెల్లబోయి యా పండితుఁడు వేఁడుకొనెనఁట! 'మీ మాహాత్మ్యము నెఱుఁగనైతిని మన్నింపుఁ'డని. ఈ విషయ మనంతాచార్యులుగారివలననే నేను విన్నాఁడను. వేంకటాచార్యులుగారు రచియించినరామావధూటి తారావళినుండి కొన్ని పద్యములు—

సీ. శ్రీరాణి కాకుచాశ్లేషజసంతోష
  వివశుఁ డౌ శ్రీకృష్ణవిభున కెరఁగి
సకలవిద్యావాప్తిసాధనభూత యౌ
  శారదాంబకు నమస్కారము లిడి
మోహికానందప్రవాహాపూరక మైన
  శృంగారరస మాత్మ నిరవుకొలిపి
మదనసామ్రాజ్యసింహాసనారూఢులై
  పురణించురసికశేఖరుల నెంచి

గీ. వివిధరతితంత్రపాండిత్యభవమహాను
భవములె పదార్థములుగ నేర్పఱిచి సీస
పద్యనక్షత్రమాలిక భావవిదుల
మనము లలరంగఁ గూర్తు రామావధూటి.

సీ. చక్కని కెమ్మోవి సరసంపుఁబలుకులు
  బాగైనకురులు పొల్పారుబొమలు
సొగసైనచూపులు సోగకన్నులు తళుక్కు
  దేరుచెక్కులు కాంతు లూరునొసలు
తీరైనచుబుకంబు దిద్దినశ్రీచూర్ణ
  రేఖయు మృదువైనలేఁతనగవు
కుదురైనరదనముల్ గుమ్మబుగ్గలు నంద
  మగునాస నాసికామండనములు

గీ. కలిగి చెలువొందునీమోముఁ దలఁచి వలచి
తాల్మి చెడి పట్టుకై కొంతధైర్య మూని
గుట్టు చెడకుండఁ గాలంబు నెట్టుచుంటి
మరునిరతనాలపేటి రామావధూటి.

సీ. కనుమూసినంతలోఁ గలకల నవ్వుచు
వచ్చి కౌఁగిటఁ జేర్చి ముచ్చటాడి
మోము మోమునఁ జేర్చి ముద్దుల నూరార్చి
సారెసారెకు మోవి చప్పరించి
నన్నిట్టు లెడబాయ న్యాయమా మీకని
యతినిష్ఠురము లాడునంతలోన
మేల్కని నలుదెసల్ మిణుకుచుఁ జూచి క
న్నీరు మున్నీరుగా నెగడఁ బ్రతిది
గీ. నంబు రాత్రులు నిటులుండె నా యవస్థ;
యిట్లు కలలోన నన్నలయించకుండె
వారిజాతాక్షి నాతోడ వచ్చి యిటనె
మమతతో నుండరాదె రామావధూటి.

సీ. నీమోము నీగోము నీమోవి నీతావి
నీసారు నీతీరు నీకుఁ దగును
నీచనుల్ నీకను ల్నీకౌను నీమేను
నీతోడ ల్నీనడల్ నీకుఁ దగును
నీగుట్టు నీబెట్టు నీకురుల్ నీమరుల్
నీచెల్మి నీతాల్మి నీకుఁ దగును
నీతళ్కు నీబెళ్కు నీనీటు నీగోటు
నీహొయల్ నీలయల్ నీకుఁ దగును
గీ. నీకుఁ దగినట్టిపురుషుఁడ నేన నాకుఁ
దగినసుందరి వీవ కాఁ దలఁచి చాల
వలచి యన్యోన్య మతనుని గొలిచి మిగుల
మంచితో నుంటిమిగదె రామావధూటి.

సీ. ఒకనాఁటికలలోన సకియ నీకాలిపా
   జేబులో జందెంబు చిక్కినట్లు
ఒకనాఁటికలలోన సకియ నీచేతిపో
   చీలోన నాకురుల్ చిక్కినట్లు
ఒకనాఁటికలలోన సకియ కౌఁగిటఁ జేర్చ
   తటిఁ గొంటె గడ్డానఁ దాఁకినట్లు
ఒకనాఁటికలలోన సకియ మెల్లన నాదు
   గూబలో క్రొక్కొరో కూసినట్లు

గీ. లిన్నివిధముల నచ్చట నున్ననాఁటి
వన్నె లన్నియుఁ గలలోన వచ్చి యిచట
గాసి గూర్చుచున్నవి నిన్నుఁ బాసి యెట్లు
మరులు నిల్పఁగ నేర్తు రామావధూటి.

సీ. నమ్మినవాని నన్యాయంబు సేయుట
   కాశిలో గోహత్యగాదె కలికి
వలచి వచ్చినవాని వంచనల్ సేయుట
   నరహత్యగాదె పున్నాగవేణి
చెలిమి కోరినవానిఁ జేపట్టి విడుచుట
   బ్రహ్మహత్యయెకాదె పంకజాక్షి
ఆడి తప్పినదోష మన్నిదోషములలో
   మొదటిదోషము సుమీ మోహనాంగి

గీ. నిన్ను నమ్మితి వలచితి నీవు నన్నుఁ
బ్రేమఁ జేపట్టితివి యిఁక విడువ ననుచు
బాసఁ జేసితి విప్పు డీపగిదిఁ గూర్మి
మఱచిపోవంగఁ దగునె రామావధూటి.

సీ. చంద్రఖండంబుపైఁ జంద్రఖండము రేక
        నుదుటఁ గుంకుమవంకఁ బదిలపఱిచి
కొండలపై మంచు నిండియుండినరీతిఁ
        జనులపై మైటెకఁ జక్కఁపఱిచి
కలువరేకులఁ దుమ్మెదలు వ్రాలి యున్నట్లు
        కనుదోయి నంజనంబును ఘటించి
బంగారుప్రతిమలఁ జటికనార్చినరీతి
        లలి జిల్గుమల్లుసెల్లా ధరించి
గీ. యంగజప్రభు విజయకాహాళులపగిదిఁ
గాళ్ల నందెలు పాంజెబుల్ ఘల్లురనుచు
మ్రోయ మెల్లన వచ్చి నామ్రోల నిలుచు
ఠీవి మఱవంగఁదరమె రామావధూటి.

సీ. ఒకనాఁడు మేడపై నొంటిగా కిటికిటీ
        లెల్ల బిగించి శయించువేళఁ
జల్లగా నే వచ్చి మెల్లమెల్లనె ముద్దు
        లిడఁబోవఁగాఁ ద్రుళ్ళిపడి బిరాన
లేచి చెంగట నన్నుఁ జూచి సెబాసు రా
        రండీ యటంచు నురంబుపైకి
తిగిచి నాచిబుకంబుఁ దివురుచు నవ్వుచు
        మధురవాక్యముల నఱ మరులుకొల్పి
గీ. సరసులైనట్టి నీవంటిజాణ లిట్లు
చెలులమానంబులను బయల్ సేయఁదగునె
యంచు మంచిగ బోధించినట్టినేర్పు
మదికి మఱవంగఁ దరమె రామావధూటి.

సీ. చిననాఁటినుండి విజృంభించి సఖులతోఁ
బొందు లొనర్చితిఁ గుందరదన
యీలాటిమోహంబు లీలాఁటివిరహంబు
లేనాఁ డెఱుంగనే యిగురుఁబోఁడి
నీవంటిచెలియతో నేస్త మబ్బె నటంచుఁ
జాలఁ బొంగితిఁగదే జలజగంధి
యివ్వి డిల్లెడఁబాసి యేఁగుట నాపూర్వ
పుణ్యంబు గాఁబోలుఁ బూవుఁబోఁడి
గీ. యింతపాపంబు జగతిలో నెచటనైనఁ
గలదె నాపాప మిటు పండెఁగాక యైనఁ
దరుణి నీమది కరుణమాత్రంబు తప్పి
పోవకున్నను జాలు రామావధూటి.

సీ. 'బోఁటి నేఁ డూరికిఁ బోవలె' ననుచు నే
నొక్కింత పలుకంగ నుస్సురనుచు
'నెపుడుఁ బ్రయాణాలె యేమి సేతు' నటంచుఁ
గనుఁగొలఁకుల నీరు గ్రమ్మఁ గొంత
సేపున ‟కెపుడు విచ్చేయుదు రొక్కొ! య
చ్చటనె యచ్చటల ముచ్చటల మరగి
యుందురో" యన భయం బొంది నేనెన్నటి
కిని నట్టివాఁడఁగా నని పలుకఁగ
గీ. నోట్టుసుండి తప్పక హుటాహుటిగ రండి
యనుచుఁ గౌఁగిటఁ జేర్చి బాష్పంబు లొలుక
రేపు పోవచ్చు ననుచుఁ బ్రార్థించునట్టి
మంచి మఱవంగఁ దరమె రామావధూటి.

సీ. ధరలోన జన్మ మెత్తంగ నేమి ఫలంబు
సరసవిద్యల నెల్లఁ జదువవలయుఁ
జదివిన నేమాయె సారస్య మెఱిఁగిన
చెలియతో స్నేహంబు సేయవలయుఁ
జేసిన నేమాయెఁ జిడిముడి లేక వి
చ్చలవిడి ముచ్చట్ల మెలఁగవలయు
మెలఁగిన నేమాయె నెడబాయ కెల్లప్పు
డేకీభవించి వర్తింపవలయు
గీ. నటుల వర్తింప నేమాయె నవ్విధమునఁ
జెడని ప్రేమలతోఁ దను ల్విడువవలయు
నహహ యివి యెల్లఁ బూర్వపుణ్యమునఁ గాక
మనుజులకు వీలుపడునె రామావధూటి.

సీ. మేడలోఁ జన్నీళ్లు మెండుగాఁ జల్లించి
తడియొత్తి చిఱిచాఁప లిడి సుమ్మృదుల
తల్పంబుఁ బఱిచి చెంతల మిన్నలగుమర్చ
తులును సోడావాటరులును గల్గు
సీసాలు చక్కెరల్ జీడిపప్పులును బా
దముపప్పులును మంచిద్రాక్షపండ్లు
కజ్జాయములు ముంతఖర్జూరము ల్గల
పళ్లెముల్ ప్రేమతో భద్రపఱిచి
గీ. భోజన మొనర్చి నేను రాఁ బొలుపు మీఱ
శయ్యపైఁ జేర్చి యుచితోపచారములను
వేసఁగిపగళ్ల సుఖయింపఁ జేసినట్టి
మంచి మఱవంగఁ దరమె రామావధూటి.

సీ. కమలాక్షి నీమోముఁ గనుఁగొన్న నాకన్ను
లేమియుఁ గనుఁగొన నేవగించు
బింబోష్ఠి నీదుమోవిని గ్రోలునాజిహ్వ
యేమియుఁ గ్రోలంగ నేవగించుఁ
గలవాణి నీదు పల్కులు విన్న నావీను
లేమియును వినంగ నేవగించుఁ
గనకాంగి నీతోడఁ గలసిననాదుమే
నేమియు స్పృశియింప నేవగించు
గీ. సరసిరుహగంధి నీమేనిపరిమళంబుఁ
గొన్న నానాస యెదియు మూఁకొనఁగఁబోదు
అహహ! పంచేంద్రియములు నీయందె నాటి
మఱల విఁక నేమి సేతు రామావధూటి.

సీ. సౌధంబుపై నీళ్లు చల్లించి చిమ్మించి
చాపలు పఱపించి చారురత్న
కంబళంబులు వేసి ఘనహంసతూలికా
తల్పంబుఁ బఱపించి తమక మలర
నందుపై ననుఁ జేర్చి యగరుగంధముఁ బూసి
చలువపన్నీరులు చల్లి మల్లె
పూవండలును జాజిపూదండ లురమున
వేసి చల్లనిగాలి వీచుచుండ
గీ. రమణ నీరీతి వేసవిరాత్రులందు
రాగ మెచ్చంగ నిష్టోపభోగములను
నన్ను సుఖయింపఁ జేసిననాఁటకూర్మి
మదికి మఱవంగ వశమె రామావధూటి.

సీ. ఉదయమే లేచి నీ వదలలే కైదాటు
గడియలవఱ కుండి కదలి మేడ
డిగి వచ్చుచో వాకిటికిముందు గుబగుబ
నీ వేఁగి యీవల నావలఁ గని
సైయన నే వేగఁ జని బసలోఁ గల
పనులెల్లఁ దీర్చి సాపాటు చేసి
గంధంబుఁ బూసి వేడ్కల మించి కెలఁకుల
నమ్మలక్కలు వెఱఁగంది చూడ
గీ. నీటుగా వచ్చుచోఁ జూచి నేఁడు దృష్టి
తాఁకు నని ప్రొద్దు గ్రుంకినతత్క్షణంబు
జీడిగింజల దృష్టి తీసినవిధంబు
మఱచిపోవంగఁ దరమె రామావధూటి.

సీ. ఊరు నేఁడే బైలుదేరుట నిశ్చయం
బైనచో నెదురు మాటాడలేక
మోము వెల్వెలఁబోవ ముచ్చటాడుచునుండి
ధ్యానంబు వేఱుగాఁ దల్లడిలుచు
నామాట లీమాట లడుగుచు నుచితోప
చారముల్ సేయుచు గారవమున
భోజనానంతరంబునను దమ్ములము గు
డాన్వితంబుగ నిచ్చి యవలఁ జేయి
గీ. చేతిలో నుంచి యూరికి క్షేమముగను
బోయి శీఘ్రంబు రమ్మని పొలుపు మీఱ
నన్నుఁ బంపిన యానాఁటినైపుణంబు
మఱచిపోవంగఁ దరమె రామావధూటి.

సీ. కడుపులోఁ గమ్మనికాంతు లూరుచునుండు
నిను జ్ఞాపకము సేయఁ గనకగాత్రి
కనుల కేమో తళుక్కను నట్లుగాఁ దోఁచు
ని న్నెన్న సౌదామనీలతాంగి
నిలువెల్ల నేమేమొ పులకించు నీతీరు
స్మరియించ శీతాంశురుచిరసుముఖి
సారెకు నేమేమొ నో రూరుచుండు నీ
మాటలఁ దలఁప బింబాధరోష్ఠ

గీ. రోచనగ నుండు మది కేమి తోఁచకుండు
దిగులుగా నుండు మరుమాయ తెలియకుండు
దైవ మిఁక ముందెటులు సేయఁ దలఁచినాఁడొ
మనకుఁ దెలియంగరాదు రామావధూటి.

సీ. ధరలో ననేకసుందరు లుండు రైన వా
రలయందు నెందు నీవలెను మంచి
గుణము విశ్వాసంబు కుదురు సత్యము తప్ప
కుంకుట యుక్త మయుక్త మెఱిఁగి
తిరుగుట వినయవిధేయత లభిమాన
మాదరంబు దయామయాంతరంగ
మందంబు చందంబు నళుకును బెళుకును
సమయంబునను దెంపు సౌష్ఠవంబు

గీ. దగినసరసునిఁ జేపట్టి తప్పు లొప్పు
లెఱిఁగి విడువక ప్రేమచే నేలికొనుట
తెలివితేట లుపాయముల్ లలితవాక్య
మాధురియు నిన్ని గలవె రామావధూటి.

సీ॥ నీయాత్మ నాయాత్మ నిజముగా నొకటంచు
నామనంబునఁ జాల నమ్మియుంటి
నాతోడఁ జేసిననమ్మిక లెప్పుడు
మఱచిపోవని యూహిఁ పఱచియుంటి
నెవరెన్ని చెప్పిన నిఁక నన్ను విడనాడ
వంచు నామది నిశ్చయించుకొంటి
మనశరీరము లున్నమట్టుకు మనలోనఁ
బొరక కల్గదని తలపోసియుంటి

గీ॥ వనితరో యిప్పు డిటు కాలవశముచేత
మనల కెడబాపు కల్గె నీమది విరక్తిఁ
బొరయ లోగడ సంగతుల్ మఱచిపోవ
మంచిమార్గము కాదు రామావధూటి!

సీ॥ ఘన మైనమోహంబుఁ గలవాఁడ నౌటచే
లలన నే నీకింత తెలుపవలసెఁ
బట్టుకై యభిమానపడువాఁడఁ నౌటచేఁ
దెఱవ నీకింత బోధింపవలసెఁ
బ్రౌఢానుభవ మాసపడువాఁడ నౌటచే
నింతి ని న్నింత ప్రార్థింపవలసెఁ
జెలిమిపై లక్ష్యంబు గలవాఁడ నౌటచే
వనిత నీకింతగా వ్రాయవలసెఁ

గీ॥ గాక తమతమ యక్కఱల్ గడపుకొనెడు
వార లందఱితోఁ పాటివాఁడ నైన
నింత యేటికి? నీకు నొక్కింతయైన
మనమునను దయ లేదు రామావధూటి.

సీ. నీమోము నే నొక్కనిముసంబు గనుఁగొన
శశి యేటి కనిపించుఁ జంద్రవదన!
నీమోవి నే నొక్కనిముస మానిన దొండ
పండేటి కనిపించుఁ బల్లవోష్ఠి
నీకను లే నొక్కనిమిషంబు గనినఁ బ
ద్మ మ్మేటి కనిపించుఁ దరళనయన
నీబొమల్ నే నొక్కనిమిషంబు గనుఁగొన్న
విల్లేటి కనిపించు విలసితభ్రు
గీ. నీదుచెక్కులు నే నొక్కనిమిష మైనఁ
గనిన నద్దంబు లేమిటికనుచుఁ దోఁచు
నిట్టి నినుఁ బాసి యున్నా కిపుడు జన్మ
మే వృథా యని తోఁచు రామావధూటి.

సీ. శ్రీమించునెమ్మోము తామరవిరి తళ్కుఁ
గన్నులు విరిసినకైరవములు
కుదురైనరదనముల్ కుందకుట్మలములు
తీరైననాసిక తిలసుమంబు
తరళాధరోష్ఠంబు దాసానిపుష్పంబు
పాలుపైనపొక్కిలి పొన్నపువ్వు
ఆదోఁక లగుజంఘ లగఁటిపూమొగ్గలు
చక్కనిమెయి శిరీషప్రసూన
గీ. మహహా మును మంచిమంచిపూ లరసి తెచ్చి
పొదవి నెమ్మనుఁ జేసెఁ గాఁబోలు బ్రహ్మ
దాన నిలఁ గల యెల్లసుందరులలోన
మాకు స్పృహణీయ వైతి రామావధూటి.

సీ. నారంగములు బృహన్నారంగములు గల్గి
విలసిల్లునుద్యానవీథులందుఁ
గాదంబములు పద్మకాదంబములు గల్గి
తనరారుకాసారతటములందుఁ
బర్యంకములు మహోపర్యంకములు గల్గి
వినుతి కెక్కినసౌధవీథులందు
మణిపుత్రికలు నభోమణిపుత్రికలు గల్గి
సౌరు మీఱినచంద్రశాలలందు

గీ. మనము మనముల మోహ ముమ్మరముగాఁగ
మరునిఁ బూజించి మించి యే ద్రిమ్మరి రతుల
నతులగతులను దేలి సమ్మతుల మీఱి
కీవి నుంటిమి గదవె రామావధూటి.

శిష్టు - కృష్ణమూర్తి కవి

శంఖవర్ణనము

సీ. చిగురువిల్తునియప్ప చేఁబూనునడిదంపు
రకపుఁ బసిండి పరం జనంగఁ
గొనసాగి దెస లల్లి కొనఁ బ్రాకు నతనికీ
ర్తిప్రతాపములచేరిక యనంగఁ
జెలియలి కనువేడ్కఁ జెంత కరుగుదెంచి
నిలుచున్నచిన్నిజాబిలి యనంగ
నాబిడ గీల్గంట నమరింపఁ గూర్చిన
కొమరారుబంగరుకుప్పె యనఁగఁ

గీ. బరఁగు నిందలి దక్షిణావర్తశంఖ
మౌర దామెరకులకలశాబ్ధిసోమ
విభవనిర్జితసుత్రామ విమలనామ
సద్గుణస్తోమ వేంకటసార్వభౌమ.

చ. తరువున బర్హి యంతరపథంబున నీగపయంబు నీరజా
కరమునఁ గ్రౌంచముఖ్ బొదపి కంబభిదశ్రుతిసూర్యఘోటముఖ్
సరిమపథంబులక్రమత సక్రమతన్ దతిఁ బల్కు శుద్ధసా
హరి యిపు డాలపించు నన నొప్పిను గాననసీమ నయ్యెడన్.

చాటువులు :—

శ్లో॥ ప్రీత్యా దామరవేంకటేంద్ర భవతా నిత్యార్చిత స్సంతతం
కృత్యాకృత్యవివేచకో క్తిపదవీవృత్త్యాధికవ్యక్తిభాక్
సత్యాధీశముఖామరార్చితపదః సత్యానుసృత్యాదరో
దైత్యారాతి రయం తవాననకళా మత్యాదృసాహాదభూత్.

ఆర్యా: కాంచనపిశంగవసనః
కవితారుణవర్ణపీఠసంవసనః
తరుణతరమందహాసనః
త్వా మవతా ద్వేంకటేంద్ర సవిలసనః.

ఆర్యా: లక్ష్మీస్తనభరకుంకుమ, లాంఛితవక్షస్స్థలాంచితః కృష్ణః
దామరకుమారవేంకట, ధరణీనేతార మవతు సుకుమారం.

కుండిననాయకతనయా
కుచయుగకాశ్మీరముద్రితోరస్కః
కురుతా త్కువలయనీలః
కోపి పుమా న్వేంకటేంద్ర తవ కుతుకం.

శా. ఛిద్రాన్వేషణతత్పరో నను రమాసూను స్సపంచాశుగీ
ముద్రాముద్రితదోర్యుగప్రవిలసత్కాంతారబాణాసనః
స్నిద్రాగద్య నిరీక్ష్య తే మమ తనుం సంతర్దయన్నిర్దయం
నిద్రా నైతి నిశా న యాతి తరుణీ నాయాతి కాయాతనా.

శా. యాతా కాచనదూతికా మదుదితం వ్యాఖ్యాతుమేతర్హి సా
నాయాతా బత పంచబాణవ్రతనాకోలాహలో ద్యోతతే
ఏకాకీ న్యవసం వసంతసమయే దైవా దహం నిష్కుటే
నిద్రా నైతి నిశా న యాతి తరుణీ నాయాతి కాయాతనా.

జవః స్థిరత్వం రేఖా చ భ్రమణం దృష్టి రశ్రమః
అస్వేదః పటువాగ్రూపం పాత్రప్రాణా ఇమే దశ.

## శిష్టు - సర్వశాస్త్రి

దామరవేంకట భూపాలుని యాజ్ఞాప్రకారము శిష్టు - సర్వశాస్త్రి చెప్పిన చాటువులు

### దక్షిణావర్తశంఖము

క. కలిమిచెలి బొడ్డుబిడ్డకుఁ
బొలుపుగఁ బాల్వాయి నిడినపొంబాలఁడ నా
నలరారు నిందుఁ దగుని
వ్వలమురి వేంకటనృపాల వరగుణశీలా.

చ. తరుణశశాంకశేఖరుఁడు దామరవేంకటభూమిపాలుఁ డా
దరమునఁ జల్లుపూజవల దానముల న్ముదమంది మిత్రుఁడౌ
సిరి నిడువాని కాన యిడఁ జెచ్చెర నాతఁడు పంప వచ్చి సు
స్థిర మగుశంఖసేవధిగ థీఁ దలపోయుదు దివ్యశంఖమున్.

### స్తంభవర్ణనము

సీ. సంతతంబును సుప్రసాదత మించుప్రా
సాదలక్ష్మి వహించుజడ యనంగ
రత్నసంపదఁ జూడ రహి మరంగున నిల్చు
వరుణుఁ జెక్కినదంతికర మనంగ

రాజ్యరక్షకు రమారమణుఁడు నిల్పినఁ
గన్పట్టుతనదగుగద యనంగ
నిచటి చాగము విని యే నెంత యని కంది
కొల్వ వచ్చిన దేవభుజ మనంగ

గీ. భావుక భవత్సభాంతరభాసమాన
రాజరత్నమయ స్తంభ రాజ మొప్పఁ
బోషితబుధాళి తోషితభూజనాళి
కృతినళినహేళి వేంకటక్షితిపమౌళి.

ఉ. గాలికిఁ దూలు కేతనము ఖడ్గముగా బలవైరిమేడతో
నోలి నెదుర్ప నీదగు సమున్నతసౌధము కప్పడాలొగిఁ
గేల నమర్చి మిన్నలమి కేరుచు నెత్తిన బాహుశాఖ నా
నీలపుఁగంబ మొప్పు నవనీనుత వేంకటనాయకాగ్రణీ.

చ. అనవరతంబు నీకుఁ బురుషార్థచతుష్టయిఁ గూర్తు నంచు సూ
చన మొనరించు నాల్గయిన శౌరిభుజార్గళమో యనంగఁ బై
మనిచిన దిమ్మకైల్దగ సమున్నతతావకసౌధమం దొగిఁ
దనరును నాల్గుగంబములు దామరవేంకటనాయకాగ్రణీ.

చ. మిలమిల లీనునీపసిడిమేడప్రకాశము పేరిపుత్రుతో
నలబలవైరిసౌధరుచి యస్దహితం జతఁగూర్చి వియ్యపుం
జెలిమి వసంతముం జిలుకఁ జేర్చిననీలపుఁగ్రోవి నాఁగ రా
జిలు నల రాలకంభమనఁ జెన్నగు దామరవేంకటాగ్రణీ.

## పీఠికావర్ణనము

సీ. కలధౌతరేఖికావలయితపీఠస
మీరణప్రేరణతీరకలిత
ఫేనసరసిలోన మానుగఁ బొడమిన
యలరుప్రవేణికాప్రావృతతదు
పరిపీఠికాశోణపంకజమ్మున మించు
కనకపీఠికనత్కర్ణిక నొగి
నివసించుసిరితోడ నెనరూనుమనసునఁ
గలయ నల్లన నల గరుడవాహుఁ

గీ. డితఁడె సుమ్ము త్వదీయసంతతసుఖాభి
రూపసౌధాంతరమ్మున రూఢి నిన్నుఁ
బ్రోవ వచ్చె సమంచితాభ్యుదయశాలి
వినుతగుణపాళి వేంకటావనిపమౌళి.

సీ. చుట్టుగట్టిన వెండికట్టునీలపుఁబీట
క్షీరాబ్ధివేష్టితక్షితివలయము
తదుపరినిహితసుత్రామమణీగణ
ఖచిత మౌపీఠము గగనతలము
దానిపై నెరజాయ లీనురాంకవకుథా
స్తరణంబు విస్ఫురత్తరణిబింబ
మండలి తులసీదలారుణకుసుమాళి
మరకతమాణిక్యమయనలినము

గీ. గాఁ దదీయాంతరమ్మున గమల నెనసి
యున్న దేవుం డితం డిదె నిన్నుఁ బ్రోవ
వచ్చియున్నాఁడు నీరతి మెచ్చినాఁడు
వినుతగుణసాంద్ర దామరవేంకటేంద్ర.

సీ. కలధౌతరేఖ కావలయి తేంద్రోపల
పీఠము నిర్ఝరీవృతనగేంద్ర
మప్పీటపై నొప్పు గప్పురామని మించు
పేరియకొండకు వెలయుశిరము
దానిపై నెఱరంగు లీనురాంకవకుధ
ధాతురాగస్ఫురద్ధరణితలము
ఆమీఁద మరకతకోమలదీప్తుల
నలరారు తుళసీదళాళి కవని

గీ. యది నిరంతరకుసుమప్రసగ్ర మగుట
నిత్యమాధవసంబంధనియతి నొదవె
నిదియు నీమహిమోన్నతి గదర సుగుణ
వార దామరతిమ్మభూవరకుమార.

సీ. అనుదినం బరుణోదయమున గజేంద్రమో
క్షణపఠనం బీవు సలుపునపుడు
సిరిమగఁ డేరీతిఁ గరిఁ బ్రోచెనని మదిఁ
దలఁపగ నవ్వేడ్కఁ దెలుపఁ గ్రింది
కరిపీట కరియుఁ బైఁ గననగు రెండవ
యది కుంభముగ నందుఁ బొదలుతులసి
కారుణకుసుమంబు లంబులోడనలగ్న
శైవలకహారసమితి గాఁగ

గీ. నవ్యకుథకాంతి యాస్ఫాలనక్రియాత్మ
కరనఖద్యుతి గాఁగ నీ వరయు మనుచు
నెదుట నిలుచున్నవైకుంఠుఁ డితఁడె సుమ్ము
వినుతగుణధుర్య వేంకటావనిపవర్య.

సీ. తనమోము నిగనిగ ల్దవిలి యిట్టటు సరి
గాలి నీడ్వఁగ స్వీయకళలు దొరిగె
నాలుగుతెన్నులై నడుమ మిక్కిలి కంది
యున్నరూప్యప్రాంతయుక్తపీఠ
కుముదబంధుఁడు శోణకుథసమాస్తృతతదు
పరిపీఠభుజగారిపదములఁ బడి
ద్విజరాజ వీవును ద్విజరాజ నేనును
సరివాని శరణార్తి సరయఁ గీర్తి

గీ. యనుచు వేఁడుచు నున్నటు లరసి నగవు
నెరయ సాక్షాత్కరించెను నియతి నీకు
నీ వొనర్చినయారాధనావిధిఁ గని
వినుతగుణపాళి వేంకటావనిపమౌళి.

సీ. పౌలస్త్య దుర్గమున భంజించి చుట్టురా
మోయురాయంచలమూక నొప్పు
పుష్పకమున భూమిపుత్రికతో నెక్కి
నలుప్రక్కలందును గొలుచు కొమ్మ
మొకముల ముఖకాంతిచకచక ల్వ్యాపింప
నరుదెంచు రాఘవుఁ డనఁగ రజత
వేష్టితాంధఃపీఠవిలసదింద్రోపల
పీఠియం దరుణప్రవేణికాంచ

గీ. ద్రవమయచ్ఛవిచ్ఛట లలమి పర్వఁ
గూరుచున్న సిరిపతి చెన్నారు నార
శశ్వదార్జితపుణ్య విశ్వజనగణ్య
నీతినైపుణ్య వేంకటనృపవరేణ్య.

ఉ. ప్రీతుఁడ నైతి నీతెలివి వేంకటనాయక కాశి కేఁగునీ
తాతకు దర్శనం బొసఁగి ధన్యునిఁ జేసితి నిప్పు వచ్చి నీ
కేతు నటంచుఁ బీఠయుగనీలనగేంద్రముతోడ నాజగ
న్నేతయె యేతదాకృతిగ నిల్చె ప్రసాద మొసంగఁ జెంగటన్

శా. తారాంకాభ్రసరిత్పరీవృత మదః పీఠం స్వయూర్ధ్వస్థితం
పీఠీశోణకుథాబ్జభాపరిగతం సత్యం తత స్తత్పరే
దివ్యే దామ్న్యరుణప్రసూనతులసీపత్రప్రభా శ్రీహరి
ప్రత్యక్షౌ భవతః కి మత్రభవతః శ్రీవేంకటేంద్రప్రభో.

తారావృతాధరసమున్నతపీఠికాగ్రే
స్వారుణ్యవత్కుథసమాస్తృతపీఠతాక్ష్ర్యే
ఆరా దుపేత్య విదధాతి ముదం సదారో
నారాయణ స్తవ స దామరవేంకటేంద్ర.

శా. ఊర్ధ్వస్థాచ్యుతపాదసారసలసన్మాధ్వీద్యుషన్నిమ్నగా
పీఠా దూర్ధ్వగతా ద్విహాయ సుపథా త్స్వాప్యాధరం పీఠకం
స్వస్థానాశ్రయ తత్పరాకన ఖలం తత్రైవ నానాదిశో
ధావంతీ న పునః పపాత ధరణే శ్రీవేంకటేంద్రప్రభో.

చాటువులు:

సిరి నెరిమించునెమ్మి పురిఁ జెన్నుగ నొదలఁ దాల్చి మేల్మిబం
గరుమొలనూలిగంట గలుగల్లన మ్రోయఁగ మోముఁదామరం
జిరునగ వొప్పఁ దల్లికడఁ జిందులు ద్రొక్కుచు నాడునల్లవే
ల్పు రహిఁ నొసంగు నీకుఁ గలుము ల్దయ దామరవేంకటాధిపా.

క. కృష్ణుఁడు పదకమలనయ
జిష్ణుఁడు నరకాదిదైత్యజిత్వరకేళీ
ధృష్ణుఁడు భక్తశ్రీవ
ర్ధిష్ణుఁడు వేంకటనరేంద్రుఁ దిరముగఁ బ్రోచుఁ.

## కంకతికావర్ణనము

చ. హిమకరకీర్తి వేంకటమహీరమణా కలధౌతదంతప
త్రములు ప్రదీప్త్యహంకృతిఁ బరస్పరము న్గలహించి చె... జె
య్యమరఁగఁ బట్టి నీసముఖమం దొగి నత్తగవెల్లఁ దీర్పఁగా
సమయనిరీక్షణక్రమము సల్పుచు నిల్చె నచంచలాకృతిఁ.

చ. అనుపమరాజతద్యుతిసమంచితమై భవదీయసన్నిధిఁ
దనరును దంతకంకతము తావకకీర్తులకుం దరంబుగా
క నొగిలి పుత్రి గంగ దలఁ గ్రక్కునఁ దాలిచి స్రుక్కి కొల్వ న
చ్చినయజహత్స్వపాదహిమశృంగియ నాఁదగు వేంకటాధిపా.

ఉ. అర్ణవమేఖలావనన మైతగునీదుయశంబుఁ గాంచి దు
ర్వర్ణత నంటి వెండి మదవారణసద్ద్విజకంకతాప్తి స
ద్వర్ణము నంటి నిన్నుఁ గొలువంగ భవత్కరపాళియై త్వద
భ్యర్ణము చెందె వేంకటధరాధిప నూరిజనోదయత్కృపా.

గీ. సారగురుబుధ మిత్రమందారమహిమఁ
దనరునీమేడఁ గని దివం బనుచు నుచిత
గతి రజతకంకతాకృతిఁ గవియు శశియుఁ
జొంకముగఁ గూడి నిలిచిరి వేంకటేంద్ర.

ఉ. దామరవేంకటక్షితిప తావకహర్మ్యము తావరీవెసూ
దామర పట్టి విట్టినుడి తప్పగునేని భవత్ప్రకాశమం
దేమర కెప్పుడు న్నిలుచునే రజతచ్ఛదిపక్షివృత్తిలీ
లామహనీయకంకతమరాళకులాగ్రణి యిట్టు లొద్దికన్.

ఉ. దామరవేంకటేంద్ర సతతంబును నీమహనీయసద్గుణ
స్తోమము లెక్క పెట్టుటకుఁ జొప్పడు చొప్పగ నాత్మ నెంచువా
గ్రామకరంబు నాకలితరావ్యశిరోఘనకంకతంబు ల
క్ష్మమహితస్థితిం దగుఁ బ్రకీర్ణతదీయరథాళి వ్రేళ్లుగాన్.

సీ. దేవకి కలవసుదేవునకును మనో
రంజనముగ మథురం జనించి
యమునఁ దరించి న్యాయముగ యశోదకుఁ
బట్టియై సతులఁ జేపట్టి ప్రోచి
గోపసుతులతోడ గోపాలన మొనర్చి
సుర లుల్లసిలఁగ నసురులఁ ద్రుంచి
ధరమెత్తి ప్రజజనోద్ధరణం బొనర్చియు
వెడగై నకాళియు వెడల నడఁచి

గీ. తరణిజహ్రదంబు నిర్దోషతరముఁ జేసి
ప్రబలు శ్రీకృష్ణుఁ డెప్పుడు ప్రబలఁజేయు
నీమహైశ్వర్య మంతయు నేమ మమర
కృతినళినహేళి వేంకటక్షితిపమౌళి.

పారిజాతవర్ణనము ...

ఉ. నే నిలఁ బారిజాతమని నిక్కముగాఁగఁ బ్రసిద్ధిఁ గాంచితిం
దానను బారిజాత మఁట దైవతసూనము తప్పిదంచు జు
మ్మానన యాయతాత్యరుణవృంతము పేరిటిదీర్ఘకోపముం
బూనెను శ్రీకుమారపదపూర్వక వేంకటభూమినాయకా.

శోణవృంతము పారిజాతకసూన మొప్పగు వేంకట
క్షోణినాయక యుత్తమాంగముల గొల్వ నేయ మరుంగునన్
రాణ నొద్దిక మీఱ నిల్చిననల్వచెల్వ సముల్లస
చ్ఛోణిమాయతచిత్రకాంకనశోభమానముఖంబు నాన్.

సీ. మహిఁ గలకొలఁకుల విహరింప సరసిజా
సనవాహనావతంస మొకనాఁడు
చనుదెంచి గతిగర్వమున మించు నిందలి
రాయంచగమిఁ గని రాణమాట
వాసిగ సిరినడవడువున నెందును
లేమి తెల్లము గర్వమేమి మనకు
నన విని సిరి యెందుఁ గన నగు నని భువి
వెదకుచు నీయింట వెలసియున్న

గీ. సిరిని వెరపున మైమాటిచెంత నిలిచి
కాంచునంచల సహచంచుకముఖము లనఁ
దనరు నీపారిజాతము ధైర్యనయవి
వేకనిస్తంద్ర డామరవేంకటేంద్ర.

శ్రీ పాస్య...వరదాస్యకృతిప్రసిద్ధ్యై
భూపారిజాత కుసుమోపధి రాజ ఏషః
వృంతచ్ఛలారుణమణీమయవేత్రధారీ
ప్రాంతస్థితః సపది వేంకటభూపమౌళే.

భాభాంతి పారిజాతప్రసవాః కురువిందదండసంకలితాః
హీరమయా స్తాటంకా ఇవ లక్ష్మ్యా వేంకటావనీరమణ.
భూపారిజాతమధునా సిక్తో య శ్శ్రీపతి స్త్వయా
భూపారిజాత మధునా వేంకటేంద్ర ధునోతి తే.
పాణౌ వేంకటభూపాల పారిజాతం తవాధునా
దానపత్రాంకనారోద్యన్ముద్రికేవ విరాజతే.
సిందూరపేటకాంత
స్సిందూరాకర్షణా త్తరేఖోయ్యం
వృంతయుతపారిజాత
ప్రసవః శ్రీవేంకటేంద్ర పద్మాయాః.
వృంతాంచత్పారిజాతప్రసూనం వేంకటనాయక
సంధ్యాభ్రభలేఖాగ్రలసత్కవిభ్రమదవిభ్రమః.

శ్రీ చూర్ణకర్ణికా వర్ణనము

చ. ఘన మగుధైర్యలక్ష్మి మును గాసిలఁ జేసితి విప్పు డీవు సే
యునియతహేమదానముల నొక్కటఁ జిక్కితి నంచు మేరు విం
క నను భవత్కటాక్షమునఁ గన్గొని రక్షణ సేయుమంచు వే
డ్కొను నిను బంగరుంగణికడాంకున వేంకటభూమినాయకా.

క. శ్రీవేంకటధరణీవర
తావకకరపద్మలగ్నతరణికరము యీ
సౌవర్ణకణిక శ్రీచూ
ర్ణావళి తల్లగ్నరసపరాగము తెలియర.

శ్లో. శ్రీచూర్ణద్రవముద్రిత
చంచత్కాంచనశలాలికా కనతీ
స్వవదనమరందమేదుర
పరాగలిప్తారవిందనిలయేవ.

## కూర్మపురాణ పుస్తకము

సీ. నల్లనివేగిసబల్లలు ప్రక్కల
జానగు నీలంపుఁ జరులు గాఁగ
నందంద పైపయిఁ జందనబిందువుల్
రహిఁ నిగ్గు లీన్మగరాలు గాఁగ
నంతరాంతరముల నలరుపచ్చనితాళ
పత్రము ల్జాళువాపసిఁడి గాఁగఁ
గట్టినయొరపట్టుఁదిట్టంపుసూత్రము
శోణరత్నప్రభాస్ఫూర్తి గాఁగ

గీ. రత్నసానువు గూర్మపురాణపుస్త
కచ్ఛలమ్మున నర్థనికాయములను
బంచి యిడకుండ నిన్వేడ వచ్చెఁజుమ్మ
వినుతగుణసాంద్ర దామరవేంకటేంద్ర.

శ్లో. సభ్యాస్తే భగవత్కథాజలనిధిం మథ్నంతి సంవిత్సుధాం
యుక్త్యా కూర్మపురాణమందరధరం సంతుష్టచిత్తా బుధాః
శోణాంచద్గుణకర్షణారుణవపుస్సర్వాధిపప్రావృతం
సత్వం దామరవేంకటక్షితిపతే త్వం ప్రేరకః శ్రీపతిః.

ఉద్ధరిణె.

క. వెన్నుని పచ్చని పుట్టపు
వన్నియపూఁతలఁ దనర్చు పాఁపదొర యనఁగన్
జెన్నగుఁ బొన్నుద్ధరణియ
సన్నుతగుణ వేంకటేంద్ర సద్గుణసాంద్రా.

ఉ. పన్నగ నీవు భూభరము భారముచే భరియింపుచుండ నా
పన్నగరాజు సంతసిలి పచ్చనిపుట్టపువన్నియ ల్మెయిన్
జెన్నగ వెన్ను మోఁచికొని శీఘ్రగతి న్నినుఁ గానవచ్చె నా
సన్నుతకీర్తి వేంకటరసాపతి హాటకదర్వికోపధిన్.

క. వాసవిరథచోదకతా
భాసురకృష్ణాగ్రహస్తభర్మకళయ నా
భాసిలుఁ బసిఁడిగలంటిక
వాసవసమ వేంకటేంద్ర వరగుణసాంద్రా.

సీ. నఖక్షతలీలసద్వనజాలయాహస్త
వాస్తవ్యహాటకవల్లకి యన
విశ్వజనీనతావిశ్రుతమహిమయు
ఝరజిత్కరస్ఫురన్మురళి యనఁగ
బద్మప్రబోధనప్రథమానతేజస్క
భాస్కరప్రత్యగ్రభాను వనఁగ
సన్నుతకాశీస్థితాన్నపూర్ణాకర
స్థలలసత్తపనీయదర్వి యనఁగ

గీ. దగి పసిఁడియుద్ధరిణె మించు దామరాన్వ
యాంబునిధిపూర్ణిమాచంద్ర యాదవేంద్ర
తరుణకరుణాకటాక్షవిస్ఫురణపూర్ణ
విభవవిద్యావినిస్తంద్ర వేంకటేంద్ర.

(చాటుసమస్యలు)

సీ. మేచకరత్నజిల్లోచనరోచులు
తేఁటిదాటులక్రియ దాటిదాటి
ఆభుగ్నరుచిరలంబాలకరుచులును
తేఁటిదాటులక్రియ దాటిదాటి
లలితవక్షస్స్థలీలాంఛనప్రభలును
తేఁటిదాటులక్రియ దాటిదాటి
వికసితతాపింఛవిగ్రహద్యుతులును
తేఁటిదాటులక్రియ దాటిదాటి

గీ. రోజుఁ బర్వసుపర్వసమాజమాన్య
మకుటకోటినీరాజితమహితపాద
యుగళుఁ డగుచిన్నివెన్నుఁ డొసఁగు శుభములు
దామరకుమారవేంకటధరణిపతికి.

సీ. నాళీకనిర్యన్మధూళీఝురీనట
త్సారంగలీలచేఁ జౌకళించి
సామంతజనపాళిసంవర్ధితానూన
సారంగలీలచేఁ జౌకళించి

మధ్యభాగస్ఫురన్మణిరశనారత్న
సారంగలీలచేఁ దౌకళించి
సానుమదనైనాథసంజాతమదమత్త
సారంగలీలచేఁ దౌకళించి

గీ. పొగడికకు నెక్కుడురులుఁ జూపులును గట్టు
పుట్టము న్నడలుం గల్గి పొలుచు కడలి
పట్టి చూపట్టి మిమ్ముఁ జేపట్టి ప్రోచు
వినుతగుణసాంద్ర దామరవేంకటేంద్ర.

మ. భవదభ్యర్చితభార్గవీరమణశుంభద్రత్నపీఠాధరో
ర్ధ్వవిలగ్నక్షితిపారిజాతతులసీపత్రాళి సేయుం దదా
స్యవిధుప్రాక్స్వసమాగమక్షమమిథోహంపూర్వికాసంసర
ద్భవిభావర్యుపమర్దశంక నలరింప న్వేంకటక్ష్మాపతీ.

శిష్టువారివి ముగిసినవి.

ఉ. ఇందుసమాఖ్య వేంకటమహీరమణా రమణీయమై సదా
నందన మైనసౌధభవనంబున నీ ఘనపారిజాత మం
చుం దనరన్ బుధుల్ పొగడుచోఁ బెఱనాలుగుకల్పవృక్షముల్
పొందిక విన్కి వచ్చి కొలువుం గనె నాలుగుకల్పవృక్షముల్.

చ. అమలమణీమయాధరధరాతికనత్కమలాకరంబునన్
గమలము నీదుమేడ యిటు గానియెడన్ డిగునే తదంతరా
శమునకు నింద్రనీలజటిలం బగుకంబము పేరి తేఁటి మొ
త్తము లోఁకడై నృపాలమణి దామరవేంకటనాయకాగ్రణీ.

కాకిత వర్ణనము.

ఉ. త్రాణసమ స్తసాధుకవి దామరవేంకటనాయకేంద్ర నీ
పాణితలంబునం దగుకృపాణిక కాగిత మట్లు కానిచో
రాణఁ దతంతరాళలిపిరాజిమిషంబునఁ దిన్నగై కడుఀ
నాణెము లైనచాయలు ఘనంబుగ నొప్పునె దప్ప కెప్పుడుఀ.

సీ. శ్రీవేంకటేంద్ర భవతా పుండరీకశాయ
సత్యవ్రతేన హృదయో నిహితోద్య దృష్టః
దైత్యానుషంగమలినశ్రుతివర్ణవోఢృ
మీనోఽచ్యుత స్సలిపి కాగితకైతవేన.

మంచెళ్ల వాసుదేవకవి.

ఈతఁ డాంధ్రశబ్దచింతామణివృత్తిని గంధవహమును రచించెను.

గీ. వసుధలోపల మంచెళ్లవారి యిల్లు
శారదాదేవి నాటకశాల యందు
వాసుదేవుని కవితావిలాస మచట
మ్రోల బంగారుగజ్జెలమ్రోఁత గాదె.

ఉత్పల విజయనరసింహాచార్యుఁడు

ఉ. వాయువశంబునఀ గృహము వంగెను దాడి పడెం బొలంబుగో
మాయది గాని వేఱొకటి మాయది గాదది దేవరంచు నీ
రాయఁడు తాను దెచ్చుకొని రాయిడి వెట్టు న దెట్టికృత్యమో
మాయది దేసిరాజువరమంగపతీశ్వరమంత్రిచంద్రమా!

ఉ. కంచనపల్లి కృష్ణయకుఁ గల్గినవైష్ణవసిద్ధి స్వాములఀ
వంచన చేసి తాను బ్రతివందనవాంఛఁ దలంచుమాత్రమే
పంచనఖప్రబుద్ధనఖపాళికి నక్కలజిత్తు లెంతయా
కాంచనశైలచాప శశిఖండకలాప శివా శివాధవా!

గీ. కాటుదోమల కెల్ల నుచ్చాటనంబు
మహిమములు పాలు పిదుకంగ మంత్రసిద్ధి
సైరభపురంధ్రికిని వీచుచామరంబు
చెలఁగు నిరుదండపచ్చిక సిండమండ!

ఊళ్లపేళ్లు పురాణకథఁ గూర్చుట

క. తప్పెను మాడిన దనుటకు
నిప్పటికి శిఖండిపార్థు లెదురమరేప
ల్లెప్పేటేరున గురునకు
మొప్పము పార్థునకారుమూరగు విలువన్.

గీ. బంధుకరవది వద్దని పార్థివేంద్ర
జయము సేకూరు పాడుచేజెర్ల యనఁగ
ఎల్లజనములు రవరవం గొల్లు మనఁగఁ
బాపదశరాజు పల్లెత్తి పలుకఁ డయ్యె.

చంద్రశేఖరకవి

హత్తుగ రామభద్రునికటాక్షమ నాయెడఁ బట్టి కావ్యజృం
భత్తరధాటి మేటి ననుఁ బట్టఁగ దుష్కవిశత్రుఁ డోడు భూ
భృత్తులు చంద్రశేఖరకవీంద్ర యనన్ మనినాఁడ వీరరా
హుత్తుఁడ రెంటువీథుల మహోద్ధతిఁ జొచ్చి కవిత్వపాటవో
న్మత్తతురంగి నెక్కి హుఱుమత్తులు చూపుదు రాయరాణునన్.

## కు ప్పా ఆం జ నే య శా స్త్రి

సీ. సచ్ఛాత్రులై బుధుల్ చనుదెంచినారని
        నయనముల్ శ్రుతులకు నడపువార్త
శ్రుతు లంత నావార్త నతిమోదసంపూర్తి
        భుజశీర్షముల కెట్లొ బోధ నేయు
నిజరూప ముప్పొంగ భుజయుగ్మ మాపైని
        జానులదరిఁ జేరి సంప్రతించు
నీరీతిఁ దంతెల నిచ్చి యెవ్వాని దే
        హంబు దా సాష్టాంగ మాచరించు

నట్టిసౌందర్యవారిధి నట్టిసుగుణ
గణ్యు నచ్యుతరాజవరేణ్యు వర్ణ్యు
వేఱు వర్ణింపఁగలవారు లేరటన్న
నేను వర్ణింతు నని యూడ నెంతవాఁడ!

## వా ర ణా సి - సు బ్ర హ్మ ణ్య శా స్త్రి

సీ. సోయగంబున సూనసాయకుం డగు సాటి
        పారబడి తనువు గోల్పోవఁడేని
నానంద మొదవింప నమృతాంశుఁ డగు సాటి
        క్షీణింపకుండఁ బ్రవీణుఁడేని
దాక్షిణ్యమునను సీతాకాంతుఁ డగు సాటి
        యల సాధ్విఁ గానల కనుపఁడేని
నర్థుల కిడునెడ నంబుదం బగు సాటి
        గర్జించి మనములఁ గలఁచఁడేని

యనుచుఁ బొగడొందు మీర్జాహ్వయాంకితుండు
మహిత సౌజన్య సౌలభ్య మాన్యతముఁడు
సతతబుధజనసత్క్రియాచరణయుక్తి
ధన్యుఁ డచ్యుతరామరాజన్యవిభుఁడు.

తుర్లజోగయ్యకవి

శ్లో. కవిత్వే వాదిత్వే రిపుజనమదోద్రేకహరణే
ధనిత్వే దాతృత్వే బుధపరమనోరంజనవిధౌ
ప్రభుత్వే భోగిత్వే భగవతి చ సద్భక్తివిషయే
నరేంద్ర స్త్వత్తుల్యో నహి జగతి మీర్జాక్షితిపతే.

మొప్పర్ల - తిరుమలాచార్యుడు

శ్లో. జ్యోతిశ్శాస్త్రచమత్కృతిప్రకటనార్థం యామి రాజ్ఞాంసభాం
నో గచ్ఛామ్యుదరం ప్రతి ప్రతికలం కుర్తాపి యం భూపతిం
శ్రీమన్నల్లపరాజవంశతిలకే మత్పోషణార్థం స్థితే
నీలాద్రిక్షితిపే సమస్తవిదుషాం దారిద్ర్యవిధ్వంసిని.

వద్దిపర్తి - మంగయ్యకవి

సీ. సౌమ్యాస్యమున కుద్ది చంద్రుఁడే యందుమా
వృద్ధిక్షయంబుల వెలయుచుండె
సౌందర్యమున కుద్ది కందర్పుఁ డందుమా
యంగవిహీనుఁడై యలరుచుండె
ఘనవదాన్యత కుద్ది కర్ణుఁడే యందుమా
నీచకులంబున నెగడియుండె
వరధైర్యమున కుద్ది స్వర్ణాద్రి యందుమా
మానవాగోచర మగుచు నుండె

నిట్టిగుణములు గలుగువా రెట్లు సాటి
యవని నల్లపరాజునంశాబ్ధిజాత
రామరాజబహద్దరు రాజమణికి
యుక్తి గాదు వచోతిశయోక్తి గాదు.

వజ్ఝల - బుచ్చన్న శాస్త్రి

మ. భువనాతీతమనోజ్ఞరూపిణి సభాభూషాయమాణక్రియా
స్తవనీయస్ఫుటవాగ్విలాసిని సుధాధారారసాసారమా
నవహృద్వర్షిణి మామకీనరసనానవ్యాసనాసీన నా
కవితాకామిని నాదరింపవలదా గాఢానురాగంబునన్.

శా. తేజోరాశి దివాకరాన్వయమునన్ దేదీప్యమానుల్ మహా
రాజశ్రీపదమూలబీజహితమీర్జాప్రౌఢనామాంకితుల్
రాజత్కీర్తిధురంధరుల్ గలిగి రార్షగ్రంథసంపాదనా
సైజుల్ నల్లపరాజువా రనఁ దునిన్ రాజన్యరత్నంబులై

చం. నవకవితాసుధారసము నల్లపరాజకులామరావతీ
భవబుధరాజనందనులు పర్వ సభన్ గవిరాజషోడశ
ప్రవణకళానిపానదృఢపాన మొనర్చుటచే జరామృతుల్
గనయని దేహధారు లయి ఖ్యాతి వహించిరి విక్రమంబునన్.

వేదుల - సూర్యనారాయణ శాస్త్రి

శ్లో. రాజా నల్లపరాజవంశతిలకో మీర్జాయశోలాంఛన
శ్రీమానచ్యుతరామరాజవిభురాడ్రాజన్యచూడామణిః
ఆశానాం పరిపూరణేన హృదయం హాటాం నికామైః శ్రియం
సౌందర్యేణ విశాలయంశ్చ నయనే జగ్మూర్తి చంద్రో యథా.

నరసింహ భారతీస్వాములవారు

గీ. పైఁడిగిన్నెను సుధ నుంచి పాలు పితికి
యుంగరపువ్రేలఁ గలయంగ రంగరించి
తొడలె పాన్పుగఁ దగునట్లు పడకమర్చి
బుగ్గపై గిల్లి పాడుచు నుగ్గు పెట్టి
పెంచెఁ గాఁబోలు భారతి పిన్ననాఁడు!
గాక యుండిన వాక్సుధాగరిమ గలదె!
అమలనల్లపరాజవంశాబ్ధిచంద్ర!
సత్యకీర్తి! సీతారామచంద్రమూర్తి!

దీనికి రాజుగారు చెప్పినవి.

క. విన నింపు గలుగుఁ దొలుతను
వినినంతనె రసముఁ గ్రోల వేడుక కలుగున్
వినియును గనియును దనియదు
మనమది నీకవనమహిమ మానివరేణ్యా.

క. అంద మగునీదుసుకవిత
చందము మది నద్భుతంబు సంధించెను నా
వందన మిదె గైకొమ్మా
నందీశపదాబ్జభృంగ నరసింహయతీ!

వశిష్ఠ - అప్పల నరసింహకవి

మ. అలభోజప్రభుదర్శనంబునను గావ్యంబుల్ రచింపంగ నే
ర్పు తెల్పన్ లలి గల్గు నందురు కవీంద్రుల్ తత్ప్రవాదావళుల్
దలఁపన్ సత్యములో యసత్యములొ తెల్పంజాల నీలాద్రిభూ
వలలామున్ స్మరియించినంతనె కవిత్వం బొప్పుగాఁ జెప్పెదన్.

మ. క్షితి నక్షత్రప్రభు నిత్యకాంచన సమాశ్లేషాభిషేకోత్సవ
స్థితికన్నా గడు శ్రేష్ఠమై బరఁగునీతిప్రాజ్ఞ నీలాద్రిభూ
పతిసూత్మోదరణంబు జ్ఞానరహితవ్యాపారిణీభోగసం
గతికన్నా సరసాంగనాజనకటాక్షంబే యువామోదమా.

సీ. శ్రీకరా వినుతగుణాకరా శాత్రవ
భీకరా ప్రాకటాస్తోకవిభవ
సుందరా మణిమయమందిరా సంతతా
నంద రాకేందుపుణ్యాయశ శుభద
పావనా శ్రితమానవావనా సజ్జన
భావనాళీకమిత్రా వరగుణ
భాజనా మృష్టాన్నభోజనా విలసత్ప్ర
యోజనా కవిజనభోజసదన

గానవిద్యానిపుణ ! వైద్యగణితలక్ష
ణాంధ్రగీర్వాణయవనవిద్యాప్రవీణ !
రక్షితాఖిలదీన ! మీాజ్ఞాప్రధాన
బిరుద ! వేంకటనీలాద్రిధరణినాథ !

సీ. రోగపూరితులు నీరోగు లౌదురు గదా
మీావైద్యశాస్త్రప్రభావమునను
జ్ఞాన హీతులు సుజ్ఞాను లౌదురు గదా
మీాజ్ఞానమహిమప్రమేయమునను
ధనహీను లత్యంతధనికు లౌదురు గదా
ధనప్రాప్తసంప్రీతివలన
రసహీను లైనను రసికు లౌదురు గదా
రసికకథానుధాతసమునఁ

గానఁ జేరితి మీసన్నిధానమునను
రోగ మెడఁబాపి జ్ఞానంబు రూఢి నొసఁగి
దీనతను మాన్చి రసికతాధీనుఁ జేసి
మెలమి నేలుము నన్ను నోనృపకుమార.

రా మ క వి

సీ. వెలిబట్టు వెల్బెట్టు వలిగట్టు తలకట్టు
 బలుచట్టు పలగొట్టు వాలుగుట్టు
కలమించు చెలినించు కలయించు నలయించు
 విలుగొంచు బలుఁద్రుంచు విభునిసంచు
మగరాలు తొగరాలు నగజాలు తొగజాలు
 వగరేలు దగ నేలు వానిడాలు
సరిపారు దరిజేఱు దరిదూరు నరిఁజేరు
 సరిమీఱు నెఱివీరు సన్నతీరు

నగనగేశ్వర శారదనారదౌఘ
శారదానారదామృతపూరదరద
దరదరతుఁ్కందవిస్ఫూర్తి త్వత్సుకీర్తి
రమ్యగుణసాంద్ర! నీలాద్రిరాజచంద్ర!

సీ. శేషశైలోత్తుంగ శేషఫణాకదం
 బము మగటాలకంబంబు గాఁగఁ
బరమసంపత్పూర్ణ పరమహీనాథపూ
 స్నమితి బల్రతనంపుఁబ్రమిద గాఁగ
నమితసంపద్గర్వ విమతపరంపరా
 స్ఫూర్తి తైలార్తసద్వర్తి గాఁగ
దావకీలిస్ఫురత్తావకీనప్రతా
 పంబు ప్రకృష్టదీపంబు గాఁగ

పద్మజాండోర్ధ్వఖండ మన్నటుళరావ
ముంచి మీకీర్తికాంత శాటించినట్టి
కజ్జలము సుమ్ము గగనభాగమ్ము నమ్ము
రమ్యగుణసాంద్ర ! నీలాద్రిరాజచంద్ర !

సీ. నవరసవిస్ఫారనాటకాలంకార
సాహితీపరిపూర్ణశక్తిశాలి
హృద్యానవద్యాంధ్రవిద్యావినిర్నిద్ర
పాండిత్యకౌశలీపరివృతుండు
పారశీకవిశేషభాషాచమత్కార
బంధురప్రతిభాధురంధరుండు
ప్రకటశస్త్రగజాశ్వరత్నాదికానేక
శాస్త్రపరీక్షావిచక్షణుండు

పృథుతరాటోపకవితకీర్తిప్రతాప
కాంతిపూరితసకలదిగంతరుండు
వితతవితరణనిర్వక్రవిక్రమాది
రమ్యగుణపాళి నీలాద్రిరాజమౌళి.

మిక్కిలి - మల్లయ్యకవి

ఉ. ఎట్టి సువంశమందు జనియించిన నట్టిగుణాళి మీఱి చూ
పట్టినమానవుం డొకరిప్రాపునఁ బూజ్యతఁ గాంచుఁ గానఁ దా
నెట్టన వీణదండ మొకయించుక తుంబిఫలంబు లేక గ
న్పట్టునె రమ్యమై గుణగణాకర వేంకటరాయశేఖరా!

(శిథిల మగుపండితరాయశతకములోనిది)

# చాటుపద్యమణిమంజరి

## రాజప్రశంసాస్తబకము

### విక్రమార్కుఁడు

సీ. ఉదయతాళం బెక్కి యుట్టిచేరులు గోసి
శూలాలపాతఱి గూలవైచె
...గ్ని నుఱికి యప్పాతాళకేతువుఁ
దెగటార్చి శశిరేఖఁ దెచ్చుకొనియె
బేతాళు బంధించి బిలకన్య పాపకుఁ
దనమేనికండలు తఱిగి మేపె
పైఠాణినగరంబుఁ బరువడి సాధించి
గుళికసిద్ధునిఁ బట్టి గోళి చేసె
రసకూటమున కేగి రణతాంబరములోని
గవి నున్న సింహాము గజము దునిమెఁ
గన్నంబులో నెరకాలునితలఁ ద్రుంచి
పాములమొగ్గని పంత మడఁచె
జడియక పాలంక బడి సదాశివునిచే
నసితాతపత్రంబు లందుకొనియె
కాద్రాసురునిఁ జంపి రయమున నింద్రుచేఁ
గనకంపుఁబుత్తడిగద్దెఁ దెచ్చెఁ
గంఠరక్తంబునఁ గాళికి విందిచ్చి
యరయ హోమాగ్నికి నాహుతయ్యెఁ
జిత్రకంకాళిచే సింగినాదముఁ గొని
మొఱవెట్ట మృత్యువు ముక్కుఁ దునిమె
యోగవాగాలు కంబము నొనరఁ దాల్చి
చెప్ప నరుదుగ లోకప్రసిద్ధుఁ డయ్యె
నెన్ని చూడంగ నిటువంటి వెన్ని లేవు
విక్రమార్కుండు చేసిన వితరణములు.

సీ. భరతునిలాగునఁ బరశురామునిరీతి
రంతిదేవునిభంగి రాముపగిది
నంగునిరేఖ యయాతిభావంబున
బృథువిధంబున భగీరథునిమాడ్కి
గయులీల మాంధాతకైవడి నంబరీ
షునిరూఢి శశిబిందుసోయగమున
శిబిపోలిక మరుత్తుచెలువున నంగుని
కరణి సుహోత్రునిగారవమున

గీ. సగరువెరవునఁ బురుకుత్సుసరణి నలుని
రమణ నర్జునుక్రియఁ బురూరవునిచంద
మున హరిశ్చంద్రుతెఱఁగున వినుతికెక్కె
సాహసాంకుండు వసుమతీచక్ర మేలె.

క. పొడగన్నంతనె వేయును
నుడివినఁ బదివేలు నగిన నూర్వేలు మనం
బొడఁబడ మెచ్చినఁ గోటియు
నడిగెడివారలకు విక్రమార్కుం డిచ్చెన్.

సీ. ప్రకటప్రతాపాతపముచేత వైరుల
కన్నులఁ జీకట్లు గ్రమ్మఁ జేసి
ఖడ్గహాలాహలగరిమచే నహితుల
నమృతాశనులఁగాఁగ నలవరించి
సలలితసత్కీర్తిచంద్రికఁ బగతుర
మనసులతాపంబు మట్టుకొలిపి
సముదగ్రనారాచశరవృష్టి విమతుల
తనువులఁ జెమటలు దనుపు గొల్పి

గీ. చిత్రచారిత్రవిక్రమశ్రీ వహించి
సాహసాంకమహీపాలచక్రవర్తి
జలధివలయితవసుమతీచక్రవర్తి
చండభుజదండకలితుఁ డై యుండు నంత.

సీ. నవరత్నభూషణానారతరణభూమి
విలసిల్లుకల్యాణవేది గాఁగ
దళితకుంజరకుంభకలితమౌక్తికరాజి
రమణీయసేసాక్షతములు గాఁగ
సమరసంక్రీడనసందర్శనాగత
సురకోటులును బెండ్లిదొరలు గాఁగ
బహువిధజయతూర్యబహులనిస్వనములు
రమ్యమంగళతూర్యరవము గాఁగ

గీ. నుచితకాలజ్ఞుఁ డగుభట్టి యొజ్జ గాఁగ
సచల (వీర) ప్రతాపాగ్ని సాక్షి గాఁగ
విజయలక్ష్మి సమేతుఁడై విలసనమున
సాహసాంకమహీపాలచంద్రుఁ డొప్పె.

సీ. బలమునఁ జలమునఁ బ్రాణరక్షణమున
భీము భీమాగ్రజు, భీమగురునిఁ
గెలువున సంకల్పసిద్ధిఁ దేజంబునఁ
బద్మారిఁ బద్మజుఁ బద్మమిత్రు
శివభక్తి మూర్తి విశిష్టదానంబున,

—— (పా త ము) ——

అర్థిభ్యః కనకస్య దీపకపిశా విశ్రాణితా రాశయో
వాదే వాదవిషాణినాం ప్రతిహతా శ్శాస్త్రోక్తిగర్భా గిరః
ఉత్ఖాతప్రతిరోపితై ర్నృపతిభి శ్శారై రివ క్రీడితం
కర్తవ్యం కృత మర్థితా యది విధే స్తత్రాపి సజ్జా వయమ్.

ప్రతాపరుద్రచక్రవర్తి.

సీ. పూర్వాపరాబ్ధులు పొలిమేరలై యుండ
నేరాజు జగమెల్ల నేలఁ గల్గె
లక్షింపఁ దొమ్మిదిలక్షలవిలుకాండ్రు
నేరాజుబలములో నెలమిఁ గలరు
ధరణి డెబ్బదియేడుగురు నాయకోత్తము
లేరాజు సేవింతు రిచ్ఛగించి
దాక్షిణాత్యుల నెల్లఁ దఱిమి జయస్తంభ
మేరాజు నిల్పె రామేశ్వరాన

గీ. నతఁడు కాకతివీరరుద్రావనీశుఁ
డమ్మహారాజు చెప్పంగ నలరె ధాత్రి
రాజశేఖరుఁ డెంతయు రమణతోడ
జగముఁ బాలించు భూలోకచక్రవర్తి.

మైలమభీమన.

ఈతనిపేరఁ గల్గుపద్యములు ("గరళపుముద్ద—" ఏఱువభీమ-) వే(లే)ములవాడభీమకవికృతములుగాలక్షణగ్రంథములందుదాహరింపఁ బడినవి. ఈక్రింద నుదాహరింపఁబడుపద్యము లెల్ల నొక్కవరుసలోనివే

యగుటచే నొక్కరిచేతనే (భీమకవిచేత) రచియింపఁబడిన వనుకొనెదను. భీమకవిపద్యములు నల్లసిద్ధి, సాహిణిమారన, చాళుక్యచొక్కభూపతి, కళింగగంగు(చోడగంగఁడు) తెలుంగాధీశుఁడు, మైలమభీముఁడు నను వారికిఁ బ్రసక్తించినవి యగుటచేత- నాయందఱు సమకాలమువారు కాఁదగుదురు. భీమకవినిగూర్చి "ప్రబంధరత్నావళి" పీఠికలోఁ గొంత విస్తరించిచర్చించియున్నాను. విజయనగరసంస్థానప్రభువు లగుపూసపాటివారి మైలమభీమనసంబంధు లఁట ! ఈతఁడు ఏలేరు, కసిమి, వేంగి, కళింగలను జయించినట్టు పద్యములం దున్నది. ఏఱువభీమ మైలమభీమ పదము లొక్కనిపేళ్ళే. ఏఱువవంశమున నల్లభీముఁ డని ఎఱ్ఱభీముఁ డని యిద్దఱు భీము లున్నారు. అందొకఁడు మైలమభీముఁడు గాఁబోలును.

ఉ. యాచకఖేచరుండు సుగుణాంబుధి మైలమభీముఁ డీల్గినన్
జూచి వరించె రంభ, యెడఁజొచ్చెఁ దిలోత్తమ, దారి నిద్దఱన్
ద్రోచె ఘృతాచి, ముగ్గుఱకు దొడ్డడిక్యయము పుట్టె నంతలో
నాఁచుకుపోయె ముక్తిసతి నవ్విరి యద్దశఁ జూచి నిర్జరుల్
నోఁచినవారిసొమ్ము లవి నోమనివారికి వచ్చునే ధరన్.

[ఇందలి కడపటి చరణము నాచనసోముని యుత్తరహరివంశ మందును గలదు.]

చ. అహితులఁ దాఁకి పోరునెడ నంబుధి కల్గిననాఁటిరాము గో
గ్రహణమునాఁటిపార్థు గదఁ గౌరవు నేసిననాఁటిభీము నా
గ్రహ మెసఁగం బుర్రత్రయముఁ గాల్చిననాఁటిలలాటలోచనున్
మహి నుపమింపఁగాఁ దగునె మైలమ భీముని భీమవిక్రమున్.

ఉ. పన్ని తురంగమంబునకుఁ బక్కెర వెట్టినవార్త హేరిచే
విన్న భయంబునం గలఁగి వీసరనాడును చక్రకోట్టమున్

మన్నియపట్టణంబులును మక్కున వేంగి కళింగ లాదిగా
నిన్నియు నొక్కపెట్టిగొనె నేఱువభీమనృపాలుధాటికిన్.

క. అరివరు లేఱువభీమని
పొరువున మనలేరు చిచ్చుపొంతను వెన్నై
తెరువునఁ బెనరై జూదరి
సిరియై రేన్చెట్టుక్రింద జిల్లెడుచెట్టై.

ఉ. ఆలములో నరాతులకు హమ్మని మార్కొనవచ్చునే మహా
కాళికి శూలికిన్ బ్రళయకాలపుగాలికి రాఘవేంద్రుబా
ణాళికిఁ బక్షినాయకునఖాళికి మత్తగజేంద్రవైరిదం
ష్ట్రాళికి దావపావకశిఖాళికి మైలమభీమువాలికిన్.

ఉ. నేరుపు బ్రహ్మఁ జేరె నిజనిర్మలతేజము సూర్యుఁ జేరె నా
కారము కాముఁ జేరె నధికం బగులక్ష్మి యనంతుఁ జేరె గం
భీరత వార్ధిఁ జేరెఁ గలపెంపు కులాద్రులఁ జేరెఁ గీర్తి దా
నూఱట లేక త్రిమ్మఱుచు నున్నది మైలమభీముఁ డీల్గినన్.

చ. గరళపుముద్ద లోహ మవగాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోఱలు పట్టుకార్లు ది
క్కరటిశిరంబు దాయి లయకాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణగుణాభిరాముఁ డగుమైలమభీమనఖడ్గసృష్టికిన్.

మ. తెరలంబాఱి నభంబు దాఁకినఁ బయోధిం జొచ్చినన్ శైలగ
హ్వరముల్ దూఱినఁ జిక్కభీముఁడు నృపవ్రాతంబుఁ బోనిచ్చునే
గరుడండై చని పట్టు మింటితుద నుగ్రగ్రాహమై చొచ్చి సా
గరమధ్యంబున మ్రింగుఁ బట్టుకొను సింగంబై గుహాంతంబునన్.

క. ఆలమునఁ జిక్కి భీముఁడు
వా లతివేగమునఁ బెటికి వడి తుదఁ గవియన్
ద్రేలిపడఁ బడుగు నేసెను?
ఏలేరును గసిమి భైరవేశుం డెఱుఁగన్.

ఉ. వీరగుణప్రతాపగుణవిశ్రుత! మైలమభీమ! నీయశం
బారభమానతారకరహారవిలాసము నీనికేతనం
బారభమానతారకరహారవిలాసము నీభుజార్గళం
బారభమానతారకరహారవిలాసము చిత్ర మిద్ధరన్.

ఉ. భండనభీమ నీయెదురఁ బాఱక నిల్చినశాత్రవుల్ బృహ
న్మండలపుండరీకపురనాకనివాసులు నోర్చినన్ బృహ
న్మండలపుండరీకపురనాకనివాసులు చచ్చినన్ బృహ
న్మండలపుండరీకపురనాకనివాసులు చిత్ర మిద్ధరన్.

చ. విదితగురుప్రతాపగుణవిశ్రుత! మైలమభీమభూప! నీ
పదిలపుఖడ్గధారఁ దెగి పాఱినవీరుఁడు గోపురంబుపై
విదితసువర్ణరత్నమయవేదికమీఁదను నిల్చి కాంచు నాఁ
బదిపదు లగ్నిహోత్రులను బన్నిరుసూర్యుల నూఱుచంద్రులన్.

చ. అసమునఁ గాశికానగరమం దసువుల్ త్యజియించినంతనే
యసదృశ మైనకన్నుఁ గల దచ్చట మైలమభీమభూవ నీ
యసిఁ దెగిపడ్డవైరులకు నంబకముల్ పదినూఱు లయ్యె నీ
యసికిని వారణాసికిని నంతర మెంత దలంచి చూచినన్.

క. వసుమతిలోఁ జిరకాలము
మశకంబై మనుటకంటె మదకరికుంభ

గ్రసనం బగుసింహాంబై
మసలుట యొకగడియ చాలు మైలమభీమా!

(అమృతనాథుఁడు) మాచయబ్రహ్మఁడు

ఈతఁడు నాచనసోముని వసంతవిలాసకృతికిఁ బతి యని, యా గ్రంథమందలి మొదటిపద్య మిది యని శ్రీరామకృష్ణకవిగా రుదాహరించినారు.

శా. శ్రీచన్నంగవ క్రేవఁ గ్రొమ్మొలఁగులన్ శృంగారవుందోటకున్
ప్రాచీనం బగుచున్న వింశతినఖప్రౌఢిన్ సుఖాంభోధివే
లాచంద్రోదయ మైన దేవుఁడు కృపాలంకారచిత్తంబునన్
జూచున్ మాచయబ్రహ్మధీమణిఁ గవిస్తోమైకచింతామణిన్.

ఈతనిఁగూర్చి చాటువు:—

సీ. కమలంబునకుఁ బుట్టి కమలంబుచుట్టమై
కమలంబు తననాభిఁ గాంచిగాక
గంగకు నుదయించి గంగ నౌఁదలఁ దాల్చి
గంగలో భువనంబు గలపి గాక
జలరాశి జన్మించి జలరాశి లంఘించి
జలరాశి బాణాగ్నిఁ జమరి గాక
వహ్నికి నుదయించి వహ్ని నెచ్చెలిఁ జేసి
వహ్ని ఖాండవముపైఁ బ్రాఁకి గాక
గీ. యూరకెవ్వారు నీతోడ నొరయువారు
బుద్ధి తేజోరమాశౌర్యభూతియత్న
కాంతివిక్రమఖ్యాతిసంగతుల నలరి
ప్రాభవోదార! మాచయబ్రహ్మధీర!

## హరిహరరాయలు

చ. హరిహరదేవ నీ వవినతారుల నద్భుతలీలఁ ద్రుంపఁగా
గరికరి వాజివాజి నవఖండవిఖండవిఖండధారలై
యరుదుగ నీదుహేతి జఠరాగ్నులఁ బర్వుచు నెవ్వ దుండుగా
ధరధర ధారధార ధరధార ధరాధర ధారధారలౕ (?)

## ప్రౌఢరాయఁడు

సీ. సర్వసర్వంసహాచక్రవర్తికి భట్టు
ఘన మైననాయకాగ్రణికి భట్టు
రణసముద్భటవీరరాహుత్తునకు భట్టు
కనుపట్టుదాతరాయనికి భట్టు
ప్రియనరౌన్నతి గలబిరుదురాజుకు భట్టు
సుచరిత్రుఁ డగుగృహస్థునకు భట్టు
సప్తసంతానాతిశాంతాత్మునకు భట్టు
గణుతింపఁ దగుమంత్రిమణికి భట్టు

క. కాక యత్యంతలోభివికారగరిమ
చటులదుర్భాషితానేకజనకఠోరుఁ
డైనమేధావిహీనున కవును భట్టు
లక్షణోపేంద్ర ప్రౌఢరాయక్షితీంద్ర.

## పోతుగంటి - మైలానేఁడు

సీ. బలిమిఁ బ్రతాపునికొలువునాయంకుల
కుంచెలు మాన్పినగురుభుజుండు
భువి దొడ్డమారెమ్మగవిని దూరుచు నగ్గ

ప్రకటవిద్వేషినాయకులమగఁడు
ఎలమి డెబ్బదియేడ్గు రలరారఁ గొల్చిరా
రుద్రదేవుని యొద్ద భద్రగజము
పరతేర నందఱుఁ జూడంగఁ గరిఁ ద్రోచి
హరిదంతిభీమాంకుఁ డనఁగఁ బరఁగి

గీ. ధరణిలోన వెలయుదండాడుగండాంక
భీమనృపతిపుత్ర పృథులగోత్ర
పోతుగంటిమైలభూపాల! నీచేతి
హేతి కెదురు నిల్వ నెందు లేరు.

సీ. మానిసికొండొద్ద మన్నె వేశ్యాభుజం
గాంకుబొమ్మయదేవు నాజిఁ బరపె
నీసునఁ బైపడ్డ బోసంగికడదాఁకఁ
బరఁగ మంగయనేని భంగపఱిచె
పోరిలో మెఱయుకొండూరినల్లయరెడ్డి
... ... వెసఁ జీమలేటిబయుల
నుప్పరపల్లొద్ద నుద్వృత్తిఁ బైపడి
ఢిల్లితురుష్కుల త్రుళ్ళడంచె
ఢిల్లిలో దెలుఁగుబిజ్జలనృపాలుని గెల్చి
తావిశలకీర్తిధర్మగతిని నిల్పె?

గీ. ..........................
భీమభూపాలసుతుఁడు తద్భీమబలుఁడు
వైరిగజభీముఁ డమితసత్త్వప్రియుండు
ఘనభుజాశాలి యగుపోతుగంటిమైలి.

సీ. ఢిల్లిలో సురథానుఁ డొల్లివేదిధరాది [?] (దల్లాయుదీశధరా)
దృ(ధ్య)తుండు ప్రత్యక్షసాక్షి గాఁగ
మహనీయజయశాలి మలికినేమూరుండు
జగదేకశూరులు సాక్షి గాఁగ
జగతిపై దెబ్బదేడుగురు నాయంకులు
నక్షీణబలయుతుల్ సాక్షి గాఁగ
సహజసాహసయుద్ధసన్నద్ధవరభటా
శ్రయమైనదాకోలు సాక్షి గాఁగ

గీ. సూర్యవంశోదయఖ్యాతుఁ డార్య తెలుఁగు
బిజ్జలనృపాలు గెల్చెఁ దద్భీమబలుఁడు
వైరిగజభీముఁ డమితసత్యప్రియుండు
ఘనభుజాశాలి యగుపోతుగంటిమైలి.

ఈ య న కొ డు కు

సీ. మాయురే ఘాశోరమల్లసంహారణాంక
చాఁగురే తెలుఁగుబిజ్జలవిభాళ
హాహా సముద్ధతాహవవైరిగజభీమ
మేలుమేలు కులపిశాలిగోత్ర
హోహో సత్కీర్తిసముచ్ఛ్రితబ్రహ్మాండ
హాహే ప్రశస్తదండాడుగండ
యవురపాంబాదేశహన్నిబ్బవరగండ
బళి శేతిదంపభూపాలదళన

గీ. యనుచుఁ గొనియాడుదురు నిన్ను నర్థిజనులు
మగధమాళవనేపాళమత్స్యసభల

భీమభూపాల సత్పౌత్ర పృథుచరిత్ర
విభవనాభాగ మైలభూవిభునినాగ !

ఉ. వల్లభ ! భోగభాగ్యసురవల్లభ ! చారువివేకశారదా
వల్లభ ! నిత్యసత్యరఘువల్లభ ! ధర్మవిచారద్రౌపదీ
వల్లభ ! వాగ్విలాసఫణివల్లభ ! కాంతివిహారశారదా
వల్లభ ! చింతపల్లుపురవల్లభ ! అబ్బనృపాలువల్లభా!

మ. కదిలెన్ ఖండియరాయవల్లభుఁడు వేడ్కన్ దాడి యీధాత్రిపై
నదె ఛత్రం బదె చామరం బదె హయం బన్నన్ భయభ్రాంతులై
కదనోర్వీధరచాపచక్రధృతిగా ఖడ్గాదిశస్త్రాస్త్రముల్
చదరన్ వైచి తదీయవైరులు గిరుల్ సంప్రాప్తులై రక్కటే !

ఆ త ని కొ డు కు

ఉ. ఖండన మాటపట్టు జయభామిని నెచ్చెలి చండవిద్విష
న్మండలి దేహరక్తములు మానక పానకముల్ గ్రసించు ను
ద్దండత డాకినుల్ సఖులు తక్కనభూతము లర్థు లిమ్మహిన్
ఖండియరాయవల్లభుని గన్ననృపాలకరాసిపుత్రికిన్.

అ త ని య ను జుం డు

సీ. ప్రతిపక్షసుందరీబంధురస్తనముల
పసుపుఁబయ్యెదలకుఁ బాయు తెరువు
రిపురాయభామినీవిపులధమ్మిల్లంబు
విరులనత్తావికి వీడుకోలు
శాత్రవకామినీచటులనేత్రంబుల
కలికికాటుకలకుఁ గానివాని

యరిరాయభామినియారుణాధరముల
సొబగువీడెములకుఁ జుక్కయెదురు

గీ. చేసె నారార ధాత్రి నీచేకతారి
వైరిగజభీమ వల్లభేశ్వరకుమార
వనజహితతేజ ! కామినీజనమనోజ !
బహుళతరాటోప ! సింగభూపప్రతాప !

ఈసింగమనేఁడే రావు (చౌసీతివరాల) సింగమనాయని బావమఱఁది.

గజరావు - తిప్పరాయఁడు

సీ. యవనుల గెల్వఁడే యంపరాయలు చూడ
నెట్టినఁ గంబము మెట్టుబెట్టఁ
బరిపంథియోధులఁ బరపఁడే వాఁడిమై
నుద్దండవృత్తి కోనూరియొద్దఁ
గాటయవేమభూకాంతుసైన్యం బెల్లఁ
గొట్టఁడే యలగుండుగొలనిరేవ
చమడపామాత్యుని సాచిగాఁ గొట్టఁడే
కొండవీ డాపెద్దకొండగడిని

గీ. ప్రబలరణరంగజయభేరిభాంకృతుండు
రాయచేకోలుగండధరావిభుండు
రామ రఘురామ బలభద్రరామవిభుఁడు
దీప్రబలుఁడైనగజరావుతిప్పఘనుఁడు.

సాహిణిమారన

సీ. జడలలో మిన్నేఱుఁ జంద్రరేఖయుఁ గల
యాతఁడీతండు నేమాదు రొక్క

నరవజ్రకవచంబు వజ్రాయుధము గల
యాతఁ డీతండు నేమాదు రొక్కొ
కోల్పోవుతనయుండు క్రోఁతిటెక్కెము గల
యాతఁ డీతండు నేమాదు రొక్కొ
చెఱకుసింగిణివిల్లు సెలగోలయునుగల్గు
నాతఁ డీతండు నేమాదు రొక్కొ

శంభుఁ డాతండు శాశ్వతారంభుఁ డితఁడు
ఇంద్రుఁ డాతండు భోగదేవేంద్రుఁ డితఁడు
పార్థుఁ డాతండు సమరసమర్థుఁ డితఁడు
మారుఁ డాతండు సాహిణిమారుఁ డితఁడు

## అనవేమారెడ్డి

రెడ్డిరాజులలో నీతఁడు విఖ్యాతబలపరాక్రముఁడు. క్రీ. శ. 1370 ప్రాంతముల నున్నవాఁడు. రెడ్డిరాజ్యమునకు నద్దంకి రాజధానిగా నుండఁగా నీతఁడు క్రొత్తగాఁ గొండవీడుదుర్గమును గట్టించి తనకు రాజధానిగాఁ జేసికొన్నాఁడు. "కొండవీడుం రాజధానీం సవిచిత్రామకల్పయత్। దృష్ట్వా త్వష్టాపి వైచిత్ర్యద్యస్యామభూస్సవిస్మయః" ఈతఁడు వెల్గోటి వెలమరాజులతోఁ బోరాడి రాజ్యమును బెంపు వెలయఁజేసినశౌర్యశాలి. ఈయన నవరాజధానీప్రశంసాత్మక మగు సమస్య:—

ఉ. వ్రేటున కాఱుతున్కలుగ వేయఁగ జాలినరాయరాతులున్
బోటరులైనవీరభటపుంగవు లోయనవేమభూప! నీ
పీటను గల్గి యుండఁగను విగ్రహు లెంతటివా రెదుర్పఁగా
ఘోటకహాటకప్రకటకుంజరధాటికిఁ గొండవీటికిన్.

ఉ. కాటమరెడ్డివేమఁ డవఘాటమహోద్భటచండఖడ్గుఁడై
కాటమ తేనికోట గొని గౌతమవాహిని దాఁటి పోయి యా
కోటల నున్న రాసుతులఁ గోమలులన్ దగఁ గొంచు వచ్చెఁ బో
ఘోటకహాటకప్రకటకుంజరధాటికిఁ గొండవీటికిన్.

ఉ. ఘోటకభోటహాటకకురుకొంకణసింధుమరాటలాటక
ర్ణాటకళింగవంగద్రవిళాంగవిదేహకరూశదుర్గముల్
సాటియె యన్నవేమవిభులావిభుఁ డేలినదుర్గ మైన యా
ఘోటకహాటకప్రకటకుంజరధాటికిఁ గొండవీటికిన్.

ఉ. ఎత్తినబీర మొప్పఁ గడునేపున వేమయయన్న వేముదం
డెత్తినవార్త విన్నఁ బరువెత్తుతలంపులె యెత్తుఁ గాని మో
మెత్తను జెప్పలెత్త గొడుగెత్తఁ బతాకము లెత్తఁగా మనం
బెత్తద శత్త్రరంబు మెయి నెత్తినభీతి నరాతికోటికిన్.

శా. భద్రత్యాగగుణాయురాహవకళాప్రస్ఫూర్తిఁ గోదండసం
పద్రేఖాకృతి నన్నవేమనృపతిన్ భాషింతు నీభూమి నే
భద్రేభాంతకు భానుపుత్త్రుఁ భరతున్ భాషాప్రియున్ భార్గవున్
భద్రున్ భాను భగీరథున్ భవసుతున్ భంగోద్భవున్ భావజున్.

క. విని చెప్పకున్న దోషం
బని చెప్పినఁ గొండె మందు రది యెట్లన్నన్
నిసుఁ బొంది కీర్తికామిని
యున వేమనృపాల! దెసల కరిగెను జుమ్మీ!

సీ. వీరనారాయణవిభుఁడు గొల్లెన యెత్తె
నేవంక దాడిగా నేఁగువాఁడొ

రాజవేశ్యావిటరాజు తేజీ నెక్కి
వాహ్యాళిగా నెందు వచ్చువాఁడో
జగనొబ్బగండందు సరసబంటులఁ జేర్చి
నేకోటఁ జుట్టుకో నెన్నినాఁడో
కలియుగబేతాళఘనుఁడు ఖడ్గము పూనె
ధరలోన నెవనికై తలఁచినాఁడో

గీ. యెఱుఁగరా దని వేగరు లెఱుఁగఁ జెప్ప
నీదుశాత్రవబలములు నిద్ర లేక
తివిరి జడిసిరి నీఖడ్గతీవ్రఘాటి
నతనుసమరూప! యనవేమనాఖ్యభూప!

సీ. సంహారభైరవచండబాహాదండ
డమరుడిండిమ (రవా) డంబరంబు
మందరక్షోణీంద్రమంథానసంధాన
దుగ్ధాబ్ధిగాంభీర్యధూర్వహంబు
నృహరి కంఠ కఠోర కహాకహా ... ...
... ... ... ... ..

సీ. పావకపరమేష్ఠిపవనపారావార
పాకశాసనులు నీపాటివారు
కందర్పకాశ్యపీకమలాధిపతికర్ణ
కాలకంధరులు నీకరణివారు
యామినీశయయాతియాదోధిపతియక్ష
యమతనూభవులు నీయంతవారు
తపనతాటక ? వైరితాలాంకతారాద్రి
తారకాంతకులు నీతరమువారు

గీ. శుద్ధిమతిరయగాంభీర్యవృద్ధిరూప
శాంతికరుణావితరభూతికాంతిభాగ్య
సారధనధర్మ తేజోతిశౌర్యధైర్య
భుజబలంబుల ననవేమభూపవర్య!

సీ. భరతభాషారాడ్బ్రుదరభీష్మ భుజగాధి
భూభేశభైముల పోల్పువాఁడు
మధుమారమిహిర మీనధవముద్గరమూర ?
భిన్మేరిమైత్రుల పేర్మివాఁడు
శకశాక్ర శిబిశీక (వకురీట) శుకశూక
శేషశైనేయుల సెలవువాఁడు
కరికాలకిరికీల కురుకూలకెసకేస
కైటభారాతుల కరణివాఁడు

గీ. స్థితికళావేష్టిజవసహ్యద్ధృతిజయార్థి
తనుమనోజాతధైర్యసదన......
......దానవిద్యాయ బుద్ధివినుత
ఘనబలోపేతుఁ డనవేమజనవిభుండు

ఉ. ధారుణి రాణివాసి నని తానను చున్నది యన్న వేముతో
మారుతభుక్కులాధిపుని మానఁగఁ గారణ మేమికల్గెనో
... ... ... ... నారి వైనయా
నారికి నారివైనఁ బరనారులు నవ్వరె ముజ్జగంబులన్.

క. ఏపనికిఁ దగినమనుజుని
నాపని కనుపంగ లేక యవనీశుఁడు దా

నోపనిమనుజునిఁ బంపిన
నాపని దాఁ జెఱిచినట్టు లనవేమనృపా!

సీ. కర్ణాటభూపాలు కంఠహారముమీఁద
గురురాజు ముత్యాలగొడుగుమీఁద
హిందుదేశాధీశు నెల్లిజల్లీలందు
గాళేశు వజ్రాలగద్దెమీఁదఁ
బాంచాలభూపతి పట్టుపుట్టముమీఁదఁ
బాండ్యభూపతి వెండిభరణిమీఁదఁ
గాళింగభూపతి గంధసారముమీఁద
సౌరాష్ట్రవిభు చంద్రశాలమీఁద

గీ. నాడుఁ బాడు నటించును నవఘళించుఁ
బొంచుఁ దురలించుఁ గుప్పించు భూత్కరించు
సంతసంబున నీకీర్తిజలజనేత్రి
మానుషోపేంద్ర! యనవేమమండలేంద్ర!

పె ద కో మ టి రె డ్డి

ఉ. వీపున మోపెఁ గచ్ఛపము వెండి భుజంగమరాజు మస్తక
స్థాపితఁ జేసె నీవు వసుధారమణిన్ బెదకోమటీంద్ర! బా
హాపరిరంభగుంభసముదంచితఁ జేయుట యింత యొప్పునే
మోపరు లేమెఱుంగుదురు ముగ్ధలతోడివిహారధర్మముల్.

పెదకోమటి వేమారెడ్డి

ఈయనకు సర్వజ్ఞచక్రవర్తి యని బిరుదు. అమరుశతకవ్యాఖ్యా సాహిత్యచింతామణ్యాది కృతుల కీయన కర్త. శ్రీనాథకవిసార్వభౌముఁ డీయన యాస్థానమున విద్యాధికారి. క్రీ. శ. 1404 మొదలు 1420 వఱకు నీతఁడు రాజ్యపాలనము చేసినాఁడు.

సీ. కపటకంఠీరవాకారనారాయణ
క్ష్వేళానినాదంబు గేలిసేయఁ
గల్పాంతదుర్దాంతకాలభైరవభేరి
ఢమరుకోన్మాదం బడంగఁ జేయఁ
బ్రళయకాలాభీలపటుఘోరనిర్ఘాత
పటుపుటారావంబుఁ జటులపఱచు
ఘుహానామహాకాలకోలాహలోత్తాల
పాతాళనినదంబు భంగపఱచు
గీ. గండు మెఱసినరిపుకోటిగుండె లవియఁ
జండగతి మ్రోయు నీరణోద్దండభేరి
జయరమాసంగ! రాయవేశ్యాభుజంగ!
యతులబలధామ! పెదకోమటన్న వేమ!

సీ. కానీనకాకోక కానీనకాకోక
కానీనకాకోక కాద్రవేయ
కాద్రవేయాధర్మ కాద్రవేయాధర్మ
కాద్రవేయాధర్మ కాలకాల
కాలకాలప్రాంగ కాలకాలప్రాంగ
కాలకాలప్రాంగ కారకార
కారకారగ్రాహ కారకారగ్రాహ
కారకారగ్రాహ గ్రాహగ్రాహ
గీ. గాహగాహాను గాహానుకైనధూమ
ధూమనాటీక నాటీకదురభిమాన
రమ్యగుణలోల! సంగడిరక్షపాల!
యమితగుణధామ! పెదకోమటన్న వేమ!

చ. ధరణియె బొమ్మరిల్లు వసుధావరపంక్తులు బొమ్మ లంబుధుల్
గురుగులు చక్రవాళగిరి కోట నభంబది సేసకోర ని
ర్జరగిరి గద్దెపీట యినచంద్రులు చేటికవాళిపళ్లెముల్
గురుతరపుణ్యుఁడైన పెదకోమటివేమునకీర్తికాంతకున్.

సీ. ఆ చెంప నుద్దండ? (అచ్చంపువుద్దండ) అనవేమపూరకాసు
గ్రామంబు తోరణ కట్టి రేని
ధరణికోటను గల్గుధనధాన్యవస్తువు
లరికట్టుకొని చూఱలాడి రేని
మునుకొని యభిమానముద్ద (?) భక్షింపంగ
సారెకుఁ జేతులు చాఁచి రేని
అభ్యంజనము సేయునన్నగారికిఁ [నన్న వేముకు] దెచ్చు
నూనెలోఁ జెప్పులు నూటి రేని

గీ. కణఁగి శత్రులు [విప్రులు] సేయునోగాత్యమునకు
నోర్చియుంటివి నీసాటి యుర్విఁ గలఁడె
[ఓర్చి కీర్తులు గాంచితి వుర్విలోన
నెన్న రాజులు సాటిరా రెవ్వరైన]
సమదరిపువీర రాజవేశ్యాభుజంగ!
అతులబలభీమ! పెదకోమటన్న వేమ!

కాటయ వేమారెడ్డి.

ఈతఁడు కాళిదాసునాటకత్రయమునకు వ్యాఖ్యాత. కుమారగిరిచేఁ గొండవీటిరాజ్య మేలించినవాఁడు. "నప్తా కాటయశౌరేః పౌత్రః కుమారస్య కాటనృపసూనుః । వీరాన్నపోతనృపతే ర్జామాతా జయతి వేమభూపాలః"—ఈయనభార్య కుమారగిరితోఁబుట్టువు. కుమారగిరి తనయవసానకాలమున నీతనికి రాజమహేంద్రప్రాంతదేశమును బారితోషికముగా నొసఁగి యక్కడికిఁ బంపినాఁడు. తనయేకపుత్త్రికను

మృతినొందఁగా నితఁ డారాజ్యమును దనయల్లుఁ డగువీరభద్రారెడ్డి కరణముగా నొసఁగి యాతనికి బాసటయై యక్కడ జీవితశేషమును గడపెను. కుమారగిరి యనంతరము కొండవీటిరాజ్య మేలినపెదకోమటి వేమారెడ్డి కీయన విరోధి. పెదకోమటివేమునికిఁ జెల్లఁదగిన రాజమహేంద్రరాజ్యము నీతఁడు వడయుట విరోధకారణము. శ్రీనాథుఁ డీతని 'మనుతుల్యుఁ' డని ప్రశంసించెను.

ఉ. మానుషదానమానబలమానితధర్మరమామనోజ్ఞరే
ఖానుతభూతివిత్తములఁ గాటయవేమనఁ బోల్తు వానవిన్
వానివిరోధి వానివిభు వానివిపక్షుని వానియగ్రజున్
వానిమఱంది వానిసుతు వానియమిత్రుని వానిమిత్రునిన్.

ఉ. ఓలి నరాతులం దునిమె నుగ్రతఁ గాటమరెడ్డివేమభూ
పాలుఁడు రాక్షసత్రిపురభంగము చేసినభీమురీతి, నా
కాలపుఁబార్థువెఖరి జగంబును జాల నుతించుచుండఁగా
నాలివరాభవంబునకు నంబుధి గట్టినరాముకైవడిన్.

## అల్లయవేమారెడ్డి.

శ్రీనాథుని కాశీఖండము కృతిగొన్నవీరభద్రారెడ్డి కితఁ డన్న. భార్యమూలమునఁ దమ్మునికి వచ్చినరాజమహేంద్రరాజ్యము నీతఁడు నిర్వక్రపరాక్రముఁడై పెంపొందించినాఁడు. క్రీ. శ. 1440 ప్రాంతముల దాఁక నీతఁడు కలఁడు. ఈతనిపయిఁ జెప్పఁబడినపద్యములు పెక్కులు. శ్రీనాథకవీశ్వరునివి:—

సీ. వివిధవిద్యోద్దండ విద్వత్కుముదకాండ
హరిణాంక! రూపనారాయణాంక!
నిశితోగ్రకరవాల నిర్జితారినృపాల
సప్తాంగ! రాజవేశ్యాభుజంగ!
సకలమహీరాజ్యసంరక్షణోద్యోగ

కులశీల! గుజ్జరిదళవిభాళ!
భామాజనస్వాంతపరితోషణలతాంత
కోదండ! రాయచేకోలుగండ!

గీ. జయవిజయ జన్యశాంభోజహాయసమాజ
ఖురవిపాటనసంభూతకుతలరేణు
పటలనిబిడఘనధ్వాంతభరితభువన
విజయరఘురామ! అల్లాడవిభునివేమ!

సీ. ఖండేందుమౌళిపైఁ గలహంసపాళిపైఁ
గర్పూరధూళిపైఁ గాలుద్రవ్వ
మిన్నేటితెఱలపై మించుతామరలపై
మహి మంచునుఱలపై మల్లరించు
జంభారిగజముపైఁ జంద్రికారజముపైఁ
జందనధ్వజముపైఁ జౌకళించు
ముత్యాలసరులపై ముల్లక్రొవ్విరులపై
ముదికల్పతరులపై మోహరించు

గీ. వెండిమల యెక్కి శేషాహి వెన్నుఁ దన్ని
తోడరి దుగ్ధాబ్ధితరఁగలతోడ నలరి
నెఱతనం బాడి నీ కీర్తి నిండి యుహాహా
విజయరఘురామ! అల్లాడవిభునివేమ!

సీ. దండయాత్రాఘోషతమ్మటధ్వనులచే
గంతులు వేయించెఁ గప్పకొండ
కితనకాలాభీలకీలానలముచేత
నేలపాం గడగించెఁ బాలకొండ
అరట్టజాదట్టహాయదట్టములచేత
మట్టితూర్పెత్తించెఁ బొట్టునూరు
మార్త్రవతాపాగ్నిఁ బుటములు వెట్టించె
విద్వేషులనఁ గళావెంగిపురము

గీ. అనఁగ నుతి కెక్కి తౌర కేళాదిరాయ
యరులపండువమండువాయవనహరణ
ఖళియధూళియమాళవబందికార
విజయరఘురామ! అల్లాడవిభునివేమ!

వీరభద్రారెడ్డి.

శ్రీనాథకవి కాశీఖండము నీతనికి కృతిగొనెను. రాజమహేంద్రవము రాజధానిగాఁ గృష్ణాసముద్రతీరమునుండి చీకటి, [illegible]సము ద్రములదాఁక రాజ్యమేలినవాఁడు. ఈయనయన్న యల్లయవేమారెడ్డి బహుసమర్థుఁడు. కొండవీడు రాజధానిగా నాంధ్రదేశ మేలిన పెదకోమటివేమారెడ్డికి వీరు విరోధులు. పెదకోమటివేమారెడ్డియు నతని పుత్రుఁడును స్వర్గస్థులయినపిదప శ్రీనాథుఁడు వీరి యాస్థానమునకుఁ జేరెను. ఈయన పద్యములందును గొన్ని శ్రీనాథునివి కలవు.

సీ. జయ రాజవేశ్యాభుజంగాంక! నిశ్శంక!
యభ్యుదయంబు రాజాధిరాజ!
మంగళం బానతమండలీకరగండ!
సంకల్పసంసిద్ధి సమరవిజయ!
బ్రహ్మాయు వరిరాయబసవశంకరముద్ర
వర్ధిల్లుగాయగోవాళబిరుద
మహిమ మించు రిపుచెంచుమలచూఱకారాంక
స్వస్తి కర్పూరవసంతరాయ

గీ. ఆంధ్రకర్ణాటళాళ సింధుయవనచేర
వీరలక్ష్మీస్వయంవర వీక్షణాఢ్య!
ధరణి పాలింపు మాచంద్రతారకముగ
విక్రమార్కేంద్ర! యల్లయవీరభద్ర!

సీ. వృద్ధకచ్ఛపరాజు వీఁపు భగ్ననఁ దన్ని
ఫణిసార్వభౌముని వడఁగ దన్ని
ధరణీస్థలముఁ ద్రొక్కి గిరులెక్కి వరవార్త
సనతో సంభోధివరులఁ జూచి
యసిగమార్గము దాఁటి యినమండలము దూఁటి
నెలి దూఁటి నక్షత్రసమితిఁ గేఁటి
మునశింశుమారచక్రముఁ ద్రిప్పి యజ్ఞాత
ధవు మించి గోలోకశిన మడంచి

తే. యేకహిభవంబు న్డమాని లేక
ప్రాప్తఫిధు గ్రా నీయ బురుహనేత్ర
జగము న్నియుఁ గానైౖ సంచరించె
నిమశేంయుసు్నద! మస్యమువీరభద్ర!

ఉ. భద్రదనుదుర్సప్రియూణ పౌరుషదానవినీతిశౌర్యసం
పద్రిత్రీమ్రత స్తగుణావ్నంఁ దెల్లయవీరభద్రుఁ డా
భద్రకభద్రభద్రగజభద్రనరభద్రకభద్రభద్రక
ప్రద్రుమసారభద్రబలభద్రసముద్రసురాద్రిభద్రులన్.

సాగబ్బె చరాజు.

సీ. శూరత వైరిరాజులఁ గాని చక్కున
త్రేయవు మానగోవిందరాయ
అది లావు నిది ఘనం బనుదళంబులఁ గాని
చొచ్చి నఱకవు దివిచూఱకార
ప్రధనదక్షుండు మహాబలుఁ డగునృపుఁ గాని
మొఱయవు రాయరాహుత్తమిండ
పటుఖానుఖానాది బలుదుర్గములు గాని
కొన వేఁ బులియమారోకులుగండ

గీ. గండభేరుండ యుత్తమగండబిరుద
వీరకేదార రణరంగవీరభద్ర
నవ్యగుణహార సాగి గన్నయకుమార
బిరిద బైచామహాపాత్ర బహుచరిత్ర.

సీ. బహుముఖబ్రహ్మాండభాండంబు దివిగూఁడు
సంపూర్ణవీరరసంబు చమురు
భీమప్రతాపార్కబింబంబు తిరువత్తి
విజయసంగరభూమి వేఁటపాళెము
పంచమహాశబ్దబంధంబు గంటలు
కరవాలభైరవాకార మంబు
కూటివైరులపాలిమృత్యువు చొప్పరి
సహజసన్నాహంబు శక్తి గాఁగ

గీ. రాత్రివగలను కేల్ప్రొద్దు రాజసమున
గంట వేఁటాడదహితమృగములు సమయఁ
గాంతిహిమధామ గండరగండనామ
శత్రునారాచ గన్నయసాగిబైచ!

సీ. నెరవుగాఁ జేరిననెత్తురుచబ్బలు
గుఱుతుగా నంటినక్రొవ్వుపొరలు
మేపుపొట్టలమీఁద మెదలాడుప్రేవులు
చెదరి చించినగుండె చేరుగుదులు
మాటైనతుప్పలు మాంసఖండంబులు
చరణముల్ కరములు శల్యములును
మొదలికి నూడినమూలుగుకొడుపులు
పవనంబు సోఁకనివచ్చితలలు

గీ. కందుకూరొద్ద ఘోరాలు కలసి మెఱఁగ
ఘానమల్కుల గెల్చుటే ఘనము నీకు
బల్లసురథాణబిరుదసంపాదపాద
శత్రునారాచ గన్నయసాగిచైచ!

సీ. వులితలాటంబుకై కలహించుదా మెల్ల
మల్లయ్య నని (?) రేకు మడఁగఁ గొట్టి
నెఱిగండభేరుండబిరుదుకై పట్టిన
వెల్లంకులను నాజి విఱుగఁ ద్రోలి
మునుక రక్తక్షేత్రమునకునై యొరసిన
యినుగంటి తిమ్మనినే వధించి
బల్లెసురత్రాణపట్టుబిరుదముకై
నెట్టివల్ రాఘవుచేత చెఱిచి

గీ. మఱియుఁ దక్కనమన్నీల సురుము చేసి
మించె నీకీర్తి దిక్కుల మేదినందు
బల్లసురథాణబిరుదసంపాదపాద
శత్రునారాచ గన్నయసాగిచైచ!

క. ఈసాగిచైచభూవరుఁ
డీసాగినమొదలు నర్థి లేచిరి సిరులన్
రాసాగి బల్లె మందినఁ
బోసాగిరి వైరు లింద్రపురికిని సమరన్.

మ. సరసాగ్రేసర సాగిగన్నయకుమారా చైచభూపాల యు
ద్ధరణీ నీకరిగోరు చెల్లునఁట చిత్రంబా తలంపంగ ని
ర్భరతారుణ్యవయోవిజృంభ యగురంభానారిపాలిండ్ల నీ
యరిగోరెంతయుఁ జెల్లుచుండు నఁట జంభారాతిలోకంబునన్,

## శ్రీకృష్ణదేవరాయలు.

ఈ క్రింది సమస్య తొల్లి లక్ష్మీధరపండితునిచేఁ బూరింపఁబడినది. ఇతఁడు కృష్ణరాయని యాస్థానవిద్వత్కవి.

శ్లో. శ్రీకృష్ణక్షితిపాలదత్తమణిభి ర్విద్వత్కవీనాం గృహా
నానారత్నవిచిత్రకుట్టిమభువో రత్నాకరత్వం గతాః
అబ్ధిః కేవలవారిపూరనిలయ స్సంభావ్యతే సజ్జనై
రంభోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాన్నిధి ర్వారిధిః.

ఇదే సమస్యకుఁ బ్రాచీనతర మగువేఱొకపూరణము:—

శ్లో. అంబా కుప్యతి తాత! మూర్ధ్ని విహితా గంగేయ ముత్సృజ్యతాం
విద్వన్ షణ్ముఖ కా గతి ర్మయి చిరం తస్యా స్థితాయా వద
కోపోత్కర్షవశా దశేషవదనైః ప్రత్యుత్తరం దత్తవా
నంభోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాన్నిధి ర్వారిధిః.

సీ. చెడిపి రాలొత్తినయడుగుఁదమ్ములకును
గట్టుపయ్యెదఁ జించి చుట్టుకొనుచు
యలైనకుచకుంభపాళులకును జంటి
శిశువుల మాటుగాఁ జేర్చుకొనుచుఁ
పసుగందులకు వడగాలికిఁ జాటుగాఁ
గచభరంబులు విప్పి కప్పుకొనుచు
పడినతురుము నీవిముడాఁక సడలించి
చేలాంచము ముసుంగు చేర్చుకొనుచు

గీ. ఖానమల్కవజీరులమానవతులు
పాటుపరువున నీవు కల్బరిగ గొనిన
బ్రమసి దెసచెడి నలుగడఁ బఱతురౌర!
యాహవోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!

మ. అలలం బాఱితి వేమి? కృష్ణ! పతిదేవా! కృష్ణరాయక్షమా
తలనాథుం డనివారితాన్న మిడఁగాఁ దద్బ్రహ్మణాపోశనం
బులకుం బోయె సముద్ర(మ్రగ?) జీవనమిఁకం బూరించు నారాజు ని
ర్మలితాన్నోదకదానధారల విచారం బేల ప్రాణేశ్వరీ!

మ. నరసాధీశ్వరుకృష్ణరాయజగతీనాథా! భవత్కీర్తికిఁ
సురకల్లోలిని వీఁగి భర్గుని జటాజూటంబు ప్రాపించె నా
హారుఁడవ్వాహిని వార్ధిముంచుటభయస్వాంతాంగుఁడై పూనెనాఁ
గరిచర్మంబు కపాలముం భసితముం ఖట్వాంగముం శూలమున్.

సీ. అమితప్రతాపబాలార్కవిస్ఫూర్తిచే
నదన గోల్పడియె నయ్యుదయశిఖరి
భేరీధణంధణాఘోరనాదములచే
వినుకొండ దుర్గంబు విఱిగిపడియె
వాహినీసవుతాబు (?) వాహాముఖంబురా
లక్కయై కరఁగె బెల్లంబుకొండ
క్రూరరాహుతఖడ్గకులిశధారలచేతఁ
గొలసి చెట్రువగట్టెఁ గొండవీడు

గీ. కూలె బెజవాడ కంపించెఁ గొండపల్లి
పగిలెఁ గటకంబు గగ్గోలుపడియె ఢిల్లి
యేకధాటిగ నీవు దండెత్తినపుడు
కీర్తితోపాయధౌరేయ! కృష్ణరాయ!

సీ. స్వచ్ఛశైవలగుళుచ్ఛచ్ఛయచ్ఛాయాభి
నవసుధానిధి లాంఛనము నణంచి
శంభుశుంభద్భుజాస్తంభదంభస్తంభ
శాంభవీవిగ్రహచ్ఛవి హరించి

భానుకన్యా సా...... ..
................ దశమి
... ... ... ... ...
... ... ... ... ...

గీ. యెదురులే కెల్లచోఁ జరియించుచుండు
సభ్రగంగాంబుశరదభ్రశుభ్రజలరు
హాభ్రముప్రియదభ్రమాదభ్రమహిమఁ
బ్రబలు శ్రీకృష్ణరాయభూపాలుయశము.

సీ. ............తరాకాళీయ
ఘనశరాసనకళాకార్తికేయ
సగరహరిశ్చంద్రజననాయకన్యాయ
రక్షితసకలార్థరాజదాయ
కర్కశకదనరంగస్థలగాంగేయ
(గాయకసుకవిప్రకాండగేయ)
వివిదార్థివాంఛితవితరణరాధేయ
... ... ... ...

సీ. జంభారిగంభీరరంభాకుచస్తంభ
సంభోగగరిమ నీసమరమహిమ
చింతామణిక్రాంతసంతానని్శ్రాంత ?
శాంతికరంబు నీసత్యకీర్తి
ధాటీసమారంభభేటీరణభేరి ?
భేరీరవంబు నీభీమగరిమ
చండోగ్రవండమై ఖండించురిపునసి
ఖండించి వైచు నీ ఖడ్గధార

గీ. చంద్ర చందన మందార చారురుచిర
ఘటికింగోక్షీర సురరాజ ఘంతసముల

నవఘుళించును నీకీర్తి యఖిలదిశల
కీర్తిరాధేయ! నరసింహకృష్ణరాయ!

అళియరామరాయలు.

క. సలకము తిమ్మం డనియెడు
పలుబీజము గోయఁ బ్రజలు ప్రతికితి మనఁగా
వెలసె నయె రామరాయఁడు
ములు పుచ్చినచోటఁ గొట్టు మొత్తినభంగిన్.

విజయరాఘవరాయలు.

నాళీకభంగకృ దతీవ నదీనబంధుః
నక్షత్రపో నవసుధావిభవైకహేతుః
రాజా కి మిందురపి నార్యభిమానహారీ
రాజా పరం విజయరాఘవసార్వభౌమః.

# బిరుదావళులు

## విప్పర్లవారి బిరుదావళి

కాకతి ప్రభువుల సేనాధిపతు లగుడెబ్బదియేడుగురు నాయకులలో విప్పర్లవారి బిరుదావళి- స్వస్తిసమస్త సకల సామ్రాజ్యలక్ష్మీలక్షణాలంకార వీరగుణాభరణ విక్రమప్రతాప వైభవశృంగార సత్యహరిశ్చంద్ర శౌచగాంగేయ అన్నదానోదకదాన వస్త్రదాన సువర్ణదాన గోదాన భూదాన కనకదాన చింతామణి సకలవిద్యావిశారద నిజకులపార్థివవర్ధన కదనపూర్ణిమాసుధాకర బలవద్వైరి పొన్నయమహీపాల గోధూమఘట్టన ఘట్టరయమాన దోర్దండమండన కొలనిపుర మహీపాలకశిరఃకందుకక్రీడావినోద చిచ్చోటికోనయ కొత్తమాతంగఖండన ప్రమదరిపుకదనప్రచండ గండరగండ గండ

భేరుండ నిఖిలజన ముఖఫలక శరణాగతవజ్రపంజర, స్వామిద్రోహ కులాంతక కీర్తికర్పూరపూరితబ్రహ్మాండకరండ వేంగి చాళుక్య హన్నాలవోడుగండ బిరుదరాజభయాకర ఏకాంగివీర చోడకటక వజ్రప్రాకార సంగతిరక్షపాలక మానదుర్యోధన యేతాడిమాదినా యని తలగుండుగండ కాసలసోముని గర్వాపహరణ పట్టిలమల్లని ప్రాణాపహరణ దొడ్డన భీమని దుర్గర్వహరణ కొల్లూరి బేతీని హల్ల కల్లోల తిరుమల్లి నాయని దిశాపట్ట కొంగిమాయదేవుని కోలాహల అల్లుత్రి పురారి మానవర్ధన చించెడి కొమ్మినాయని శిరశ్ఛేదన దాడిమల్లని తలగుండుగండ ఆర్యభీము సప్తాంగహరణ బొంటు నాగ దేవుని నిర్మూలన త్యాగనాగని దళవిభాళ వివిధ మణి ఖచిత కనక దండ కిరీట ధవళ చ్ఛత్రచ్ఛాయావలయవేదిత రాజ్యలక్ష్మీప్రసన్న చామరసమీచీన విజితకరనికానీక శంఖునినద మూర్ఛిత రిపువాహిని కర నిజప్రతాప మహిమానుకూల కరవాల భైరవ గోకులహారి గోకుల దిశాపట్ట దుష్టగోకులమానమర్దన రణమున పెక్కండ్రు నాయకు లొక్కత్తుగండ దివిచూరకార పులియమారోక్కలు గండ మండలీ కరధూమకేతు మండలీకరమకరధ్వజ కటకనిబ్బరగండ హత్తు ముప్వురగండ తెరసావంత బారమండలీకరగండ తనకేలు బిరుదంబున బుద్ధవర్మవంశవిస్తారక కమలగర్భచరణోద్భవ పరనారీదూర వంశ విస్తారక అభిమానకురునరేంద్ర భటకోపకరతే నాయకాంచాళ్ల వరరట్ల గోత్రపవిత్ర భటవిరోధికరతే నాయకాంచాళ్ల భట్టు వెడు రేపుమధ్యాహ్న పరిగళతె నాయకాంచాళ్ల దేవబ్రాహ్మణ భటక విదానసంపన్న శ్రీనారాయణదేవరకు యేడువేల గంగిధేనువుల సమ ర్పించిన దానసంపన్నులున్నూ శరణాగతజీవరక్షపాలకులున్నూ దుష్ట గోకుల పట్టితెచ్చే గోడార్ల చేత వారిహాలాయుధంబులు ప్రళింబించి త్వదక్తంబున చీరలు దడిపి చర్మసమేతంబుగా గొడ్గులకుబెట్టి వారితలలు

ఖండించి గొడ్డులకు గుబ్బలు గావించి వారికవచంబు లొలిపించి గొడ్డులకు పచ్చివిలాసంబు గావించి యెత్తించిన యెఱ్ఱగొడ్డులున్నూ కొంకణ ఘూర్జర ద్రవిడ ద్రామిళ ఉజ్జయిని యని నల్లాది రాజులు ఆదూరిబైళ్ళ ఏనుగుదళంబులతోఁ దలపడి తమపేరు చెప్పి యేనుగ తొండంబులు ఖండవిఖండశతఖండతుండంబులుగా వేసి ఆటలాడించి ఆ రాజులపడుతలలు పట్టితెచ్చి తమ్మేలిన కరికాళచోళ చక్రవర్తికి సమర్పించి ఆ నృపాలుండు మెచ్చియిచ్చిన ఆరాజ్య బిరుద పదసంపద లెట్టివనిన-ఏకశంఖంబులున్ను, ఎఱ్ఱగొడ్డులున్ను, హనుమంతుపడియు, ఆలవట్టంబును, ప్రముఖగిరులున్ను పులికాలియొడ్డున పులితోటలు పక్కెరసమెర పులితలాటంబును రెడ్డెరికంబును గండభేరుండమును గండభేరుండ తలాటంబును అరిరాయ గజాంకుశంబును దక్షిణదోర్దండమండితంబై శాసన యంగల పసుపుపావడ విక్రమార్చిత (దిత్య?) ధనంజయులోల సరికర్ణ ఖేచర శిబిజీమూతవాహనులు గల త్యాగసింహాసనాధీశ్వర పెరియూరి త్రికూటేశ్వరాది దేవ దివ్యశ్రీపాదపద్మారాధకు లైన విప్పర్లనాయంకులాన్వయాది బిరుదు విజయప్రశస్తి విజయీభవ.

## పైశాలవారి బిరుదు

దివ్యశ్రీ పాదపద్మారాధకు లైనవిప్పర్లనాయంకులాన్వయాది విజయప్రశస్తి విజయీభవ-పైశాలవారి బిరుదు. గండరాదిత్య గండ రశాప్య గండరమోగీత గండభండార నన్నూరునరువత్తు కొమరవేశ్యా భుజంగ చిక్కు తిరుకాళ హేమగళ ప్రధానికరగండ యిమ్మడిగండ నాయకరగండ ముమ్మడిగండ నాయకరగండ హత్తితపామండలీకరగండ హిత్తిగురుతో మండలీకరగండ కూడికాదోమండలీకరగండ కూడివిచ్చో మండలీకరగండ నెరటికోటా మండలీకరగండ అడ్డదోడి పెమమండలీకరి

గీ. దనుచుఁ గృష్ణమనేఁడు మున్నాడి తెలుప
జాలు వీరపనేఁడు నీబారుఁ జూచి
వైభవబిడౌజ రంగభూవరతనూజ
హిమకరాకార వెలుగోటి యేచధీర!

సీ. వారజీతమె కాని బారు నా కేలని
చినరాతు సొనలను జేర వెఱచె
నాడిగమే కాని కూడ పీపను లని
యెప్పుడో జరిగె నా తిప్పరాతు
మణియు మంతే కాని మా కిగి కాదని
గుట్టుగాఁ దీతపసెట్టి కదలెఁ
బాపెగాఁడై తాను బ్రదికేది లెస్సని
చిట్టాడ కదలె నాగట్టిమొదలి

గీ. మఱియుఁ దక్కినదొర లిటు మార్గముననె
పట్టిమూఁకలు నీమీఁద నెట్టుకొనునె
వైభవబిడౌజ రంగభూవరతనూజ
హిమకరాకార వెలుగోటియేచధీర!

సీ. పాఠకసుకవీంద్రబంధువిద్వజ్జనా
శ్రయ మైనయట్టిరేచర్లపేరు
పరిపంథిరాజన్యపట్టణహాఠవీర
రణజయార్జిత మైన రావుపేరు
సకలదిగ్భూములజనము సన్నుతి సేయఁ
గర మొప్పఁగనియాల గనినపేరు
విక్రమక్రమకథావిఖ్యాతమహిమలఁ
గోరి తెచ్చినవెలుగోటిపేరు

గీ. నీకు ముత్యాలపేరు లై నిలిచె నార
మత్తరిపుమ స్తవిన్య స్తమణికిరీట
చారుకీర్తిపతంగ కస్తూరి రంగ
విభునిసత్పుత్ర యేచపృథ్వీకళత్ర!

ఉ. గొబ్బురిజగ్గరాజు లోకకోటి నుతేఁబదికోట్లు మాకరా
జబ్బలు నూఱుకోట్లపయి నార్వురు రావెలవెంకులైన హ
న్నిబ్బరగండఁ డేచధరణీశ్వరు సుందర నిల్వ శక్యమే
గబ్బలు గాక బెబ్బులి ముఖాముఖి మేకలు నిల్వనేర్చునే?

ఉ. గబ్బిని నుండు నీతరము గాదు రణస్థలి మాకరాజ; నీ
గబ్బితనంబు మాను మవకార్యము రావెలవెంకటాద్రి; యో
గొబ్బురిజగ్గరాజ! మనకుం దగ దీపగ యాచశౌరితో
బెబ్బులి డాసి మచ్చరము పేర్చుక పిన్నల కోర్వవచ్చునే?

ఉ. ముప్పదివేల వీరభటముఖ్యులు దావులపాపశౌరితో
ముప్పది యంచు నెంచ కతిమూర్ఖతఁ జేరిన రెండువేలతోఁ
జొప్పడ నిల్చి తీవు రణశూరత నీప్రతిమన్నవాఁడు లేఁ
డప్ప బళీర! రంగవసుధాధిపు నేచనృపాలశేఖరా!

సీ. త్రొక్కించు గడివన్నెదుర్గముల్ హయముచే
ధిగధిగ మని పెళ్ల లెగయుచుండ
దరికొనఁ జేయు నుద్దండవిరోధిరా
ణ్ణికరపట్టణవహ్ని నింగి కెగయఁ
దలలు చెక్కాడు ప్రత్యర్థిరాజకుమార
వర్గముల్ దోర్గర్వవైఖరులను
బట్టించుఁ జెఱపట్టి ధట్టించి రిపురాజ
కోటిని మిక్కిలి నీటు చూపు

గీ. కాచు శరణన్నవారినిఁ బ్రోచుఁ దనదు
దండఁ జేరినయరిరాజమండలమును
మండలంబున రంగభూమండలేంద్రు
నేచభూపాలశౌరి దయావిహారి.

సీ. పాఱువేఁటలు రాచబారు లెల్లను నీకుఁ
బట్టుగొత్తాలు గదా పగఱకరులు
వీఁటికోఁటలు గదా మేటైసకోటలు
కాకు లాతాణాలమూఁక లెల్లఁ
బన్నన్న లామన్నె పాళెలసామ్ములు
నమ్మినకాఁపు లాకమ్మదొరలు
పెండ్లింట్లుగా నీకు భీకరకదనముల్
ప్రతిన గదా రామరాయపట్టి

గీ. మారా! ముగురుదునేదారు లయిన నిన్ను
నెదురఁ జాలరు యతిరాజు యెదురఁ గలఁడె
బాంధవుల నన్నదమ్ములఁ బాసి చనియె
పరహితాచార! వెలుగోటిపురవిహార!
రంగధాత్రీశు నేచధరాతలేంద్ర!

మ. బెగడెన్ గల్బులి సత్యవీడు వడిఁ గంపించెం బటాపంచలై
పగలం బాఱెను జెంజి మించి మధురాపర్యంతరాష్ట్రంబులన్
దిగులెత్తెన్ గడిదుర్గముల్ వణఁకె భీతిన్ జగ్గరాజాదిరా
చగముల్ రంగయనేచశౌరి కెదిరించన్ లేక పాఱెన్ గడున్.

## దామెరవారి వంశావళి

స్వస్తి సమస్త మహామండలేశ్వర మహాసామంత పదవీసమేత ఉత్తరదిగ్భాగ పూర్వసింహాసనాధీశ్వర అయోధ్యాపుర సామ్రాజ్య లక్ష్మీనిర్వాహక హరిశ్చంద్ర మహారాజ్య కార్యధురంధర లోహితాస్య దక్షిణ భుజాదండ భాగీరథీసముద్రా...విస్తారక అనవేమ మహీపాలుని సకల సేనాధీశ్వర దితిపురమహారాజ రాజ్యభారక ఇక్ష్వాకు సేనాముఖ దరీకులాంభోనిధి హరిక్రీడావినోద చంద్రచూడ పాదపంకజ భ్రమ రాయమాణ దశరథమనోరథ సన్మీలచతుర్దక్షు మహీమండల మండితాయమాన రామ భాగీరథీ లక్ష్మణశత్రుఘ్న కార్యనిర్వాహక మాహిష్మతీపురవరాధీశ్వర శ్రీలక్ష్మణదేవ మహాపట్టాభిషేక మహోత్సవ మహాసంతుష్ట కరికాలచోళరాజ్య సముద్ధారక కావేరి శ్రీరంగనాథ దేవ దివ్యశ్రీపాదపద్మారాధక చతుర్థకుల సుధార్ణవసంపూర్ణచంద్ర చోళ రాజ్యప్రతిష్ఠాపక సమరముఖ హనుమంత యినిగాలగోత్ర కదనత్రినేత్ర వెన్నిచ్చి కుడువబెట్టునాయంకరగండ కార్యబృహస్పతిస్వరూప గండికోట సుల్తానులదాయరాక్షస వైరిసనకుఠార శత్రుకులనిర్జిత అరిబల తల్లడ సాహసాభరణ గిరిదుర్గవజ్రాయుధ స్థలదుర్గహలాయుధ వనదుర్గ వైశ్వానర జడదుర్గబడబానల సత్యహరిశ్చంద్ర యేనుగోకర్ణుని సముఖంబున పంజూరిపడమట బండ్లవాగున సభలోన పులిని పొడిచి యెత్తిన సబలీసహస్రబాహ పులియమార్గోలుగండ బాహుబలభీమ వైరిగజదళ విదళపంచానన సమరముఖ (హనుమంత) ఓరుగంటి ప్రతాపరుద్రుండు యిచ్చినబిరుదంబు లెట్టినవిస సువర్ణతలాటంబును ఉభయ వింజామరంబులును దక్షిణపారిజాత పరివారసంగడి సన్నాహ అఖిలజనపురుహూత ఆశ్రితపారిజాత వాలూరిపురవరాధీశ్వర శ్రీనరసింహదేవ దివ్యశ్రీయిత్యాది నామాదిప్రశస్తి సహితులైన యినిగాలగోత్ర నాయంకులాన్వయాది బిరుదు ఆదివిజయబిరుదుప్రశస్తి జయవిజయీభవ దిగ్విజయీభవ—

మాదయనాయనింవారు ప్రతాపరుద్రుని తావున విస్తారంగా ప్రభుత్వం చేస్తూవుండి తదనంతరం గజపతి రాయులవారి తావున ప్రవేశించి వారు విస్తారంగ రాజ్యం సంపాదించుకుని ప్రభుత్వం చేస్తూవున్నప్పుడు వారియొక్క కీర్తిప్రతాపము లైనపద్యం.

క. మాదయఘనవల్లభవిభుఁ
డాదటను బ్రతాపరుద్రునంతరమున నో
డ్రాదిక గజపతిఁ గొల్చి శు
భోదిత బహురాజ్యభరిత భుజబలయుతుఁడై.

అటుపిమ్మట వల్లభనాయనింవారు ప్రభుత్వం చేస్తూవుండగా గజపతి వారి పంపున ఖాదిరిఖానుఁడనే వజీరుమీఁదికి దండెత్తి పోయి వాణ్ణి కొట్టి వాడియొక్క నదాలతును తీసుకుని వచ్చి గజపతివారికి యిచ్చినంతలో వారు సంతోషించి సకలబహుమతులు యిచ్చినది యేమంటే వారి యొక్క పద్యం:

సీ. గజరాజుపంపున ఘనస మానఖాదిరి
ఖానాదవజ్రులకడిమి మాపి
వారల హయగజవ్రాతభండారస
ద్బిరుదు ఛత్రధ్వజస్ఫురితదుర్గ
వర్గముల్ కానుకఁ బట్టంపఁ గడు మెచ్చి
యొడ్డెరాజ్యాధ్యక్షుఁ డొప్ప గులుకు
పడివాగె తేజీలు భద్రగజంబులు
సరవి ముత్తెపుజగజంపుగొడుగు

గీ. కళుకు సెలకత్తి యొసఁగినఁ గడిమి నొంది
చండగతిఁ బల్యమారోకాలుగండబిరుదు
పాత్రచరితుండు యినిగాలగోత్రతిలకుఁ
డమితయశుఁడై నవల్లభాహ్వయుఁడు భువిని.

వీరి తదనంతరం తిమ్మానాయనింవారున్ను అన్నమనాయనిం వారున్ను ప్రభుత్వం చేస్తూ వచ్చిరి.

క. ఆనరపతికిని దిమ్మ
త్మానేతయు మఱియు నన్నమాహ్వయుఁ డనఁగన్
మానితప్రతాపకీర్తుల
చే నిరువురు వెలసి రెలమి స్థిరకాలంబున్.

అటుపిమ్మట మహీపతిరాయనివారు ప్రభుత్వం చేసినపద్యం.

క. దామెరమహిపతిరావుకు
భూమీపతు లీడు గారు పూర్ణయశోభృ
త్సోముఁడు పటుశౌర్యశ్రీ
రాముఁడు శాత్రవుల కనఁగ రహి నుతి కెక్కెన్.

తదనంతరం తిమ్మానాయనివారు మహీపతిరాయనివారి కొమా రుడు గనుక వీరు మహాప్రబలులై గజపతిరాయనివారి తావున సిండా మొహానతు చేసినందున వారు నిండా దయచేసి దేవరకొండరాజ్యం జహాగీరుగా దయచేసిరి. గనుక పంపుబందితో కూడా పోయి దేవర కొండ ప్రభుత్వం చేస్తూవున్న బైచడు అనేవానిమీద లడాయి చేసి వాణ్ణికొట్టి వాడిదగ్గర వున్న వస్తువాహనములు తీసుకున్నప్పుడు వారి యొక్క కీర్తిప్రతాప మైనపద్యం:

సీ. బలపరాక్రమయశఃప్రబలుఁడై తిమ్మభూ
పతి యున్నచో గజపతియుఁ బిలిచి
వస్తువర్గములు దేవరకొండదుర్గంబు
రాజ్యంబుతోఁ గూడ రహి నొసంగెఁ

గై కొమ్ము కొమ్మన గడిసీమ లటు సొచ్చి
దుర్గంబు చుట్టుక దోర్బలమున
లగ్గ వట్టించుచో బెగ్గిల కం దున్న
బలముతో సేనాధిపతులఁ గినిసి
ఘట్టించి శస్త్రాస్త్రతతులచే నొంచిన
తనవీరభటులతోఁ దానుఁ గినిసిఁ
పొడు పొడు మనుచు బెబ్బులిమాడ్కి లంఘించి
యీఁటెలఁ గుమ్మించి యేపు మాపి
దుర్గాసి కధిప తౌతులున బైచనిఁ బట్టి
తలఁ గొట్టి పౌఁజుల నెలమిఁ గూల్చి
నెత్తురు టేరులు నెఱపి భూతలముకు
విందుఁ గావించి దోర్విజయుఁ డగుచుఁ

గీ. బరఁగు దేవరకొండవిభాళబిరుదు
నెమ్మిఁ గనుపట్టుఁ దన కెందు నెదురు లేక
యతులితం బైన సబలీసహస్రబాహుఁ
డిమ్మహిఁ జెలంగె దా మెరతిమ్మఘనుఁడు.

ఈ ప్రకారం కొన్నిదినములు తిమ్మానాయనివారు ప్రభుత్వం చేసిరి. వీరి తదనంతరం రాఘవనాయనింవారు ప్రభుత్వం చేసిరి గనుక వారియొక్క పద్యం:

సీ. తారకాచలసముద్వాహంబు దేహంబు
చటులహాలాహలసఖము ముఖము
దంభోళినిజఖడ్గధారలు కోరలు
కాలకంఠోదగ్రగరము శిరము

పటుమృత్యుహ_స్తసంపాదముల్ పాదముల్
దీపితప్రళయాగ్ని చూపు రూపు
శిక్షితయమదండశీలంబు వాలంబు
ధీరనృసింహుని వ్రేళ్లు గోళ్లు

గీ. నాఁగ రిపురాజ్యముల వీరగజచయంబుఁ
జెండు నీదై నకోర్కంటిసింహబిరుదు
ధరణి దామెర తిమ్మభూధవసుపుత్ర
రాజదేవేంద్ర యిమ్మడిరాఘవేంద్ర !

తదనంతరం తిమ్మానాయనివారు ఆ రాజ్యమే ప్రభుత్వం చేస్తూ వుండిరి. కనుక వారియొక్క ప్రతాప మైనపద్యం :

ఉ. పెట్టినదండఁ దీయని యభేద్యపరాక్రమశాలి యైననీ
కట్టెదుటన్ నిలం గలరె కట్టడిమన్నెకుమారు లాజిలో
ముట్టినసింగపుంగొదమముందర నేన్గులు నిల్చునేని రా
దిట్టవు నీవె దామెరలతిమ్మనృపాల విశాలవైభవా !

వీరి తదనంతరం వెంకటప్పనాయనివారు ప్రభుత్వం చేస్నిది పద్యం :

ఉ. దామరవెంకటేంద్ర ! కలదా సురలన్ సమితిం గృపీటజో
ద్దామరసాఢ్య భూస్థలిని దారకశైలశతారచంద్రబృం
దామరభూజరాజశరదభ్రభజిదభ్రమరాళమల్లికా
దాశరతీశవైరుల నదల్చి వెలుంగెడుఁ గీర్తు లెంతయున్.

వీరి తదనంతరం తిమ్మానాయనివారున్ను కొన్నిదినములు ప్రభుత్వం చేసినపద్యం :

చ. దురమున కోహటింపక యెదుర్కొని తూటి ఖడాఖడిక్ నెఱా
బిరుదువజీరులం దఱిమి బింక మెలర్పఁగఁ జక్కుచక్కుగా
నఱికి జయంబుఁ గైకొనురణాంగణశూరుఁడ వీవెరా భళీ!
స్థిరభుజసార దామెరలతిమ్మనృపాల! విశాలవైభవా!

పిరి తదనంతరం *శ్రీపాదనాయనివారు ప్రభుత్వం చేసినారు గనుక వారి పద్యం:

క. ఆపటుశౌర్యున కొదవెఁ
భూపాలకతిలక మనుమ భువి వొగడ హరి
శ్రీపాదధ్యానాయతి
శ్రీపాదక్షోణిపతి విచిత్రస్థితియై.

సీ. గజరాజరక్షణఘనతరదోర్దండ
గురుతరపులియమార్కొలుగండ
స్ఫుటమతి వాలూరిపుటభేదనాధ్యక్ష
రణనిటలాక్ష నిర్గతవిపక్ష
యుభయసైనికమహావ్యూహపితామహ
హనుమంత సబళీసహస్రబాహ
యతులితస్వర్ణపట్టతలాటలాలాట
నాభికాఘంటానినాదఘోష

గీ. కదనరిపురంహ విజయకోర్కంటిసింహ
కాంచనవసంతరాయ విఖ్యాతవిజయ
యనుచు మంటికి మాగధు లభినుతింపఁ
బొదలె బిరుదాళి శ్రీపాదభూపమౌళి.

---

*బహులాశ్వ విజయమునందును, ఉషాపరిణయమునందును దామెరవారి వంశావతారవర్ణన మితనితో నారంభ మగును.

ఈవల శ్రీపాదనాయనివారి కొమారుడు అబ్బానాయనింవారు దేవరకొండరాజ్యం ప్రభుత్వం చేస్తూ వున్నంతలో లోగడ బైచడు అనే వానిజ్ఞాతి వాలూరిరాజ్యం చేస్తూ వుండే వీరిమీద విరోధాలకు యత్నం చేస్తూవుండె కన్కు వాడిమీద లడాయిచేసి వాణ్ణి కొట్టి వాలూరిపట్నం కట్టుకుని యీ రాజ్యమున్ను దేవరకొండ రాజ్యమున్ను ప్రభుత్వం చేస్తూ వచ్చినారు. వీరియొక్క పద్యములు :

క. దురమున బోయదళంబులఁ
బరువడితో నఱకి వారిపట్టణ మపుడున్
గరకరి అబ్బనృపాలుఁడు
స్థిరముగఁ దా నేలె నపుడు దివ్యులు మెచ్చన్.

ఈయన కొన్నాళ్లు ప్రభుత్వం చేస్తూ వుండి వీరి తదనంతరం ధర్మానాయనివారు ప్రభుత్వం చేశ్నిపద్యం :

ఉ. దుర్మదవైరిహారిబలధుర్యవిహారికి నబ్బశౌరికిన్
నిర్మలకీర్తిశాలి రమణీయతనూరుచిహేళి సత్క్రియా
కర్మఠసాధుయూథవరకామితదానలసద్గుణాళి గా
ధర్మనృపాలమౌళి పటుధర్మవినిర్జితశూలి కల్గినన్.

వీరియొక్క కొమారుడు వెంగళప్పనాయనింవారు ప్రభుత్వం చేశినదినములలో వీరియొక్క పద్యం:

సీ. *తనపదాతిశయంబు తనపదాతిశయంబు
కరణి నాళీకసంగతి నటింపఁ
దనసుదృగ్గరిమంబు తనసుదృగ్గరిమంబు
గతిఁ గౌముదీప్రసంగంబు నిలుపఁ

---

* ఈ పద్యము బహులాశ్వవిజయములోఁ గలదు.

దనవిగ్రహోన్నతి తనవిగ్రహోన్నతి
కై వడి నసమాస్త్రకలనఁ దెలుపఁ
దనకరస్ఫురణంబు తనకరస్ఫురణంబు
ప్రఖ్యాతి సగరవైభవముఁ బూనఁ

గీ. బరిఢవిల్లు శరద్విషత్పరివృఢప్ర
గాఢభుజపీఠకుఠశాఖికాభిధావి
ధాకఠోరకుఠారకాధారధర్మ
నృపతి దామెర్ల వెంగళోర్వీధవుండు

వీరితదనంతరం చెన్నప్పనాయనింవారి ప్రభుత్వంలో పద్యం:

క. చక్కనిదామెరచెన్నఁడు
చొక్కపురణరంగభూమిఁ జొచ్చినఁ గినుకన్
ముక్కలు చెక్కలు డొక్కలు
జక్కలుగాఁ జేయు వానిసాటెవ్వ రిలన్

వీరి తదనంతరం యీనకొమారుడు వెంకటప్పనాయుడు ప్రభుత్వం చేసినప్పుడు వారియొక్క ప్రతాప మైనపద్యం.

ఉ. దామెరచెన్నభూవిభుసుతప్రవజరత్న మనన్ వినూత్నధై
ర్యామితశౌర్యలీలఁ జతురబ్ధిపరీతధరిత్రి వెంకట
క్ష్మామహిళామనోహరుఁ డఖండయశోవిభవంబు పర్వ సు
త్రామసమానవైభవధురంధరబంధురచర్య రంజిలన్.

వీరి తదనంతరం చెన్నప్పనాయఁడు ప్రభుత్వం చేశినప్పుడు వీరి యొక్క పద్యం :

క. తమతమకె బెదరి చెదరుచు
భ్రమఁ జెందుదు రెంత మన్నెభార్గవు లైనన్
ఘుమఘుమ మని చెలఁగెడు నీ
తమటధ్వనిఁ జెవుల విన్న దామెరచెన్నా !

వీరి తదనంతరం యీానకొమారుడు వెంకటప్పనాయనింవారి పద్యం :

సీ. బంధురపరిపంథిగంధేభములఁ గాని
చెండదు కోర్కంటిసింహబిరుదు
అరినృపాలకరాజవరపురంబులఁ గాని
నెగడదు కదనత్రినేత్రబిరుదు
నుత్తారిసముద్రగమన్నెలేళ్లను గాని
యత్తదు సబలీసహస్రబిరుదు
..........................
.......................

గీ. నీదు బిరుదప్రశస్తంబు నిఖిలమునను
రిపుల కెల్లను గర్వనిర్భేదనంబు
ఇస్వతాళాంక దామెర్లశాసనాంక
చెన్నభూపాల వెంకటక్షితితలేంద్ర !

వీరి తదనంతరం యీానకొమారుడు అబ్బానాయుడు ప్రభుత్వం చేశినపుడు యీానపద్యం :

క. దామెర్లకులాంభోజన
భోమణి యై తనరుతత్ప్రభుశ్రేష్ఠునకుఁ
ధీమంతుఁ డబ్బనృపతిల
లామము జనియించె కళానిధి తగఁగఁ.

వీరి తదనంతరం యీానకొమారుడు తిమ్మానాయుడు ప్రభుత్వం చేశినపుడు యీానపద్యం :

సీ. కర్ణాటకస్వామి కై సేయురణవీర
మలహరియందున మనసు విఱిచి
హర్షించి కుదవళిహా యిచ్చునభయవిం
జామరల్ వైవఁ బ్రసక్తి మాలి
కడువేడ్కఁ నేదులాఖానుఁ డోసంగుదో
ఖండా లసడ్డగాఁ గడను బెట్టి
గురుముఖం బాదిగాఁ దఱిమి వైరులచేతఁ
గైకొన్న కేతులగములు వైచి

గీ. యింద్రుకార్యముఁ దగ నిర్వహించి యింక
బిరుదులను బొందఁ దలఁచె నావరతదీయ
సభకు వేంచేసె సన్మానవిభవుఁ డగుచు
దిగ్జయవిహారి దామెరతిమ్మశౌరి.

ఈవల యీ రాజ్యాలు ప్రభుత్వం చేస్తూవుండి తదనంతరం యీనకోమారు డైన వెంకటప్పనాయనివారు యీ రాజ్యాలు ప్రభుత్వం చేస్తూ వున్నంతలో సుంకెలశలరాజ్యం ప్రభుత్వం చేస్తూవున్న తురకలు లాతుఖానుడు వీరిమీాద చిదగొద చేస్తూవుండె గనుక వాడిమీాద పంజు మందిచేసి లడాయిచేసి వాణ్ణికొట్టి ప్రభుత్వం చేస్తూవచ్చె గనుక వీరియొక్క కీర్తిప్రతాప మైనపద్యం:

సీ. సుంకేశపురిలోన శూరుఁడై మ్లేచ్ఛుండు
కలుషుఁ డెంతయు మురాత్ఖానుఁ డనఁగ
బలియుఁడై యెదిరింప బవరంబులో వాని
శిరము వ్రయ్యలు చేసి శీఘ్రమునను
భ్రాతృపుత్రామాత్యబంధువర్గంబులఁ
బొడిచియు నఱకియు భూరిమహిమ
హయగజవ్రాతంబు లన్నియుఁ గొనియును
శూరుఁడై యెంతయు సుస్థిరముగఁ

గీ. తెలంగ మహిలోన మార్కొంటిసింహ మనఁగ
దామెరాన్వయతిమ్మభూధవునితనయుఁ
డగుచు వెలసెను బ్రౌఢిమ నమితయశుఁడు
ధన్యుఁ డైనట్టి వెంకటధరణివిభుఁడు.

యీనకొమారుడు తిమ్మానాయడు ప్రభుత్వం చేసినదినముల్లో వీరియొక్క కీర్తిప్రతాప మైనపద్యం :

శా. ఇచ్చేపట్లఁ దృణంబుగాఁగ మణులుం హేమంబులుం గ్రామముల్
నిచ్చల్ వేడుక నిచ్చుచుండుటఁ గదా నీకీర్తి నల్దిక్కులన్
రచ్చన్ మెచ్చిక మెచ్చు హెచ్చుగనియెన్ రాజన్యమూర్ధన్య! భా
స్వచ్చారిత్ర! కుమారతిమ్మనృపతీ! సౌందర్యరమ్యాకృతీ!

యీనకొమారుడు చన్నప్పనాయనింవారు ప్రభుత్వంచేస్తూ వున దినముల్లో వీరిపద్యం :

సీ. తేజిపై లంఘించి నేజ చేఁ బూనితే
బెదరు నెంతటిమన్నె బెబ్బులైనఁ
గినిసి మీసము దిద్ది కిలకిల నవ్వితే
స్రుక్కు నెంతటి మన్నె శూరుఁడైన
ధర ఛురీలున దూసి కరవాలు చిమ్మితే
తిరుగు నెంతటి మన్నెధీరుఁడైన
నట్టహాసముఁ జేసి యాజికి నడచితే
విఱుగు నెంతటిమన్నె వీరుఁ డైనఁ

గీ. గాక నీరాక కెదిరించి కత్తిమొనకు
నానునా యెంతవారైన నళుకు లేక
భాగ్యచారిత్ర! తిమ్మభూపాలపుత్ర!
మానవోపేంద్ర! చెన్నభూమండలేంద్ర!

ఈనకొమారు డైనకొమార అక్కప్పనాయనింవారు ప్రభుత్వం చేస్తూ వున్నదినములలో పద్యం:

సీ. మొనసి ప్రత్యర్థివై మోహరించిననిన్ను
  గంటింపఁగలఁడె ముక్కంటి యైన
దండిబారేర్పడి మెండొడ్డితే నిన్నుఁ
  దెమలించునా బ్రహ్మదేవుఁ డైనఁ
గదలెత్తి నడచినఁ గదనాన నీతోడ
  నెదిరించఁ గలఁడె యాయింద్రుఁ డైనఁ
దారసిల్లిన నీకుఁ దలఁగి వెన్నియక
  బవరాన నిల్చునా పార్థుఁ డైన

గీ. నీడెరా శౌర్యవిస్ఫూర్తి నిక్కముగను
నిన్ను మారొక్కని యెవ్వఁడు నిలువఁగలఁడు
వర్ణితోదార! చెన్నభూవరకుమార!
వీరబలసాంద్ర! దామెరవెంకటేంద్ర!

ఈనకొమారుఁ డైనతిమ్మనాయనింవారు ప్రభుత్వం చేస్తూవున్న దినములలో పద్యం:

మ. ఇల దామెర్లకుమారతిమ్మవిభు దాతృత్వంబు వర్ణింపఁగాఁ
గలయం బీనుల నాలకించి సభలం గర్ణాటసంస్థానవ
ర్యులుఁ దామట్ల ఘటింపఁ బూనుట యొకా నొక్కింత యీ నేర్తురే
పులిచాఱల్ గని నక్క వన్నె లిడుటం బొల్పొనె తత్సామ్యముల్.

ఈనకొమారుఁ డైనవెంకటప్పనాయఁడు ప్రభుత్వం చేస్తూవున్న దినములలో యీనపద్యం:

సీ. పెద్దనగరునొద్దఁ బ్రేమ బాదరుజల్లి
తలఁ ద్రుంచినట్టియాగ్రధత్వమునకు
నిందుకూరున జయార్గళవృత్తి నలము ?
ఖానును నటికించుకార్యమునకు
గజపతిరాయలు ఘనముగా నిను మెచ్చి
గండపెండారంబు ఘనగజంబు
తాళిచౌకట్లును దగ వీరమలహారిం
బంగారుడాల్పానుమంతుడాలు

గీ. వైభవము మీఱ సకలభూపతులలోన
నమితగుణహార విక్రమార్కావతార
వర్ణితోదార చెన్నభూవరకుమార
వీరబలసాంద్ర దామెరవెంకటేంద్ర!

ఈనకొమారుడు అయ్యప్పనాయడు ప్రభుత్వం చేసిన దినము లలో యీనపద్యం :

సీ. ఫణితల్ప ఫణికేతు ఫణిరాజభూషణ
ఫణికులాధిపులు నీపాటివారు
వసునగ వాసవా వసురాజనందన
వాసవాత్మజులు నీవంటివారు
కమలేశ కమలారి కమలాతనూజాత
కమలసంభవులు నీక్రమమువారు
యాదోధి యక్షేశ యదునందనాత్మజ
యమతనూభవులు నీయంతవారు

గీ. శౌర్యమానుషధైర్యప్రజ్ఞానుభూతి
భాగ్యవైభవవీరప్రభావరూప
......................
శాశ్వతైశ్వర్యధనబలసత్యములను
నాశ్రితోపేంద్ర దామెరయయ్యపేంద్ర !

ఈనకొమారుఁడైన వెంగళప్పనాయనివారి ప్రభుత్వంలో పద్యం:

క. అంగజనిభు వెంగళవిభు
నంగడు భువి నర్థికోటి యహిమాంశునిభుఁ?
అంగ త్రిలింగళ వంగ క
ళింగంబుల నీదు జోదు లేరు వదాన్యుల్.

ఈనకొమారుడు చినవెంకటప్పనాయనింవారు ప్రభుత్వం చేసిన దినములలో యీానపద్యం:

సీ. ప్రథనభార్గవ! నీదుభటఘాటి గన్నంతఁ
దురకలగుండియల్ విరియఁబాఱె
జన్యత్రినేత్ర! నీజయభేరి విన్నంత
యవనాధిపపురంబు లవియఁ జొచ్చె
రణధనంజయ! నీదుమణికేతు వీక్షింప
దగిడీలచక్షువుల్ పెగలి చెదరె
యుద్ధగాంగేయ! నీయుద్ధతి కదిసిన
మొగలురాహుత్తులు పగిలి పాఱె

గీ. నారసబలీసహస్రబాహాభిరామ
బిరుదసన్నుత జయశాలి భీమకేళి
దామెరల వెంగళేంద్రుని తనయమౌళి
చిన్నవెంకటనృపశాలి మన్నెహేళి.

ఈనకొమారుడు అయ్యప్పనాయడు ప్రభుత్వం చేశినప్పుడు యీానపద్యం:

సీ. అభియాతి సర్వంసహాధీశమండలీ
కంఠరక్తము లుగ్గుగాఁగఁ బొదలి
దుర్మదారాతిమేదోమాంసమస్తిష్క
మృదులాన్నకవళముల్ మెసఁగి మెసఁగి
పరిపంథిరాజదుర్భరగర్భపటలముల్
భక్షించి క్రొన్నల్ల వట్టి పట్టి
ప్రత్యర్థిగజశిరోభాగకపాలని
ర్యన్మౌక్తికశ్రేణి రాల్చి రాల్చి

గీ. చండతారక భుజదండ మండలాగ్ర
కాళరాత్రి చరించు నుత్కటము గాఁగ
ధీజనాధార వెంకటాధిపకుమార
ఆశ్రితోపేంద్ర దామెర అయ్యపేంద్ర!

ఈనకొమారు చిన్నవెంకటప్ప నాయనివారు ప్రభుత్వం చేస్తూ వున్నప్పుడు యీనపద్యం -

సీ. ఒడలు వెల్వడి చిచ్చు లుమియుకత్తుల ధగ
ధగలు గన్గొని గుండెదిగులు గొనక
కొమ్ముకత్తులు చిమ్ముకొని వచ్చుభద్రదం
తావళంబులఁ జూచి తల్లడిలక
ఘోటికావరపుటీకోటీహంతరజోవి
జృంభణంబులఁ గన్న చెదరి చనక
ఢాక మించుధమామి టోకు కఠోరముల్
చెవులు సొచ్చిన బిట్టు చెదరి చనక

గీ. నిల్చి పోరునఁ దెగటార్చి నీదుభటులు
పొడువ శాత్రవభటపాళి పోటుగంటి
దూరుదువు నీవు దురుసవు దొరవు గనుక
వినుతగుణసాంద్ర! దామెరవెంకటేంద్ర!

యీ ప్రకారం కొన్ని దినములు రాజ్యం చేస్తూవుండి చన్నప్ప నాయనివారిని ఆ ప్రభుత్వంలో వుంచి వెంకటప్పనాయనివారు శ్రీరంగ రాయనివారి దగ్గరికి దక్షిణరాజ్యాలు ప్రభుత్వం చేశ్శివయినం ఉత్త రాదిన సుంకేశల, దేవరకొండ, వాలూదు వగైరా రాజ్యాలు ప్రభుత్వం చేస్తూవుండిరి గన్క గోలకొండ రాజ్యం ప్రభుత్వం చేస్తూవున్న తురకలు యీ దక్షిణ రాజ్యాలు ప్రభుత్వం చేశేది చూడజాలక ఆ శ్రీజయించ వలెనని ప్రయత్నంచేశి అందుకు తగినసరదార్లను పంజును ప్రయాణం చేసినంతలో ఆ పంజు వచ్చి కందుకూరి బయళ్ల దిగినంతల్లో ఆ సమా చారం శ్రీరంగరాయలవారికి తెలిశి వారున్ను తగినసలతనచేసి అప్పుడు వెంకటప్పనాయనింవారు బహుక్షాత్రవంతులని తెలిసి వారికి వ్రాయించి పంపించిరికదా మీరు కర్నాటకస్తులు బహుక్షాత్రవంతులు మా రాజ్యాలమీదికి ప్రయత్నంచేశి తర్లివస్తున్నారు. మేమున్ను దళ సమేతంగా వారిమీదికి తర్లివస్తున్నాము. మీరున్ను దళసమేతంగా తర్లివచ్చినట్టు అయితే యీ కార్యం ఫత్తా అయినవెనుక మీకు మాకు జాగీరులు సకలబహుమానాదులున్ను మా స్థానాన్కు వజీరుగానున్ను సకలమర్యాదలున్ను నడిపిస్తు వున్నామని వ్రాయించి పంపించినందున పెదవెంకటప్పనాయనింవారు వారి తమ్ముడైన చెన్నప్పనాయనింవారిని అక్కడవుంచి వారు దళసమేతుగా వచ్చి శ్రీరంగరాయలవారితో కలసి కందుకూరి బారుమీదికి పోయి లడాయిచేశి రాయలవారికి జయపదం చేశి యిచ్చినందువల్ల వారు బహుసంతోష చిత్తులై వీరికి సకలమైన బిరుదులు సింహతలాటాలు మొదలైన బహుమానములు యిచ్చి జహాగీరు కాళహస్తి, వందవాశి, చంజి వగైరా రాజ్యాలు యిప్పించి తమసైన్యముతోకూడా వెంటబెట్టుకుని వచ్చిన తరవాత యీ రాజ్యాలు ప్రభుత్వం చేస్తు వచ్చినారు. యీ లడాయిలో జయప్రదమైనది. వారి యొక్క కీర్తిప్రతాప మైన పద్యాలు వ్రాయించినాము యేమంటే :

సీ. గోలకొండవజీరుఁ గొట్టి దుముదారుగాఁ?
గందుకూరి జయుల్లఁ గదిసినపుడు
శరపరంపర వృష్టి గురియించి బాణంబు
లొండుగా నొనరించి యొగిఁ దుబాకు
లై దాఱువేలకు నారగాఁ బదివేలు
రౌతు రాణువ మిన్ను ప్రాకినటుల
యొకటి రెంటను గుంపు లుత్పాతహేతులై
గట్టినదేవేంద్రుగతిఁ జెలంగి

గీ. ఘనత భద్రాయు వనియెడి గజము నెక్కి
గుంపు లన్నియు నొకగుంపు గూర్చి నఱికి
దంటతనమున జయము చేకొంటి వౌర!
విక్రమమృగేంద్ర! దామెర వెంకటేంద్ర!

సీ. వెంట నంటినవారు లంటి కూడక మున్నె
యెంత లేదని తన కెదురు లేక
రాచూరి బాణాలు రవళిఫిరంగీల
యొడ్లపై ఁ ఱికిన యుద్ధ్రతంబు
కరికి గాయము దాఁకి చురుకు లట్టిట్టైన
నరికి దారికిఁ దెచ్చి నడువనేర్పు
ప్రథనముఖంబున బలుగాయములు దాఁకి
దాటి శత్రుల గెల్చుధైర్య పటిమ

గీ. కందుకూరందు పై భవక్రమము లెల్ల
నెంచి వినుతించ నాబ్రహ్మకేనిఁ దరమె
యమితగుణహార! కృష్ణమాంబాకుమార!
వెలయు దామెర చెన్నభూవెంకటేంద్ర!

సీ. పదిహేనువేలకు బలువైన గుఱ్ఱముల్
ఘనవజీరులను సింగాణివిండ్లు
నమ్ములఁ గురియించి కమ్మి బాణంబులు
బలసి ముట్టించి తుపాకివేట్లు
నూరారువేలకు ధీరంబుతో నేసి
కదిసినఁ దా నెక్కు గజమునకును
ముప్పదిగాయముల్ మొనసి డాలుకుఁ దుపా
కీవేట్లు పదునైదు కెరలి తాఁకి

గీ. తనకు గాయంబు దాఁకినఁ దలఁక కపుడు
నెంచి గోలించి తురకలఁ ద్రుంచినాఁడు
కందుకూరందు చెన్నభూకాంతసుతుఁడు
మహిని దామెర వెంకటమ్మావరుండు.

సీ. మన్నె మార్తాండుతో మత్సరం బేటికి
మానుమీ అలముఖాన్ ఖానరాయ
రాయమన్నీలతో రణము సేయఁగ వచ్చి
కలువరించే వదే కాటి కాజి
మన్నెసింహముఁ జేరి మతి నిల్వఁగా లేవు
దూసుకో బాగు పారాసుఖాన
మన్నెబెబ్బులితోను మసలక గునుకెత్తు
వినుము హల్లాకొల్లి విశదముగను

గీ. బాల నను నెడి నవ్వు డాగోల రోతు
ఘోర వజ్రీలు నినుఁ గందుకూరి బయల
వర్ణితోదార! చెన్నభూవర కుమార!
వీరబలసాంద్ర! దామెర వెంకటేంద్ర!

సీ. కర్ణాటకక్షోణిఁ గలమన్నె వారితో
విఖ్యాతకీర్తుల వెలసినావు
దమరీతి సింహాసనమున నాఁడును నేఁడు
పెద్దవై కార్యముల్ దిద్దినావు
రణదళాఖానుని రాకుండఁ బోఁ ద్రోలి
గదిమి సంస్థానంబుఁ గాచినావు
........... ....................
..............................

గీ. ప్రభుమణి వటంచు శ్రీరంగరాయ లపుడు
పంపు నిన్నప్పఖానిని జంపి మఱియు
గెలిచి తురకలఁ దఱిమితౌ కృష్ణ దాఁట
వీరబలసాంద్ర! దామెర వెంకటేంద్ర!

యీ రాజ్యాలు ప్రభుత్వం చేస్తూ వున్నంతలో మరికొన్ని దినములకు వీరు క్రమించిన వెనుక యీనకొమారుడైన చన్నప్ప నాయనింవారు వారికొమారుడు ముద్దు వెంకటప్ప నాయనింవారు ప్రభుత్వం చేస్తూ వున్నప్పుడు యింగిరీజు బహాదరువారు మరి కొన్ని దినములకు యీ రాజ్యాలకు వచ్చి మధిరాసు రేవు బందరు చాయ వలె నని ప్రయత్నం చేశి యీ రాజ్యాల్కు ప్రభువులయ్ను మా పెద్దల్కు తమ అభిమానం తెలియ చేశినంతల్లో యింగిరీజు బహాదరు వారు గొప్ప సరదార్లు. వీరికి మనము యేమి విహితంగా నడిపించినా అది ఉత్తరోత్తరా మ్న శ్రేయస్కరానకు హేతువ వంటిది. చంద్ర సూర్యులు వున్నమట్కు మ్న వంశంమీాద అభిమానం వుండు నని యోచన చేశి చన్నప్పనాయని వారి కొమారుడు ముద్దు వెంకటప్ప నాయనింవారు యీ రేవుదగ్గర తన తండ్రి అయిన చన్నప్పనాయనిం

వారి పేరిటను పట్నం కట్టించి వృద్ధి చేశేటట్టు మాకు యిష్టదైవంగా వున్న చెన్నకేశవస్వామి ఉభయనాంచార్లతో కరుకు వరహా వెట్టు వేశి నడిపించేటట్టు నిష్కర్ష చేస్కుని రాయసంస్థల్లో అహం వహించి జవాజాస్త్వాలు చేశి ఆ స్థళం మా రేవుకు తీర్చి యిచ్చినారు. మరికొన్ని దినములకు పట్నాన్ని గురించి ప్రతిసంవత్సరం ఫేష్కసు ఒక దిట్టంగా యేర్పరచుకోవలెనని కౌలు పుట్టించుకోవలెనని ప్రయత్నం చేసినంతల్లో ముద్దు వెంకటప్పనాయనింవారు శ్రీరంగనాయకులవారి దగ్గర జవాజాస్త్వాలు చేశి చన్నపట్నానకు ప్రతిసంవత్సరం వెయిన్ని నూరు వరహాలు ఫేష్కసు నిష్కర్ష చేయించి శ్రీరంగనాయనివారి తరఫున వకశాసనమున్ను ముద్దు వెంకటప్పనాయనివారి తరఫున వక దిమ్మత్తున్ను పుట్టించి యిచ్చినారు. శ్రీరంగరాయలవారు వ్రాశి యిచ్చిన బంగారు శాసనంమీద వ్రాశి యిచ్చినది యేమంటే యింగిరీజు కుంపినీవారు చన్నపట్నానకు ప్రతిసంవత్సరం ఫేష్కసు వెయిన్ని నూరు వరహాలు యిచ్చేది. శాశ్వతంగా అనుభవించుకొనేది. చన్నపట్నంలో టంకసాల చన్నకేశ్వరస్వామి ఉభయనాంచార్లతో కూడా వరహాలు వెట్టు వేసుకునేది. దేవాదాయం బ్రహ్మాదాయం నడిపించి కర్నాటకస్థల పట్నంవలె అన్నివిధాలా చన్నపట్నాన్ని యంచి నడిపించ గలది అని యిత్యాది సంగతులు వ్రాశి వున్నది. రెండోపద్దు దామెర్ల ముద్దు వెంకటప్పనాయనివారి పేరట వ్రాశి యిచ్చిన దిమ్మత్తులో చన్నపట్నం రాయలవారు వ్రాశి యిచ్చిన శాసనప్రకారం పూర్జితంగా అనుభవిస్తు రాగలవారు అని వ్రాశి వున్నది. యింగిరీజు బహద్దరువారు సూర్య చంద్రులు వుండేమటుకు మనమీద అభిమానం తప్పరు. మన వంశస్థులు వుండేవారంతా వారితో స్నేహాభివృద్ధిగా వుండేది అని వ్రాశి యిచ్చినారు. తదారభ్య యింగిరీజు బహదరువారు ఆవిశ్వాసం మనసులో వుంచి అప్పటప్పట్కి మా పెద్దలకు బహుమానం

అంపిస్తూ రావడం, మావారు యెప్పుడైనా చన్నపట్నానకు పోయినా యింగిరీజు బహదరువారికి బహుమానము అంపినా అవి ఘనమర్యాదగా రప్పించుకొని యిరవైయొక్క ఫిరంగీవేట్లు వేయించి యితర లాంఛన బహుమానములు అంతఃకరణంగా నడిపిస్తూ వచ్చిరి. మరి కొన్నిదినములకు యింగిరీజు బహదరువారు ఫ్రాంసువారికి మైలాపురి దగ్గర లడాయి అయినంతల్లో మాపెద్దలు యింగిరీజు బహదరువారితో కూడా సహాయమై ఫ్రాంసువారిమీద లడాయి చేశి ఆకార్యముల్లో మాపెద్దలు చన్నప్పనాయనివారు ముద్దులనాయనివారు కొందరు బంధువులు విశేషంగా సైన్యమున్ను స్వర్గస్థులైరి. ఆకార్యం ఫత్తె అయినందున యింగిరీజు బహదరువారికి మా పెద్దలమీద నిండా అంతఃకరణ వుంచి సకల మర్యాదలు వారు చేశినారు. ఆలడాయిలో మావారియొక్క కీర్తి ప్రతాపము లైనపద్యములు.

సీ. 1 మునుమున్న యేరాజు మున్నలిబయఖుల
వేలూరి లింగభూవిభునిఁ గొట్టి
పంచవన్నియడాలు పట్టించె నేరాజు
పరవీరభద్రేభ పటలిఁ దెచ్చి
ధీరత గూడ లాతూరిలో నేరాజు
క్షాత్రవబలముల సంహరించె
శుక్రవారమునాఁడె చొఱబాఱి యేరాజు
పాంఢ్యుని బలముల భంగపఱిచె

గీ. నతఁడు సామాన్యుఁడే దామెరాన్వవాయ
కలశవారాశి పూర్ణరాకాశశాంకుఁ
డనఁగ గడికోట మల్లశుభాంగయుతుఁడు
2 వేంకటేంద్రుని చెన్నభూవిభువరుండు

---

1. ఈ పద్యము బహులాశ్వచరిత్రములోనిది.

2. చన్నభూపాలుఁ డరిరాజసన్నుతుండు.

చన్నపట్నంలో ఫ్రాంసులవారిమీాద చేసిన లడాయి పద్యాలు:

సీ. సూర్యుండు తాఁ దోవఁ జూపి కూర్మిని బంప
నిది లగ్న మని గురుఁ డెచ్చరింపఁ
దూర్పు టేనుఁగు బలాదూరు దిష్టులు దీయ
మునుపుటింద్రుఁడు బీగెముద్ర లీయ
రంభాది సతులు హారతు లెత్తి జయ లాడ
నారదమౌని గానంబుఁ బాడ
గరుడోరగామరవరులు చెంగట నిల్వఁ
జిత్రసేనాదులు చేరి కొల్వ

గీ. ఫ్రాంసువీరులఁ జెండాడి ప్రాభవమున
నల సుధర్మను రత్నసింహాసనమున
నిండుకొలువునఁ దమతండ్రి దండ నుండె
ముద్దు ముద్దుగ దామెర ముద్దులయ్య.

సీ. కజ్జ మయ్యెను వీఁపు కదనరంబుచే నని
భక్తి నూర్వశి మూపుఁ బట్టుచుండ
నొచ్చెఁ బాదము లంచు వచ్చి వేగ ఘృతాచి
యొయ్యనఁ గుచపాళి నొత్తుచుండ
నెండకాఁకల మేను పండఁబాఱె నటంచుఁ
బొసఁగ రంభ పయంట విసరుచుండ
నగ్గిఁ దీర్పవలయు నని వచ్చి శశిరేఖ
కూర్మితోఁ బన్నీరు గులుకుచుండ

గీ. ఫ్రాంసువీరులఁ జెండాడి ప్రాభవమున
నల సుధర్మను రత్నసింహాసనమున
నిండు కొలువునఁ దమతండ్రిదండ నుండె
ముద్దు ముద్దుగ దామెర ముద్దులయ్య.

సీ. చెల్ల వింద్రుం డనుకిల్లాకు లేక నని
పలుమారు తెలుఁగుబిజ్జలుఁడు పలుక
నలకూబరునిత్రుల్లు పొలిబాయరే దని
మెండుగా విక్రమార్కుఁడు వలుకఁ
బ్రాపు కల్గెను నేఁడు ప్రతి యెవ్వ రిఁక నని
పేర్మితోఁ దిక్కనప్రెగడ వలుకఁ
బారిజాతము వీనిపా లయ్యె నిఁక నని
యళిరామరాజేంద్రుఁ డెలమిఁ బలుక

గీ. ప్రాంసువీరులఁ జెండాడి ప్రాభవమున
నల సుధర్మను రత్నసింహాసనమున
నిండుకొలువునఁ దమతండ్రిదండ నుండె
ముద్దుముద్దుగ దామెర ముద్దులయ్య.

సీ. విసుమాలి బుద్ధులు వీనులు సోరనీక
యరులచే ధనముల కాసపడక
మొనను స్వామిద్రోహమునకుఁ దా లోఁ గాక
పెనుజూదము లేదని వెనుక దీక?
యనుదినంబు నిద్ర నాహారమును లేక
వాలు బిరుదును డాల్ గోలుపోక
వైరు లేతెంచిన వడి ముచ్చముణుఁగక
కీర్తిఁ బోనీక దుష్కీర్తి తేక

గీ. ప్రాంసువీరులఁ జెండాడి ప్రాభవమున
నల సుధర్మను రత్నసింహాసనమున
నిండుకొలువునఁ దమతండ్రిదండ నుండె
ముద్దుముద్దుగ దామెర ముద్దులయ్య.

సీ. విజయునితోఁ బోరు విమతుల తలదూరు
చేరి పోవుట భయము చిచ్చుమయము?
వాని పందలకత్తి వైరుల బలుమిత్తి
తఱిమి వెంబడి హత్తి తలలు మొత్తి
బలుఫిరంగులనాదు పటముగా నిల నీదు
ధరణీధ్రములు లగలు తలలు పగలు
చూఱ దప్పఁగ లేదు చొచ్చి పోవఁగ రాదు
చికిలిగుం డ్లేసినఁ జిత్తవాన

గీ. ఫ్రాంసువీరులఁ జెండాడి ప్రాభవమున
నల సుధర్మను రత్నసింహాసనమున
నిండుకొలువునఁ దమతండ్రిదండ నుండె
ముద్దుముద్దుగ డామెర ముద్దులయ్య.

యీ ప్రకారం యింగ్లీజువారి యంతఃకరణ నిండా కలగవలె నని సకలవిధాలా మొహానతు చేసినారు. పూర్వోత్తరం తెలియగలందులకు యేమంటె మునిశల బడదీసు అనే ఫ్రాంసు సరదారుడు చన్నపట్ణంమీాద యుద్ధం చేసి స్థళం తీసుకొని తిర్గి స్థళం యింగిలీజు బహాదరువారు తీసుకొన్నతర్వాత-పట్నంనిమిత్తం లోగడ పుట్టివున్న దస్తైవజులు తెలియవలసినందులకు కుంభిణీలేఖపత్రాలు శోధించినప్పుడు సదరహి వ్రాసిన రాయశాసనమున్ను ముద్దు వెంకటప్పనాయనివారి దిమ్మత్తును అగుపడినందున తీసి వుంచినారు. ఇదిగాక చన్నకేశ్వరస్వామి దేవాలయం కట్టించి నైవేద్యదీపారాధనలుకు సంవత్సరం ౧-కి నూరువరహాలకే యిదివరకు నడిపిస్తూనే వున్నాము. వారితదనంతరం కరిచన్నప్పనాయనింవారు పెద అక్కప్పనాయనింవారు యీ రాజ్యాలు ప్రభుత్వం చేస్తూవుండి రావూరిబారులో జయించినందున అక్కప్పనాయనింవారికి

రాయలవారు నిండా దయచేసి మునుపటి జహాగీర్లు కాక చిరుతనాపల్లి తంజావూరు తాలూకాల్లో కొంత నిండ్రదపొన్న నాన్నవరం వగైరా తాలూకాలు జహాగీర్లు దయచేసి నడిపించిరి. గనుక ప్రభుత్వం విస్తారమైనప్పుడు యీభై పల్లకీలవారున్ను పద్ధెనిమిదివేల పంజు కొలువు కొలుస్తూ వుండిరి. యీ ప్రకారం ప్రభుత్వం చేస్తూ వున్నంతలో కొన్ని దినంబులకు సమయవరందగ్గర లడాయిలో అక్కప్పనాయనింవారు స్వర్గస్థులైరి. వీరియొక్క ప్రతాపమైనపద్యము :

సీ. అల పాదుశాహుచే నాకు లందితి వని
విజయాదిపురిసామి విన్నయ్యెఁ
గడిమితో దక్షిణకార్య మందితి వని
మధురాధిపతి కనుమాన మొదవె
బెడిద మహాప్రస్థానభేరి వేయించుట
మయిసూరు దొరయుఁ గన్నులు బిగించెఁ
గదిసి సోమశిల దగ్గఱ వచ్చుటను విని
తంజాపురీశుఁడు తత్తళించె
గీ. దండె రాపూరిబైట నుద్దండముగను
దారసం బైనమన్నీలఁ దఱిమె నపుడె
కడమదొర లెల్ల దిక్కుమొగంబులైరి
యెన్న దామెర్ల అక్కయ చన్నధీర!

సీ. ఘనపతిద్రోహరగండాంకుఁ డగుటకుఁ
బాండ్యభూమండలభర్త సాక్షి
తివిరి పెట్టినదండు దీవియ వవుటకు
రంజిల్లుసమయవరంబె సాక్షి

మోసినయరులపాం దాసించువాఁ డౌట
కుభయసైన్యముల భూవిభులు సాక్షి
బిరుదు మించినమహోద్ధురతకు ముం జేతఁ
గట్టినకపికేతుపట్టి సాక్షి

గీ. రహి మహాభాగవతతకు రంగధామ
చరణపాథోరుహప్రదేశంబు సాక్షి
గాఁగ నద్దేవునందు నైక్యంబు నొంద
నరులఁ బరిమార్చె దామెర అక్కశౌరి.

శా. ధిక్కారక్రమ! విక్రమోగ్ర! పరిపంథివ్రాతముల్ నీవలెన్
జక్కాడం గలమన్నెవాని నిఁక నే చక్కిన్ వినన్ లేదులే
చక్కం జూడఁగ శత్రుఁడా యొకఁడు నీ సంరంభ మజ్ఝారె స
మ్యక్కోలాహలధక్క! దామెరల అక్కా! మన్నెకంఠీరవా!

సీ. ధృతి సాగి కొండభూపతి యతిరాజులు
కడు నొప్ప శంఖచక్రములు గాఁగఁ
జండవిక్రముఁ డైన సాగి లచ్చన కడు
డంబైనయట్టిశార్ఙ్గంబు గాఁగ
సమరభీకరుఁ డయి చను వేంకటేంద్రుఁడు
కౌమోదకస్ఫూర్తిగా నెసంగ
..............................
.................... ..........

గీ. మోకులక్ష్మీసమేతులై ముఖ్యభటులు
పార్శ్వవర్తులుగా సూర్యపథము దాఁటి
దామెరాక్కవసుంధరాధవుఁడు విష్ణు
మూర్తి చెన్నొందు వైకుంఠపురమునందు.

సీ. అరివర్గములఁ దాఁకి యని నుగ్గుగా నూకి
వెన్నాడి శరములు వేసి డాసి
మదగజంబులఁ జేరి మావుత్తులను జీరి
కరములు శిరములు నఱికి పెఱికి
కాల్బలంబులఁ ద్రోలి గాండివి యనఁ జాలి
నెర వైనమన్నీల నెత్తి మొత్తి
పోరక వెఱఁ బాఱి పుట్ట లెక్కెడువారిఁ
గరుణార్ద్రదృష్టి వెన్గాచి కాచి

గీ. తహహహా! నీసాటి యెవ్వ రీ యధిపకోటి
గురుతరోద్దండ! పులియమూరోకెలుగండ!
చెన్నభూపాలపుత్ర! సుస్థిరచరిత్ర!
హరినిభాటోప! దామెర అక్క భూప!

యీన కుమారుడు ముద్దు వెంకటప్పనాయని వారియొక్క పద్యం:

సీ. మత్తవిరోధిచర్మంబు పల్లము గాఁగఁ
బరఁగఁ ద్రేవులు నుగ్గపట్టు గాఁగ
విమతవర్గముల శల్యములు కళ్యము గాఁగ
వసుధీశునరములు వాగె గాఁగ
నభియాతి దాళువ లంకవన్నియ గాఁగఁ
బుడమిాశుక్రొవ్వు పావడలు గాఁగ
భూపాలుకండలు పూలదండలు గాఁగ
నరులపున్కలు బిరుదండె గాఁగ
రణశూరుకన్నుగుడ్లు మణితురాయులు గాఁగ
గమకంబు పరభయంకరము గాఁగఁ
బోరి ఘోటధ్వనుల్ భువనకంపము గాఁగ
జోడుగా జయలక్ష్మి తోడు గాఁగ

గీ. వాగె సవరించి యక్కునివాజి రిపులఁ
దుంచి విదళించి దిశల రాణించి తౌర!
సలలితోదార! దామెర్ల కులవిహార!
కలితగుణజాల! ముద్దు వెంకటనృపాల!

సీ. బహుళశాస్త్రవరాజపంక్తి దామెనగొర్లు
పొలుచుప్రత్యర్థులు పునుకపేర్లు
చండించుమన్నీల గుండెలే కుడుములు
మెండుమాంసంబులు పిండికూర
విరసించు మన్నీల వీపు డాగురకిల్లు
వైరివీరులజడల్ వీరదాళ్లు
మదవద్విరోధుల మెదడు గంధపుఁబూఁత
బహురక్తపూరముల్ పానకములు

గీ. గాఁగ జాతర లాడించి ఘనత గాంచి
ప్రకటరణకేళి నీఖడ్గభద్రకాళి
సలలితోదార! దామెర్లకులవిహార!
కదనహంవీర! ముద్దువెంకటవజీర!

యీప్రకారం ప్రభుత్వం చేస్తూ వచ్చిరి. వారి తదనంతరం అయ్యపనాయనింవారు రావూరివారును జయప్రదమైనందున నీజాంవూరు పోయి అక్కడి కార్యాలు ఫత్తి చేసుకుని తిరుగ చిరుతనావల్లెకు వచ్చి ప్రభుత్వం చేస్తూ వచ్చిరి. మరి కొన్ని దినంబులకు మయిసూరివారి మీాద యీ రేటిబ్బారులో అయ్యపనాయనింవారు కంచి లడాయి యయిన వెనుక స్వర్గస్థులైరి. వీరియొక్క ప్రతాప మైనపద్యము.

సీ. పగఱవజీరుల పలుగుడారులు కదా
భద్రేభములమీఁది పరువులకును
దగుదుసేదారుల తగటుకోకలు గదా
స్వామి నీబిరుదధ్వజంబునకును
మత్తారిసరదార్ల మైకబాయులు కదా
పడివాగె తేజుల పల్లములకు
శత్రురాహుత్తుల చర్మంబులే కదా
మొనసి నీదు ఢమామిమూఁతలకును

గీ. సమరోఁ గద కంచిబైళ్ల ఘోరాహవమునఁ
గెరలినసహావజీరుని గెలిచి నీవు
విజయలక్ష్మిని గైకొను వేళ దామె
రయ్యపేంద్ర! మహోగ్రసాహసమృగేంద్ర!

వీరి తదనంతరం వీరి కొమారు డైనచన్నప్పనాయనింవారు కొన్నిదినంబులు ప్రభుత్వం చేసి వారున్ను లడాయిలో స్వర్గస్థు లైరి. గనుక వారియొక్క ప్రతాప మైనపద్యము—

శా. ఘోరాజిం దన తేరుఁ దోలి విమతక్షోణీతలాధీశులఁ
నారాజిం దెగటార్చి వీరభటసన్నాహంబుతోఁ జేరి యా
నారోజాగజహస్తముల్ నటికి నానావస్తువుల్ గొన్న యో
నారీజాలమనోజ! దామెరలచెన్నా! మన్నెకంఠీరవా!

సీ. ఢీవోలు మొదలుగా ధీరు లౌవజీలు
గరిమతోఁ దనదిక్కు కనుగొనంగ
నీచిన్నవానికే యింత సాహస మని
కడుఁ దుపాకుల కృష్ణఘనుఁడు మెచ్చ

నెంత శూరుం డని సంతోష మంది రా
విళ ముద్దుకృష్ణేంద్రుఁ డలరుచుండఁ
బెదతండ్రికంటెను బిరుదుమన్నీఁ డని
తండ్రి ఆయపనేఁడు తగు ననంగ

గీ. దురమున నెదుర్చు శాహాజీ తుక్కన కర
వీరరాహుత్తులను జెండి వేసి తౌర!
యపుర! నీసాటి మన్నియ లవనిఁ గలరె
నవ్యగుణసాంద్ర! చెన్నప్ప నాయకేంద్ర!

వ॥ వీరియొక్క రాజ్యాలు ప్రభుత్వం చేశేటట్టువంటి దినముల్లో వారు యిచ్చినటువంటి దానపత్రాలు శాసనాలున్ను అగ్రహారశాసనాలు కంచి, వందవాశి వగైరా స్థలాల్లో చెరువులమీాద వుండేటటువంటి శాసనాలున్ను తమరు దరియాప్తు చేసినట్టు అయితే తమకే విశద మవుతున్నది. వీరి తదనంతరం వీరి కుమారుడైన కొమార అక్కప్పనాయనింవారు బాలురు గనుక కార్యస్థులు పెద్దలు అందరు క్రమించి పోయినందున చెంజి, చిరుతనావల్లె, వందవాసి వగైరా తాలూకాల కున్నలలు వచ్చె గనుక వందవాసినుంచి శ్రీకాళహస్తి రాజ్యం వారితరవుననే వుండె గనుక శ్రీకాళహస్తి ప్రవేశించి తమ బంధువులైన సరదార్లను యిక్కడ వుంచి కుమార అక్కప్పనాయని వారు యథాప్రకారం తాలూకాలు జాగీరు తీసుక రావలె నని యోచన చేసి-గోలుకొండకు అలంగీరు పాదుషావు వారి తావుకు ప్లవంగ సంవత్సరంలో తర్లి పోయి పాదుషావు వారిభేటి అయి కొన్ని దినంబులు అక్కడ వుండి యథాప్రకారం తాలూకాలు దయచేయవలయు నని సకలవిధాల మనవి చేసుకుని అందుకు పాదుషావువారు మీారు బాలులు యింకా కొన్ని దినములు మాదయకు పాత్రులు అయి

నట్టు అయితే అదే ప్రకారం దయచేస్తా వున్నాము. యిప్పుడు కాళ హస్తి సీమకు పేషుకస్సే అక్కర లేకుండా వ్రాయించి యిప్పిస్తు న్నాము అని సెలవు యిచ్చి కాళహస్తి సీమపాళేలు వగైరా దరోబస్తు పరమానా వ్రాయించి యిప్పించి సకల బహుమానాలు దయచేసిరి గనుక్కు ఆబహుమానాలు తీసుక్కుని కాళహస్తి ప్రవేశించి ప్రభుత్వం చేస్తూ వుండిరి.

సీ. కోదమసింగము నైన మద మణంపఁగ నచ్చు
బేతాలుతో నైనఁ బెనఁగవచ్చు
దండిమృత్యువు నైనఁ దఱిమి కొట్టఁగవచ్చు
బడబానలము కేలఁ బట్టవచ్చుఁ
గార్చిచ్చుతో నైనఁ గదిసి మార్కొనవచ్చు
బెబ్బులిమీసాలఁ బెఱుకవచ్చు
భీకరమార్తాండబింబ మంటఁగ వచ్చుఁ
గాలభైరవు నైనఁ గదియవచ్చుఁ

గీ. గాక నీధాక కెదిరించి కదనమునను
నిలుచునా యెంతవాఁడైన నళుకు లేక
భాగ్యచారిత్ర! చెన్నభూపాలపుత్ర!
హరినిభాటోప! దామెర అక్కభూప!

వ॥ వీరితదనంతరం వీరికుమారుడైన పెదవెంకట నాయనివారు తిమ్మానాయనివారు వీరు యిద్దరు ప్రభుత్వం చేస్తూ వచ్చిరి. యీ ప్రకారం ప్రభుత్వం చేస్తూవున్నంతలో అన్వర్ఖాగారు దక్కనుసుబా విచారించగలందుక్కు ఆరికారి సుబాకు వచ్చిరి. గనుక్కు పెదవెంకట నాయనింవారున్ను వారి (తమ్ముడు) తిమ్మానాయనింవారు వీరికొమారు

డైన కొమారవెంకటప్పనాయనింవారున్ను అనజ్జావారితావుకు పోయి వారిభేటి అయి వారియంతఃకరణ కలిగేటట్టుగా సకలవిధాలా కొలువు గొలిచి పూర్వోత్తరం సంగతి రాజ్యాలు జహగీరుల వయనం యావత్తూ మనవి చేస్కుని మాజాగీర్లు యథాప్రకారం మాకు దయ చాయ వలె నని మనవి చేసుకున్నందున వారు గోలకొండకు తర్లిపోయేటప్పుడు యీసుబాకు నియమించి వున్న అనవర్దిఖానుని వారిపేరట వీరికి కొంత జహగీరులు యిప్పించమని ఫరమానా వ్రాయించి యిచ్చిరి గనుక వారిచేత బహుమానములు తీస్కుని అనవర్దిఖానుని వారి తావుకు వచ్చి వారిభేటి అయి ఫరమానా చూపించి మనవి చేస్కున్నంతలో ఉత్తరాదిన పామూరు సీతారాంపురం తాలూకు జహగీరు దయచేసిరి గనుక వారి చేత సెలవు తీస్కుని శ్రీకాళహస్తి చేరి పంజుమందిని కూర్చుకుని తాల్కుమీదికి పోయి ఆ తాలూకాలో నున్న వాడవారు, బషీక మొదలయ్ని సరదార్ల-క్షిని మీద లడాయి చేసి వాండ్లను సంహరించి ఆ రాజ్యం కట్టుకుని కొన్నిదినంబులు ప్రభుత్వం చేసిరి. అప్పుడు లడాయి చేసినప్పుడు యీ రెయొక్క పద్యములు :

సీ. ధూర్త! నీజయఢాటి వార్త విన్నంతనే
   యూర్పులు నిగుడించెఁ దూర్పుదిక్కు
పెక్కు నీదుధమామి పెట్టు విన్నంతనె
   తల్లడం బందెను దక్షిణంబు
ఘన మైననీసైన్యకహకహధ్వనులచేఁ
   బటపట మని వ్రీలెఁ బశ్చిమంబు
సొబగైననీడాలు చూచినయంతనె
   యుఱ్ఱూత లూగెను నుత్తరంబు

గీ. అహహా! మఝ్ఝారె! వీరసంహారశూర!
తారకర్పూరకీర్తికాంతావిహార!
విక్రమోదార! అక్కభూవిభుకుమార!
విభవదేవేంద్ర! దామెర వెంకటేంద్ర!

సీ. శ్రీకరంబుగ భేరి జోకొట్టి నడిమిలా
ఖానుని వ్రేయవా మానువకడ
హత్తిని దుమికించి దుత్తలూరిబయళ్ల
మొత్తవా బప్కాని నెత్తి వగుల
బెడబెడల్ గొనివచ్చు వడి ఫిరంగీగుండ్ల
కెదురుగా నడవవా కదనమునను
జడిసి పోయెడివానిఁ బొడుచుట ధర్మంబు
గాదని నిలుపవా నీదుభటుల

గీ. నవుర! నీకీర్తివిస్ఫూర్తి యజునకైన
వర్ణనలు సేయ శక్యమా వసుధలోనఁ
దిమ్మభూపాలసత్పుత్ర! ధీవిచిత్ర!
వీరబలసాంద్ర! దామెర వెంకటేంద్ర!

వ॥ పెదవెంకటప్పనాయనివారు తిమ్మానాయనివారు క్రమించిన వెనక వారి తదనంతరం కొమార వెంకటప్పనాయనివారు ప్రభుత్వం చేస్తూ వుండిరి. గన్క బహుదినంబులు రాజ్యం చేసినారు. వారు నవాబు వాలాజావారితోకూడా కష్టపడి దయ సంపాదించుకున్నది, మునేలాలి అనే పురిచేరిసరదారుకు చన్నపట్టణంమీద వచ్చి కనిపించు కున్నప్పుడు నవాబు వాలాజావారు యింగిలీజు బహదరువారి యను మతిప్రకారం చన్నపట్నాన్కు యింగ్లీజుబహదరువారికి రసదుపోచా యిస్తు వచ్చినారు. మరికొన్నిదినములకు వాలాజావారి తాలూకు మొదరు

ఖానుడు అనే సరదారుడున్ను పలనాడికి పోయినప్పుడు వీరున్ను కూడా పోయి రెండు సంవత్సరములు అక్కడ వుండి వారియనుమతిచొప్పున పుల్లారెడ్డిగూడెంవగైరా కొట్టి ఠాణావేసి యుభయత్ర్ర ప్రీతి సంపాదించుకున్నారు. మరికొన్ని దినములకు వాలాజావారున్ను జంద్రల్ యిసుమతువారున్ను కర్నల్ పూటువారున్ను వెంకటప్పనాయనివారున్ను కూడా కోళాళస్వారి పోయినప్పుడు వారితోకూడా కడాకువుండి మెహనతుచేసి జెడికోటమార్గాన పూటువారు యిసుమతువారితో కలియ వస్తుండంగా హయిజరువారిపంజు కర్నల్ పూటువారిమీద మొకాబిలా ఆయ గన్క పూటువారిక్కి కుమ్మకుక్కు నిమిత్తం జంద్రల్ యిసమత్ వారు పోతూ వెంకటనాయనివారిని పిలుచుకొని పోయినందున వారితో కూడావుండి హైదరువారి వంజుమీద లడాయి చేసి నిండా మెహనతు చేసి కార్యం ఫత్తె చేసినారు. ఆ వేళ మాపంజులో శేనామందికి చావులు గాయాలు ఆయ గన్క బారావారున్ను యిసమతువారున్ను కూడా సంతోషపడి బహదరు కితాపు బహుమానములు నిండా దయచేసినారు. అప్పుడు వారియొక్క పద్యములు :

శా. కోళాల్ చెంతఁ దురుష్కసైన్యములపైఁ గోపంబు రెట్టించి శుండాలంబుల్ వెస నెక్కి హైదరుసుబా డాబౌసయుల్ దెచ్చినన్
దాళంజాలక వెళ్లసాగి రట కాంతారప్రదేశంబులన్
జాలా శ్రీకర దామెరాన్వయనతంసా వెంకటాధీశ్వరా !

చ. తొలి యిసుమంతలై గదియఁ దొట్రిల వేయుఫిరంగిపెట్లకున్
దొలఁగి కడాఖడీ బవుజు దీఱఁగ మీసముఁ దీడి హత్తిపై
నిలిచి కరాసి దూసి పటు నిర్భర మైనతుపాకిగుండ్లకున్
నలఁగక శామనూరికడ హైదరుబాదరు మీఁద గప్పనన్
గలబడ నోర్చి మొత్తితివిగా మఱి దామెరవెంకటాధిపా !

ఉ. సంగరమందు నీభటులసాహస మద్దిర కామనూర నల్
క్రంగుల నొత్తి యీటెలను గత్తులఁ జూర్లఁ గటార్ల బాకులన్
కంగు ఖణింగు ఘల్లురన గబ్బిగురాన బిరాన జోళ్లపైఁ
జంగునఁ జంగునన్ దుమికి జబ్బలు పిక్కలు డొక్క లక్కలన్
ముంగలఁ పుట్టియల్ దొరుగ మొత్తిరి దామెర వెంకటాధిపా !

వ॥ తిరుపతిదగ్గర మన్మత్కమాలును కొట్టినప్పుడు వీరియొక్క ప్రతాప మైనపద్యము :

సీ. మన్మత్కమాలును మర్దించినందుకు
బైద మహాపాంగళ్లబైలు సాక్షి
చుట్టుపాళే లన్ని చూఱ గొన్నందుకు
గుత్తి మైనకందాటికొండ సాక్షి
హైదరు మిముఁ జూచి మైదుచేఁ గమ్మిన
పోరి గెల్చుట కామనూరు సాక్షి
వడి ఫరంగీగుం డ్లవయఁ జేసి బప్కని
గొట్టినందుకు దుత్తుకూరు సాక్షి

గీ. గాఁగ బలనాటిరాజుల గర్వ మడఁచి
సేతుహిమగిరిమధ్యభూమీతలమున
శౌర్యకీర్తులు ప్రఖ్యాతి సలిపినట్టి
విజయుఁడవు నీవె దామెర వెంకటేంద్ర !

మ. పటుశౌర్యోక్త మహాత్కమాలుదళముల్ పైవచ్చినం జూచి ప్ర
స్ఫుటదంతావళవీరవిక్రమముచేఁ బొంగళ్లబైలన్ రట
త్పటహోద్యద్ధ్వని వించి త్రుంచితివి నీ పట్టాసిచే శత్రురా
ట్పటలిన్ దామెర వెంకటప్రభుమణీ ! భాస్వత్ప్రతాపాగ్రణీ !

వ॥ అనల జంద్రల్ యిసుమతువారున్ను అర్మీలు వుమావారున్ను తంజావూరుమీదికి పోయినప్పుడు వీరున్ను కూడా పోయివుండి నిండా మెహనతు చేసినారు. పులిచేరి యింగ్లీజు బహాదరు కట్టుకునేందుకు జంద్రల్ మంద్రోలువారిని అర్పిస్తూ వారితోకూడా మాపంజును అర్పించ మని హుకుం అయినందున ఆప్రకారం అందించినంతల్లో మాసరదారుకు మంద్రోలువారి యనుమతిచొప్పున మోర్జాలు వగైరా తావుల్లో నిండా మెహనతు చేసినారు. పులిచేరి కట్టుకుని తర్వాత మా సరదారుడికి బహుమానం యిప్పించి వెంకటప్పనాయనింవారికి యేనుగ గుఱ్ఱం కత్తి వీరకంకణం వగైరా బహుమానములు అర్పించినారు. ఆ పద్యము :

శూరుఁ డటంచు మెచ్చి రణశూరుఁడు మేల్ నుమదల్లి మీఁకు ని
ద్ధారుణి వీరకంకణము తాళి తురాయి జిరానిసరాలు బల్
భారహజారి యేనుఁగును బాళిచిపంతులచేతఁ బంపె నీ
పేరుగ నాల్గుదిక్కులకు బెట్టుగ దామెర వెంకటాధిపా !

వ॥ అవతల మరికొన్ని దినములకు కొండపాళెంగారలు సరకారు మీద తిరగబడి పోళూరికోటలో తానా ఉన్న ఆరికాటి కోట కొత్త వాల్ అబ్బాసుమహమ్మదును తలకాయ కోసుకొని పోయినందుకు వాలా జావారి యనుమతిమీద చంద్రల్ వెల్లి వారితోకూడా వుండి పాళేల లడాయిలో నిండా కష్టపడి ఫత్తి చేసినందున నవాబు వాలాజావారితో పాళేలు పూర్వం మాది అని మనవి చేసుకున్నందున వాలాజావారు నిండా బహుమానం దయచేసి ఆ పాళేలు మాకు కొన్ని జహాగీరు యిచ్చినారు. ఆ లడాయి చేసినప్పుడు వీరియొక్క పద్యములు :

సీ. నీభేరి ధణధణానినదంబు విన్నంత
వేలూరి పాళెంబు గోలుపోయె
నీభటావళి కిల్కిలార్భటుల్ విన్నంత
పురి వీడి బాల్నీడు పరుగు సూపె
నీదు ఝండాహోొయల్ నెఱిఁ జూచినంతనే
పీర్లకొండన కొండదార్లు సేరె
నీప్రతాపస్ఫూర్తి నిబిడమైనంతనే
మోదెప్పనాయనివాది యణఁగె

గీ. నాఁడె కదలెను సాయబునాయఁ డహాహ!
తత్తరించెను లోకచారితంబు చారి?
మనకు రణమేల యీగెరామన్న యనుచు
వెళ్లి కారార! దామెరవెంకటేంద్ర!

వ॥ యిటీవల హాయదరు కలాపనలో హైదరువారి తాలూకు శామారాయుడు నాలుగువేల గుఱ్ఱంతోకూడా తిరుపతిలో వచ్చి యుండగా పంజును అర్పించి తాణా లేవగొట్టించి సరకారు తాణాకు అక్కడ వసూలు అయిన రూకలు సరకారుకు చేరేలాగున్ను చేయడమయినది. అప్పుడు లాటుమకారీటీనువారు వాలాజావారున్ను సంతోషపడి ఉభయత్ర బహుమానములు అర్పించినారు. ఆ దినములలో వారియందు యింగ్లీజు బహాదరువారికి అభిమానం వున్నందున నవాబు వాలాజావారి కొమారుడు అమీరుల్ వుమారావువారు వారియందు జిందుజేసి దురాక్షేపణలు చేసి అవిహితములు నడిపించినందున్ను యింగిలీజు బహాదరువారు పూర్వోత్తరం అభిమానం తెలిసినవారు

గనుక్క మాయందు దయచేసి కుంభిణి తరపున మెస్తరుక్లోసువారిని వారి తావున అర్పించి విచారించి మహాలు యావత్తు త్మ సముఖాన్కు వ్రాయించి పంపించి సీమలో తీరి వచ్చిన ప్రకారం గౌనరు చార్లీసువోకిలీ బహదరువారి దినాలలో రాజమొహోరుతోకూడా సదామదు యిచ్చి పేషుకసు తీస్కునేటట్టున్ను ఆధనం అడగకుండా గవనరు ఛార్లీవోకిలీ బహాదరువారి జాబున్ను బహుమానములున్ను యిప్పించినారు గన్క యింగ్లీజు బహదరువారి కోటి కల్పవృక్షంవంటిది అనిన్ని చంద్రుడివలెనె చల్లదనం కలిగినటువంటిదిన్ని గన్కు వాటికారణం వాలీసువారితో మనవి చేస్కుని నవాబువారి తావున యిలాకా లేకుండా చేస్కుని కుంభిణీ వారి యిలాకాలో చేరినాము. మమ్మును చూచి చుట్టుపట్టువారున్ను తమయిలాకాలో ప్రవేసించినారు. యీ ప్రకారం బహుదినములు రాజ్యం చేసి వారు క్రమించిరి.

తదనంతరం వారికొమారు డైనతిమ్మానాయుడు బహాదరువారు ప్రభుత్వం చేస్తూ వచ్చిరి. వారు వారితండ్రిగా రున్నప్పుడే వారి అనుమతి ప్రకారం పట్ణాన్కు పోయినప్పుడు అక్కడ హైదరు కలాపనలలో చాకలపేట, చింతాద్రిపేట, తట్టుకాపున్ను, లుంగబాక బెత్తిరి అమీరుబాగు మైలాపురి చరపు వగైరా తావుల హైదరువారి పంజుమీద లడాయి చేశి పత్తి చాయడమున్ను వేలూరికి రసదు పౌచాయించడమున్ను ఆ దినములలో శానామంది మాపంజులో జాయా కావడమున్ను యిషువంటి మెహనతులు చాయడం అయినందున లాటు మకారీటున్ను వాలాజావారు జండ్రల్ మెడోసు వారితోకూడా శ్రీరంగ పట్నం స్వారికి మా పంజును సరదారుణ్ణి అంపించినంతల్లో అక్కడ నిండా మెహనతు చేసినారు, వారియొక్క ప్రతాపము లైనపద్యాలు:

సీ. పటుశౌర్యమునఁ జెన్నపట్నముమీఁదను
బహుమందిఫౌజుతో బహదరపుడు
చుట్ల బతేరాలు గట్ల్రదువఁగఁ బెట్టి
పేర్మి ఫిరంగీల పేట్ల కపుడు
మొన చెదరక వెడ మునిముసినగవుతో
ఘనత నేజా వడిగాఁగ దూసి
అరబితేజీ నెక్కి యరిరాజగణముల
యవనులడొక్కల నధికముగను

గీ. దివిరి రణరంగమున నీవు తేటపడఁగ
నఱకునపుడు మహామదల్లి యవుర యనుచు
సకలదాలత్తు లొసఁగినసద్గుణాఢ్య!
ప్రబల దామెర వెంకటప్రభుకుమార!
వరగుణవిరాజ! తిమ్మభూవరబిడౌజ!

శా. రాజాబాదరు తిమ్మభూప! తగురా రమ్మంచు మందల్లి మేఁ
తేజీపాలికి నాల్నగల్ పతకముల్ దేశంబు నీ కిచ్చె మేల్
రాజత్వంబు కుమారపద్దు భళిరా! రారాజదేవేంద్ర! నీ
రాజత్వంబును గీర్తు లెంతు రవురా! రాజాధిరాజావళుల్.

చ. తిరువళికేణినుంచి బహుతీవ్రగతిఁ బడి గుర్రమెక్కినన్
గరమున హేతిఁ బూనియు లగాలగి హైదరుబారు పంజులన్
నటికి జయంబు గాంచినఘనాఘనుఁ డంచు నబాబు మెచ్చఁగా
దురమును జేసితౌ భళిర! దోర్బలశాలివి తిమ్మభూవరా!

ఉ. గండునరాతితండములఁ గానె బిగించియు హేతిఁ బూని బల్
చండతఁగోగ్రకోపమున జన్యముఁ జొచ్చి విరోధిసేనలన్
జెండు వడంగఁగాఁ గదిమి పేరెమువాఱుచుఁ జక్కచక్కగాఁ
జెండినదామెరాన్వయవశీకర! తిమ్మనృపాలకాగ్రణీ!

శా. వీరత్వంబునఁ దేజి నెక్కి చటులోద్వేలారియూథంబులన్
బేరెంబాఱెడు హైదరన్నుదళముల్ వేరైనమైలాపురిన్
బోరం జొచ్చి తురుష్కబృందములనుం బోనీక భేదించి తౌ
ధీరప్రాభవ! దామెరాన్వయమణీ! తిమ్మేంద్రరాజన్మణీ!

మ. నెఱివేగంబున టీపుసైన్యములపై నీథాళ మైలాపురిన్
బరిపంథిన్ దురగంబు నెక్కి వడిగా బాహాసిచే నంటినన్
బెఱుకన్ వెళ్లిరి కంచిమిట్టలకు బల్విద్వేషిభూపావళుల్
తరమే శౌర్యము నెన్నఁగా జగతిలో దామెర్లతిమ్మాధిపా!

సీ. చెలఁగి మైలాపురిచెఱువు లోతట్టున
హైదరుఫౌజుపై నాహవమున
ఘనశిలేదార్లను గంతముల్ విదళించి
మొగలిగరీబుల మొనసి నఱికి
దండిబారునఁ జొచ్చి మెండైనసరదార్ల
కందరములు రాలఁ గదిమి పొడిచి
వడి గలవజ్రీల వక్షములను గ్రుమ్మి
మేలౌజమేదార్ల మెడలు ద్రుంచి

గీ. గర్వ మణఁచియు నాకరీంఖాను నపుడు
కంచి కేగంగఁ దఱిమించి ఘనత మించె
దామెరాన్వయ వెంకటధవుని ముద్దు
తనయశేఖర తిమ్మభూధవవిభుండు.

వీరు కొన్నిదినములు ప్రభుత్వం చేసి క్రమించిరి. తదనంతరం వీరి కుమారు డైనపెదవెంకటప్పనాయనివారు ప్రభుత్వం చేస్తూ వున్నారు. వీరియొక్క పద్యములు :

సీ. అద లెఱుంగవు గదా మదవంతు లగురాచ
కదుపులఁ గొట్టుసింగం బనంగ
భయము నొందవు గదా హయమత్తవారణ
ముష్కరారుల కోట్లు మొనయుపట్ల
చలన మొందవు గదా బలవద్విరోధులఁ
జలపట్టి నుగ్గాడుసమయమునను
బరవ సేయవుగదా పటువిక్రమప్రౌఢి
ప్రళయమై యేతెంచుబలమునైన

గీ. నవుర! నీసైన్య మెన్నంగ నలవి యగునె
సలలితోదార! దామెర్లకులవిహార!
వార్ధిగంభీర! తిమ్మభూవరకుమార!
యూహవాటోప! పెదవెంకటావనీప!

సీ. కప్పు గప్పదు గదా కఠినంపువైరుల
మేనిచర్మంబుల మిసిమి గాని
జలముఁ గ్రోలదు గదా శత్రుమూర్ధన్యుల
బటు వైనమెడరక్తపాళి గాని
మేఁత మేయదు గదా మేటితరాహితు
గుదిగొన్నమాంసంబుగుములు గాని
శబ్ద మియ్యదు గదా శత్రుమూర్ధన్యుల
తలమీఁది బొమిడికతతులు గాని

గీ. యెంత కరకరి యదిగాక యెంత హంత
యెంత వేగంబు గడుసరి యెంత బలము
కలితభవదీయ బాహాగ్ర ఖడ్గశక్తి
యూహవాటోప! పెదవెంకటావనీప!

సీ. కవిగాయకుల బంధుగణములఁ బోషించి
ఘనత కెక్కినయినుగాలవేరు
అరిరాట్పురంబులు దురమున విదళించి
సిరులఁ బ్రబలినదామెరలవేరు
అఖిలదిగ్భాగముల యవనీశ్వరులు మెచ్చ
గణనచే మించుకోర్కంటివేరు
శౌర్యవిస్ఫూర్తిచే జగములు మెచ్చంగ
నుతిమి కైకొన్నవాలూరివేరు

గీ. మీకు వజ్రాలవేరులై మెఱసె నౌర!
మదవదరిమస్తకన్యస్తమకుటరత్న
భాసితపదాబ్జ! తిమ్మభూపాలపుత్ర!
యాహవాటోప! పెదవెంకటావనీప!

వ॥ యీప్రకారం హిందూరాజ్యాదులకు ప్రవేశించిన లగాయితీ మాపెద్దలైనటువంటివారు తమ శ్రేయస్సే కోరి నడుచుకుంటూ వచ్చినారు.

* * *

దామెర వెంకటరాయభూపాలుఁడు

ఉ. శ్రీమహితాబ్ధిజాప్రియుఁడు సేవితరక్షుఁడు సర్వదేవతా
గ్రామణి భక్తవత్సలుఁడు రమ్యఘనోదయకాంతిదేహుఁ డు
ద్దామసరోజలోచనుఁ డుదాత్తశుభంబుల నిచ్చి ప్రోవుతన్
దామెరవంశవారిధిసుధాకరు వెంకటరాయభూవరున్.

## దామెర ముద్దువెంకటభూపాలుఁడు

క. శ్రీకర దామరవంశ సు
ధాకరసంజాత సత్సుధాకర దీన
శ్రీకర రిపుజనబహుళతర
భీకరనిజరూప ముద్దువెంకటభూపా!

క. సారాసారవిచారవి
శారదులును మీరె దామరాన్వయతిలకా
కారులును మీరె బళిరే
వీరసభాచంద్ర ముద్దువెంకటభూపా!

క. అజుఁడు మది వెదకి మిమ్మును
గుజనుల శిక్షింప సుజనకోటులఁ బెంపం
సృజనం బొనర్చె నహహా
విజితారిసమూహా! ముద్దువెంకటభూపా!

క. అమితప్రతాపనమ్రిత
కుమతిశిరస్స్వామ! దుష్టకుంజరసింహా!
సుమశరసన్నిభరూపా!
విమతాచలకులిశ! ముద్దువెంకటభూపా!

క. ధరలో భూపతు లెల్లను
బరబోధలు వినుచుఁ గార్యపరు లౌదురుగా
పరికించి చూడ బహుళను
స్థిరచిత్తులు మీరె ముద్దువెంకటభూపా!

క. శ్రీదామరకులదీపక!
వేదాంతవిచారనిపుణ! విద్వద్విద్యా
వాదరసజ్ఞులు మీరే
లేదు గదా సాటి ముద్దువెంకటభూపా!

క. నే నెవరికి వినిపించెద
దానధురంధరులు సుజనదాక్షిణ్యపరుల్
జ్ఞానాజ్ఞానవిచారులు
నీనాఁటికి మీరె ముద్దువెంకటభూపా!

క. ఇభముఖునితండ్రికరుణను
సభికగుణంబులను గార్యచరులగుణాంబుల్
సభ మెచ్చ వెదకుప్రభువుల
విభుఁడవు దామెరల ముద్దువెంకటభూపా!

క. నలుమొగములు గలవేలుపు
వెలఁదియు మీపలుకులందు వెలసినది భళీ
గలరే మీకు సమానులు
నిలలో దామెరల ముద్దువెంకటభూపా!

క. అపరిమితదయాసాగర!
రిపుజనమత్తేభ కేసరీంద్ర! నరేంద్రా!
యుపకృతిదానవినోదా!
నృపవర! దామెరల ముద్దువెంకటభూపా!

క. మనుజేంద్రులసభలోపల
ఘనతరదాతెవ్వఁ డనెడుగణనకు మొదలన్
వినుతించవలెను మిమ్మును
వినుమీ దామెరల ముద్దువెంకటభూపా!

క. పరమేశ్వరార్చి నటించే
దొరలకు దొర వీవు సాటి దొరకదు భువిలో
మరునయ్య నీకు సముఁ డని
యెఱుఁగుదు దామెరల ముద్దువెంకటభూపా!

క. అనుమాన మేమి లేకను
వినుపించెద నృపవరేణ్య! వినుతప్రజ్ఞా
ఘనుఁడవు కవికమలంబుల
కినుఁడవు దామెరల ముద్దువెంకటభూపా!

క. అష్టామరాంశసంభవ
శిష్టజనత్రిదశభూసురేశ్వర పూజో
త్కృష్టమతి బహుళశభ క్తివి
శిష్టా దామెరల ముద్దువెంకటభూపా!

క. పురహరుఁడు దయను మీపయి
స్థిరముగ నిడి సకలకార్యసిద్ధి నొసంగన్
స్థిరమతి గలవాఁడై సు
స్థిరుఁ డౌ దామెరల ముద్దువెంకటభూపా!

క. పక్షీంద్రవాహనుఁడు మీ
పక్షమునం దుండి కార్యభాగంబులు దా
వీక్షించి సేయువలయును
నీక్షితి దామెరల ముద్దువెంకటభూపా!

క. రతిపతిసన్నుతకాయా
మతిజితనిర్జరసమూహ మానితధిషణా
సతతసురమహీసురవర
హితకర దామెరల ముద్దువెంకటభూపా!

క. బీదలపెదతికముఁ గని
లే దనుచు నొసంగుదాత వీ వనుచు భువిన్
వాదింతు రఖలజనములు
లేదుగ మీసాటి ముద్దువెంకటభూపా!

క. నీసరిసమాన మగునరు
వేసరకయు మదిని నేను వెదకితి రసపై
వీసముపాలికి సమనరుఁ
డీసరికిని గాన ముద్దువెంకటభూపా!

క. కమలాసనాంగనాకచ
సుమశరవరకంఠదేశసుమన స్తంభే
రమగండస్థలమలహార
విమలయశోరూప! ముద్దువెంకటభూపా!

సమాప్తము